ఉగాది సంచికతో ప్రారంభం!

కవిత్రయ విరచితమైన
ఆంధ్రమహాభారతం
తెలుగువారి అదృష్టం
వ్యాస భగవానుని సృజనకు
వాసి అయిన అనుసృజన
చేయడంలో నన్నయ, తిక్కన, ఎర్రనల
కృతి అమోఘం!!
భారతాంధ్రీకరణతో
ముడిపడిఉన్న
ఈ ముగ్గురు కవిమూర్తుల
వ్యక్తిగత జీవిత చిత్రణే
ఈ అపురూప చారిత్రక ధారావాహిక



# భారత మహా
# కవిత్రయం

ఈనాటి సీరియల్స్ ధోరణికి అనుగుణంగా,
వేగం, టెంపో, సస్పెన్స్‌లు మేళవించి,
రచయిత: భాగవతుల సుబ్రహ్మణ్యం
పాఠకుల కోసం ప్రత్యేకంగా విరచిస్తున్న
చారిత్రక ధారావాహిక

స్థాపితం 1908 బొంబాయి : 1914 మద్రాసు

# ఆంధ్ర సచిత్ర వారపత్రిక

ఒరులేయవి యొనరించిన నరవర యప్రియము తన మనంబున కగు దా నొరులకు నవి సేయకునికి పరాయణము పరమ ధర్మపథములకెల్లన్!

వ్యవస్థాపకులు: దేశోద్ధారకకాశీనాథునినాగేశ్వరరావుపంతులు

సంపాదకులు : శివలెంక శంభుప్రసాద్ (1938-1972)

సంపుటం 83 విజయవాడ 5-10-1990 సంచిక 7

శక సం.1912 ఆశ్వయుజ మాసం 13వ తేదీ

ఎడిటోరియల్ ఎడ్వయిజర్: శివలెంక రాధాకృష్ణ

ఎడిటర్: వీరాజీ

ముద్రాపకుడు ప్రచురణకర్త: శివలెంక నాగేశ్వరరావు

## విషయానుక్రమణిక

### ఈ వారం ప్రత్యేకం:



**ముఖచిత్రం**

అందరికీ యిష్టమైన నాట్యభంగిమలో తార 'రజని'

(ఫొటో : జి.కె. నరసింహం)

**విడి ప్రతి వెల నాలుగు రూపాయలు!**

## సంపాదకీయం

మరో రెండు నగరాల్లో సైన్యం ముందుజాగ్రత్త నిమిత్తం ప్రవేశం- ఉత్తర ప్రదేశ్‌కు అదనంగా పోలీసు సైనికబలగాల తరలింపు-లాంటి వార్తలు దేశంలో యుద్ధవాతావరణాన్ని సృష్టిస్తున్నాయి. ఈ యుద్ధం విదేశీ శత్రు బలగాలమీద దేశ సంపదను కొల్లగొట్టే విద్రోహ శక్తులమీద కాదని అందరికీ తెలుసు- దేశంలో నలభైఏడు రోజులుగా (మేమిది రాస్తున్నప్పటికి) సాగుతున్న విద్యార్థుల "ఆత్మహింస" "సంఘ హింస"లతో కూడిన ఉద్యమం ఒకవంక- రామజన్మభూమి-బాబరీ మసీదుల తగాదా మరొకప్రక్క- కుల-మత విద్వేషాగ్నిని రగుల్చుతూ వుండగా- కేంద్రంలో వున్న ప్రభుత్వం- ఉత్తరాది రాష్ట్రాలలో చేస్తున్న మోహరింపు యిది. మండల్ కమిషన్ సిఫార్సులను వీరోచిత కార్యక్రమంగా భావించి శ్రీ వి.పి.సింగ్ ఆగస్ట్ నెల 7వ తేదీన ప్రకటించిన తరువాత- దేశమంతటా ముఖ్యంగా ఉత్తరాది రాష్ట్రాలలో- ముందే 'మూలిగే నక్క' లాగ వున్న పంజాబ్, కాశ్మీర్‌లు సహా, యు.పి., హర్యానా రాష్ట్రాలలో- ఉద్యమం మహోగ్రమైపోయింది. చివరికి విద్యార్థులు తమ నిండు నూరేళ్ల జీవితాన్ని పెట్రోలుతో తడిపి-స్వయంగా నిప్పంటించుకొని- మంటల మధ్య చేస్తున్న హాహాకారాలను కూడా శ్రీ వి.పి. సింగ్ వింటూ తాము

## వీక్లీపోస్ట్

**మమకారం**

ఈ వారం మీ పత్రికలో ప్రచురితమైన కథలు, క్రొత్త సీరియల్ "ప్రణయ వల్లరి" చాల బాగున్నవి.

ముఖ్యంగా "మమకారం," "ఎవరు మనిషి" కథలు పాఠకలోకాన్కి చక్కని సందేశాలను అందిస్తున్నవి. "మమకారం" కథ చదివిన ఏ ఆడది (ముఖ్యముగ పెండ్లీడుకొచ్చినవారు) మగవాడి మనసుని అంత తొందరగ విశ్వసించి మోసపోకూడదనే చక్కని సందేశాన్ని అనునిత్యం మననం చేసుకుంటుంది అని నా విశ్వాసం. లేకపోతే తదనంతర పరిణామాలు ఎలా ఉంటాయో సవివరంగా వివరించారు రచయిత. చక్కని కథ నందించిన రచయితగార్కి, సంపాదకవర్గాన్కి నా అభినందనలు. అలాగే "కొడుకు పుట్టాడు," "ఎవరు మనిషి" అనే కథలు కూడ పాఠకలోకాన్కి మంచి సందేశాన్ని అందించాయని విశ్వసిస్తున్నాను.

'నాన్న పెళ్లి' అంతబాగాలేదు.

సంపాదకులు మంచి రచనలు ప్రచురిస్తున్నారు. ధన్యవాదాలు.

-పి. లక్ష్మణాచార్యులు

యానాం

(70వ పేజీ చూడండి)

# దేశాన్ని ఎటు నడిపిస్తున్నారు?

రోజూ యేదో సందర్భంలో చేస్తున్న 'చర్చల' ప్రకటనలను పునరుద్ఘాటిస్తూ తాపీగా కాలం గడుపుతూ వచ్చారు.

అశాంతిస్థితి కారణంగానే న్యూఢిల్లీలో పెట్టవలసిన జాతీయ సమైక్యతా మండలి సమావేశాలను మద్రాసులో జరిపించారు. శ్రీ వి.పి.సింగ్ గారు- రాజీవ్ గోస్వాములు, సుందర్‌సింగ్ చౌహాన్‌లు కాలిపోతూంటే- వారి సహచరులు పోలీసులను అటకాయించి- "ఆత్మాహుతి దారుణాన్ని" కొనసాగనివ్వబూస్తుంటే- ఆ దృశ్యాలకు ఆసేతు హిమవన్నగమూ కంపించుతూవుంటే- ఎట్టకేలకు దేశ ప్రధానమంత్రికి "వీళ్లూ మన పిల్లలే- వీరిని వూరడించే ప్రయత్నం చేయాలి" అనిపించింది- అదికూడా ఆయన కేంద్ర స్థాయిలో, ప్రభుత్వ హోదాలో చేయ నిష్టపడలేదు. విద్యార్థులతో చర్చలకు- జనతాదళ్ అధ్యక్షుడు శ్రీ బొమ్మయ్‌ని- కమ్యూనికేషన్‌ల మంత్రి శ్రీ జ్ఞానేశ్వర్‌లను నియమిస్తున్నామని- చర్చలు పార్టీ హోదాలో నిర్వహిస్తామని ప్రకటించారు. చర్చనీయాంశం ఏమిటి?- అటు తరువాతి కార్యక్రమం యేమిటి? అన్న అంశం కూడా వెంటనే తెలియరాలేదు. విద్యార్థులు యీ పిలుపును తిరస్కరిస్తారని శ్రీ వి.పి.సింగ్‌కు కూడా తెలుసును.

రిజర్వేషన్‌ల మీద జాతీయ స్థాయి అఖిలపక్ష చర్చలలో విద్యార్థులు పాల్గొనే విధంగా అందుకు అవసరమయిన ఏర్పాట్లు చేయవలసింది పోయి- కంటి తుడుపుగా 'యాంటీ మండల్ కమిషన్ ఉద్యమకారులను చర్చలకు రమ్మన్నారన్న అనుమానం- ప్రాణాలకి తెగించిన విద్యార్థి సంఘాలలో కలిగిందే తప్ప ఆత్మాహుతి ప్రయత్నాలు- హింసాకాండ, హర్తాళ్‌లు, బంద్‌లు తగ్గలేదు.

దేశమంతటా విద్యావ్యవస్థ- రేపటి సంఘానికి పునాది అయిన విద్యా వ్యవస్థ అస్తవ్యస్తమైపోయి- అల్లకల్లోలమైపోయి రోడ్లమీదకు ఆందోళనల వెల్లువ అయి పరుగులు తీస్తూ ఉంటే- ప్రభుత్వం; ప్రభుత్వం ఒక్కటే కాదు- బాధ్యతాయుతమైన యితర జాతీయ పక్షాలు- అందరూ కూడా 'కాగల కార్యం గంధర్వులే తీరుస్తారు' అన్న చందాన- ఎవరి రాజకీయ లబ్ధికోసం వారు- ఉపేక్షను ప్రదర్శిస్తున్నారు. ఒక పెద్ద ప్రజాస్వామ్య వ్యవస్థలో కుల-మత ఘర్షణలు పేట్రేగిపోయే దశలో- సైన్యాన్ని రంగంలోకి దించే ప్రయత్నం యెంత ఆత్మహత్యా సదృశమో వూహించలేని పసిబాలురా? కేంద్ర ప్రభుత్వాన్ని పార్లమెంటును మోస్తున్న పెద్దలంతా?-

'సుప్రీంకోర్టు తీర్పు' అన్న మాట రామజన్మభూమి- బాబరీ మసీదు తగాదాలో నలుగుతున్నదే తప్ప నిన్నగాక మొన్న మండల్ కమిషన్ సిఫార్సుల మీద సుప్రీంకోర్టు పరిగణనలోకి తీసుకున్న కేసుల సంగతి-వీటిని నవంబర్ ఆరవతేదీనాటికి వాయిదా వేస్తూ సుప్రీంకోర్టు న్యాయమూర్తులు చేసిన విజ్ఞప్తి గురించి-ప్రధానమంత్రి దగ్గర నుంచి పార్టీ కార్యకర్తల దాకా ఎవ్వరూ ప్రస్తావించరెంచేతా?

పార్లమెంటు చట్టసభ- అది చేసిన నిర్ణయాలను అమలు చేయడం ప్రభుత్వ బాధ్యత, అయితే ఈ చట్టాలు రాజ్యాంగ నియమ నిబంధవలకి అతీతంగాను వాటికి భంగపాటు తెచ్చేవిగాను వున్నప్పుడు- యీ మీమాంసను తెలిపేది సుప్రీంకోర్టు రాజ్యాంగ ధర్మాసనం "యీ విషయాన్ని ఆ "ధర్మాసనాని"కి కూడా రిఫర్ చేస్తున్నాం- యీ లోగా ప్రభుత్వం- విజ్ఞత ప్రదర్శించి- సంగతి యావత్తు కోర్టులో వున్నదన్న మాట గ్రహిస్తుందనే అనుకుంటున్నాము" అంటూ పరోక్షంగా న్యాయమూర్తులు చేసిన హెచ్చరికను పట్టించుకున్న దేశాధినేతలేరీ? విద్యార్థులు ఒకరికి యిద్దరు; యిప్పుడు యింకా అధిక సంఖ్యలో ఆత్మహత్యలు చేసుకుంటూ వుంటే దేశంలోని పెద్దలు-పెద్ద పార్టీలు విద్యా- విజ్ఞానవేత్తలు అంతా ఏమి చేస్తున్నారు? మధ్యంతర ఎన్నికలలో-ఎవరెవరికి లభించే వోట్లు శాతం ఎంత కాగలదన్న అంచనాలు తీసుకుంటున్నారా? దేశ భవిష్యత్ అనే రథానికి ఏ చక్రం వూడిపోయినా అది కుంటువడుతుంది- శ్రీ వి.పి. సింగ్ తమ వ్యూహ రచనని పన్నాగాన్ని- వెనుకటికి దేవీలాల్‌ని ఏకాకిని చేసి బహిష్కరించడంలో చాలా చాకచక్యంగా నడిపి వుందురేమో కాని ఇది యువత భవిష్యత్తు, ఆ మాటకొస్తే భవిష్యత్ సంగతి దేవుడెరుగు- యువజనుల వర్తమాన సమస్య- మండల్ కమిషన్‌ని సుప్రీంకోర్టుకు అసలు గవర్నమెంటే రిఫర్ చేయాలని యెందరో తల్లిదండ్రులు ఆవేదనలో కోరుతూ వుండగా- అది చేయకపోతే మానె- సుప్రీంకోర్టులో వాద ప్రతివాదాలను విని- న్యాయమూర్తులుఅత్యంత ఆవేదనతో అసాధారణ రీతిలో చేసిన విజ్ఞప్తినైనా శ్రీ వి.పి. సింగ్ 'యిన్ బిట్వీన్ ది లైన్స్' చదవ నిరాకరిస్తే ఎట్లా! దేశ ప్రధానమంత్రి దేశం కన్నా గొప్పవాడు కాదు. విద్యార్థులు దేశంలోని ప్రధానభాగం- పునాదిరాళ్లు. వీళ్లతో చర్చించడానికి ఆయన సంకోచించకూడదు- అది 'డిగ్నిటీ'కి భంగం కాదు- ప్రతిష్టకి ఆటంకంకాదు. మొదట ఈ ఆత్మాహుతి పరంపరని- సైన్యాల మోహరింపులను ఆపే ప్రయత్నం చేయండి. చేతులు కాలాక ఆకులు పట్టుకునే పద్ధతులకు స్వస్తి చెప్పడం అందరికి అన్ని వర్గాలకు మంచిది- 'మండల్ కమిషన్ మంటల్లో ఎవ్వరూ ఆహుతి కారాదు' ఆస్తులకన్నా అంతస్తులకన్నా పంతాలకన్నా- ప్రజల ప్రాణాలు విలువైనవని- అన్ని రాజకీయ పక్షాలు- గవర్నమెంటూ- ఉద్యమకారులూ కూడా గ్రహించి- ప్రత్యామ్నాయ మార్గాన్వేషణకు తక్షణం నడుం బిగించమని సజల నయనాలతో హెచ్చరిస్తున్నాము.

25-9-90

# భలేమామ

- అవధానుల సుధాకర రావు



నేను భవానీ మెళ్లో తాళి కట్టడం వల్ల- ఘనత వహించిన గోవర్ధన శాస్త్రి గారికి చిన్నల్లుడి నయ్యాను. ఇంకా ఆయనకి ఐదేళ్ళ సర్వీసుంది. అదృష్ట వంతుడు. బాధ్యతలన్నీ తీర్చేసుకుని- చీకు, చింతా లేని జీవితం గడుపు తున్నాడు.

వ్యక్తుల్నీ, వాళ్ళ తీరు తెన్నుల్ని జాగ్రత్తగా గమనించి- మనస్తత్వాలని నిశితంగా పరిశీలించి- తగు విధంగా రచనల్లో ఉపయోగించుకోవడం నా కలవాటు. ఆ దృష్టితో నే మా మామగార్ని ఆర్నెల్లపాటు 'స్టడీ' చేశాను. కథేవిటి:... ఓపికుండాలే గాని, నవలే రాసి పారెయ్యొచ్చు ఆయనగారి గురించి. బహు విచిత్రమయిన స్వభావం ఆయన్ని. ఆయనకి ముగ్గురు కూతుళ్లు, ఇద్దరు కొడుకులు. లోక విరుద్ధంగా- కూతుళ్ళ పట్ల వల్లమాలిన ప్రేమానురాగాలు కురిపిస్తూ, కొడుకుల మీద మండిపడేవాడు. పుత్రులంటే- గోతులు త్రవ్వే వాళ్ళని, విశ్వాస ఘాతకులని ఆయన ఉద్దేశం. మన ఆస్తి పాస్తుల మీద కన్నేసి ఉంచే దొంగలు, స్వార్థపరులు కొడుకులని చీదరించుకుంటూ ఉంటాడు. కూతుళ్ళు ముగ్గురి మీద మమకారం సమానమేనని అందరూ అనుకుంటారు కాని- నా భార్య భవానీ పట్ల తండ్రిగా మరింత ఎక్కువగా స్పందిస్తారని నేను కనిపెట్టాను.

ఎటొచ్చి, మా బావమరుదుల విషయంలోనే ఆయన పోకడ విడ్డూరం గొలుపుతుంది అయితే గుడ్డిలో మెల్లలా– మా పెద్ద బామ్మర్ది సీతారాముడు విషయంలో ఇప్పుడప్పుడు కాస్త ఉదారంగా వ్యవహరిస్తుంటారు అందుకో కారణం లేకపోలేదు వాడు ఎం ఎస్ సి లో గోల్డ్ మెడల్ సాధించి, సొంతంగా బ్యాంక్ ఆఫీసర్ ఉద్యోగం సంపాదించుకుని, తన కాళ్ళ మీద తను నిలబట్టం వల్ల అప్పుడప్పుడూ పెద్ద కొడుకుని కాస్త వెనకేసు కొస్తుంటాడు పాపం చిన్నవాడే చదువు, సంధ్య లేక– దారిలోపెట్టే నాధుడు కరువై– అల్లరి చిల్లరగా తిరుగుతుంటే– ఆయన కోపంతో రంకెలు వేస్తూ, కక్షతో పళ్ళు నూరుతూ, వాడసలు నా కొడుకే కాదు అంటూ శతృత్వాన్ని ప్రకటించేవాడు

"ఏదో ఒక దారి చూపించండి పాపం " అని ఎవరన్నా మంచి చెప్పబోతే–

"నాకు సంబంధం లేదండీ గడ్డాలు, మీసాలూ వచ్చాయి– వాడికామాత్రం జ్ఞానం ఉండక్కర్లే ? పోనివ్వండి గాడిదలు కాస్తాడో అడుక్కుతినే బ్రతుకుతాడో– నా కనవసరం " అనేవాడు ఖరాఖండిగా

* * * * * *

తన మాటని ఎంతమటుకు నిలబెట్టు కుంటాడో తెలీదు కాని– "స్వార్జిత మైన నా యావదాస్తిని– నా ముగ్గురు కూతుళ్ళకి రాసిపారేస్తాను " అంటూ కొడుకుల్ని తరచూ బెదిరిస్తుంటారు మా మామగారు

బడిపంతులు ఉద్యోగమే అయినా– రాబడికేం లోటు లేకపోవడంతో – ఆయన పరిస్థితి సుసంపన్నంగా వెలిగి పోతోంది

ఆర్థిక విషయాల్లో మా 'మామ' మహా ఘనుడు డబ్బుని సంపాదించడంలో ఆయన కాయనే సాటి ట్యూషన్లు చెప్పడం పరీక్ష పేపర్లు దిద్ది, ఇన్విజిలేషన్ డ్యూటీలు చేసి అబ్బో ఇంకా ఎన్నెన్నో మార్గాల ద్వారా లక్ష్మీదేవి ఆయన వద్దకు ఘల్లు, ఘల్లున నడిచొస్తుంది

మనిషికో పిచ్చి అన్న చందాన, మా మామాజీ కూడా ఓ 'పైత్యం' లేకపోలేదు

ఇంటి చుట్టు ముట్టూ ఉన్న బోల్డంత ఖాళీ స్థలంలో– ఎప్పుడూ ఏదో ఒక నిర్మాణపు పనులు నిర్వహించడంలో ఆయనకి గొప్ప సరదా ఎనలేని తృప్తి కూలి జనానికి మహరాజ పోషకుడు

రాజుల సొమ్ము రాళ్ళపాలు అని ఊరికే అనలేదు తన సొంతానికి గాని, పెళ్ళాం, కొడుకులకి గాని ఓ పది రూపాయలు ఖర్చు చెయ్యాలంటే మనసొప్పని పెద్ద మనిషి– 'మెటీరియల్' కి లేబర్ చార్జెస్' కి గాను వెలకి వెలు తగలేసి– . ఇల్లుపీకి పందిరేసిన చందాన వ్యవహరించేవాడు ఇవ్వాళ గొడ్లపాక కట్టించడం రేపు ఆ పశువుల్ని అమ్మి పారేసి, ఆ గొడ్లపాక స్థానంలో ఓ 'స్టోర్ రూం'ని కట్టించడం మరికొన్ని రోజులకి దాన్ని కూలగొట్టించి, ఓ 'ఔట్ హౌస్' లాంటిది నిర్మించడం ఎండాకాలం చల్లగా ఉంటుందని ఓ 'పూరి గుడిసె' ఏర్పాటు చేసుకుని, ఆ మూణ్నాళ్ళు కాగానే దాన్ని డిమాలిష్' చేయించి– ఆ స్థానంలో మరేదో కట్టిస్తూ ఇలా 'తుగ్లక్' పనులతో తన కష్టార్జితాన్ని పాడు చేస్తూ ఉంటాడు

నేను సతీ, సమేతంగా నెల, రెణ్ణెళ్ళకి వెళ్తుంటానా! ప్రతిసారీ కన్ఫ్యూజనే ఏ 'పోర్షన్'లో ఉన్నారో వెదుక్కోవలసిందే

అర్థం కాలేదు కదూ! వాళ్ళది నాలుగు పోర్షన్లుగా విభజించి కట్టబడిన పాతకాలపు ఇల్లు పిల్లి తన పిల్లల్ని మార్చిన తీరుగా– మా మామగారు బుర్రలో పురుగు తొలిచినప్పుడల్లా, కిరాయిల కిచ్చిన మూడు పోర్షన్లు ఏదో ఒకదానిలోకి మారిపోతుంటారు పాపం అద్దెలకుండే వాళ్ళు ఆయన నోటికి వడిసి– తాము కూడా ఆ ఇంట్లో ఉండే నాలుగు పోర్షన్ల చుట్టూ పరిభ్రమిస్తూ ఉండేవారు శీతాకాలంలో దక్షిణం వైపు, ఎండాకాలంలో ఉత్తరం దిక్కుగా ఇలా పిచ్చి నమ్మకాలతో తరచూ 'మకాం' మారుస్తూ ఉంటాడు.

## ప్రతాప్ మళ్ళీ పెళ్ళి!

ప్రముఖ సినీ నటి మాజీ భర్త, నటుడు ప్రతాప్‌పోతన్ యిటీవల కేరళ అమ్మాయిని పెళ్ళి చేసుకున్నాడు. అమలా సత్యనాధ్ అనే ఆ అమ్మాయి కొచ్చిన్‌కు చెందినదట. వీరిచ్చినవిందుకు అనేక మంది సినీ ప్రముఖులు హాజరయ్యారు. రాధిక యిటీవలే ఒక పారిశ్రామికవేత్తను వివాహం చేసుకున్న విషయం విదితమే. రాధికే చేసుకోగా లేంది నేనెందుకు చేసుకోకూడదనుకుని పోటీగా చేసుకున్నట్టుందీ పెళ్ళి.



ఇంకా నయం! అద్దెకుండే వాళ్ళందర్నీ ఖాళీ చేయించి- ఉదయం పూట ఉత్తరం వైపు, మధ్యాహ్నం తూర్పు వైపు.. అంటూ, అన్ని వాటాల్లోనూ మేమే ఉంటామని అన్లేదు

ఆయనకి చపల చిత్తం కూడా ఉంది. ఒకసారి తన 'మోపెడ్'ని అమ్మడానికి నిశ్చయించుకుని, వెయ్యి రూపాయలు అడ్వాన్సు కూడా పుచ్చుకున్నాడు. అంతలో మళ్ళీ బుర్ర తిరిగి- తెల్లారకుండానే పరుగెత్తు కెళ్ళి, "బాబూ? ఇదిగో నీ వెయ్యి రూపాయలు. నా వాహనాన్ని అమ్మదల్చుకోలేదు..." అని, ఎంచక్కా వెళ్ళిపోతుంటే ఆ ఆసామి నిలువు గుడ్లేసుకుని చూశాట్ట.

★ ★ ★ ★

## భలే మామ

మాటల్లోనే తిలకించండి.

"...మా పెద్దాడి భార్య అప్సరసే అనుకోండి. వాడి అత్తగారు...? సాక్షాత్తూ అతిలోక సుందరే. 'సినీ స్టార్'లు కూడా దిగదుడుపే. ఇద్దర్నీ నిలబెట్టి చూస్తే అక్క చెల్లెళ్ళనుకో వలసిందే గాని - తల్లీ కూతుళ్ళని ఎంతమాత్రమూ ఊహించలేం. ఆవిడ వయసు - బిలో ఫర్టీఫైవ్. ఆ 'అందం, నాజూకుతనం, ఓహ్... కవుల భాషలో చెప్పాలంటే పరిపూర్ణంగా వికసించిన తెల్ల కలువలా, అనుక్షణం తాజాగా కన్పిస్తూ..." అంటూ వియ్యపురాలిని వెయ్యింతలుగా పొగిడేవాడు..



ఆడపిల్లల పెళ్ళి విషయంలో ఎంత విజ్ఞత ప్రదర్శించాడో- కొడుకుల విషయానికొచ్చేసరికి మొక్కుబడిగా వ్యవహరించి చేతులు దులిపేసుకున్నారు మా మామగారు.

"చెవులకి చేటలు కట్టి, ఆడించే పెళ్ళాలు దొరకాలి-ఈ వెధవలకి. చీటికి మాటికి చీపురుకట్ట తిరగేసే కోడళ్ళకి కట్టబెడితేగాని బుద్ధి రాదు- ఈ అడ్డ గాడిదలకి..." అంటూ అందరిముందూ నోరు పారేసుకునేవాడు.

రెండు పెళ్ళిళ్ళూ ఒకే ముహూర్తాన జరిగేయి.

మా సీతా రాముడి భార్య చక్కని చుక్కే. సందేహంలేదు. ఆ పిల్ల తల్లి మాత్రం...? ఆ వైనం మా మామాజీ

ఆ తరువాతనుంచీ చేదైన అనుభవాలు మొదలయ్యాయి. మా మామగారిలో చెడ్డతనం బయటకు రాసాగింది. పెద్ద కోడల్ని అందల మెక్కించడంతో పాటు-తన సహ ధర్మచారిణిని తనే కించపర్చడానికి వెనుదీయలేదు.

"ఒసేయ్ అంట్ల మొహమా? కోడలికి దేభ్యంముండా! సునీత స్నానానికి నీళ్ళు పెట్టు..."అని ఆర్డర్లు వేస్తూ, పరిచర్యలు చేయిస్తూ- విపరీతపు పోకడలో ఉత్తమురాలు, పాతకాలపు మనిషి అయిన మా అత్తగారికి గుండెకోత కలిగించడమే కాదు- ఈ మధ్య చెయి కూడా చేసుకుంటున్నాడని వార్తలందేయి.

పండక్కి, పబ్బానికి సీతారాముడు భార్యతో సహా వేం చేసేవాడట. ఆ మూర్ఖోజులూ మా అత్తగారు- పాపం, ప్రాణాలరచేతిలో పెట్టుకుని గడుపు తుంది. అదేం చోద్యమో వాళ్ళిద్దరూ కూడా మా మామగారి పక్కన చేరి, ఉన్నవి లేనివి చెప్పి, పుల్లలు పెట్టి ఆ 'మూర్ఖణ్ణి' ఆవిడమీదకు ఉసిగొల్పి ఉసూరుమనేలా హింసింపచేసి-ఆమె ఉసురు పోసుకునేవాళ్ళు.

మా సీతారాముడి భార్యామణి అందాలభరిణ మాత్రమే కాదు. గొప్ప నెరజాణ కూడా. మాటల మనిషైన మా మామగారి కేమాత్రం తీసిపోదు.

"...ఏవండి! కాఫీ ఎలా ఉంది?" అభిప్రాయం అడిగింది.

"ఇది కాఫియా...?" మా మామగారి ప్రశ్నకి అందరూ ఉలిక్కి పడ్డారు. "అంటే...?" సునీత బిక్కముఖం పెట్టింది.

"అవునమ్మా! అమృతాన్ని పట్టుకుని కాఫీ అంటావేం?"

ఆయన వివరణకి సునీత ఉబ్బి పోయింది. నిజానికి ఆ కాఫీ పరమ దరిద్రంగా ఉన్నా - పెద్ద కోడలు స్వహస్తాలతో చేసి పట్టుకొచ్చింది కాబట్టి మా 'మామాశ్రీ'కి అది మహా ప్రసాదం.

★ ★ ★ ★ ★

"ఉత్తరాలేమన్నా వచ్చాయండీ...? అలవాటు ప్రకారం, ఆఫీసు నుండి రాగానే అడిగింది శ్రీమతి.

"ఏమీ రాలేదు కాని- ఓ విచారకర వార్త తెలిసింది..." భారంగా పలికింది నా గొంతు.

"ఏవిటండీ అది...?" ఆదుర్దాగా అడిగింది భవానీ.

"మీ అమ్మగారికి బొత్తిగా ఒంట్లో బాగో లేదట. హాస్పిటల్లో చేర్పించారట." చెప్పాను. భవానీ ముఖంలో విషాదం.

"... మీ చిన్నన్నయ్య ఇవ్వాళ మా ఆఫీసుకొచ్చాడు. సి. పి. ఐ. మహా సభలకని ఈ ఊరొచ్చారట. ఇంటికి రావడానికి టైం లేదని- అక్కడ కలిశాడు నన్ను.

పెద్దకోడలు, వియ్యపురాలు విచ్చేసిన

ప్రత్యేక సందర్భంలో- మీ అమ్మ భోజనంలోకి స్వీట్ ఐటం ఏర్పాటు చెయ్యలేదన్న కోపంతో- అందరి ముందూ ఆవిడ మీద చెయ్యి చేసు కున్నాట్ట- జ్వరంగా ఉందని కూడా చూడకుండా! నువ్వేమన్నా అనుకో భవానీ! మీ నాన్న రోజు రోజుకీ "రాజనాల" కంటే భయంకరమైన 'విలన్'లా తయారవుతున్నాడు " అన్నాను

"నిజమేనండీ, ఈ సమస్యకి పరిష్కారం ?" బేలగా ప్రశ్నించింది

"ఉంది దానికి నీ సహకారం అవసరం "

"చెప్పండి ఏం చెయ్యాలో " మెరిసే కళ్ళతో అంది

నా 'ప్లాన్' సమగ్రంగా వివరించి చెప్పానామెకి ఆమె సంతోషంగా-

"ఈ దెబ్బతో మానాన్నకి పట్టిన దెయ్యం వదులుతుంది " అంటూ తన ఆమోదం తెలిపింది

* * *

"అల్లుడుగారూ! మీ కోపం, అదీ చూస్తుంటే- మీరు మీరేనా? అన్న అనుమానం కలుగుతోంది సంగతేమిటి? అమ్మాయేవన్నా " ఎంతో బాధగా ధ్వనించిన మా మామగారి ఈ ప్రశ్న వెనుక- రెండ్రోజుల నుండి రసవత్తరంగా మేమాడుతున్న 'డ్రామా' దాగుంది లోలోపల నాకూ నరకంగానే ఉంది- నా ప్రాణాధికమైన భవానీ పట్ల దుర్మార్గంగా, క్రూరంగా ప్రవర్తిస్తూ, ఆమెని చెండుకు తింటున్నందుకు 'శాడిస్టు'లా నటించడానికే నేనింత బాధపడుతున్నానే- మరి. నిజంగా అలా ప్రవర్తించే వాళ్ళకి మనసనేది ఉండదు కాబోలు

"అవును మామగారు! నాకు మీరే ఆదర్శం మీ అడుగు జాడల్లోనే నేను కూడా నడవడానికి నిశ్చయించు కున్నాను " మాటల్లోనే భవానీ అక్కడ ప్రత్యక్షమయింది నేను ఉగ్రరూపంతో ఆమె చెంప ఛెళ్ళుమనిపించి- "ఒసే ఇడియట్! కాఫీ తెమ్మని చెప్తే- తాగ్గా చీపురు పట్టుకుని, ఇల్లు ఊడవడానికి తయారయ్యావా? చంపేస్తాను వెళ్ళి కాఫీ పట్టా " హుంకరిస్తూ, రంకెలు వేశాను గుడ్ల నీరు కక్కుకుంటూ వెళ్ళింది భవానీ

"మామగారూ! ఈ ఆడాళ్ళని 'కంట్రోల్లో' ఉంచాలంటే- వాళ్ళ తప్పు ఉన్నా, లేకున్నా- అప్పుడప్పుడూ ఇలా 'కోటా' తగిలిస్తూ ఉండాలి కదూ!

పెళ్లాం అంటే ఓ బానిస చెప్పు క్రింద తేళ్లా అణచి ఉంచాలి ఈ గొప్ప పాఠం మీ దగ్గర్నుంచి నేర్చుకుని, ఆచరణలో పెడుతున్నాను మీ దగ్గర ఇలాంటివే ఇంకా ఎన్నో నేర్చుకుని- మీ అంతటి వాణ్ణి కావాలనే ఉద్దేశంతో వారం రోజులు శలవు పెట్టి మరీ వచ్చాను మామగారు!"

ఆ రాత్రి మా మామగారు భోజనం వద్దన్నారు నేను పరామర్శిస్తూ-



## పరుచూరి ప్రతిభ

ఈనాడు అగ్రశ్రేణి సినీ రచయితల్లో ఒకరయిన పరుచూరి గోపాలకృష్ణ రచన చేసేటప్పుడు– టేబిల్– కుర్చీల్లాంటి పరికరాల్ని అసలు వాడరు బోర్లా పడుకొని– పేడమీదున్న తెల్లకాగితాల మీదనే దృష్టిని కేంద్రీకరించి– చకచకా రాసుకు పోతారు అదే స్పెషల్ స్క్రిప్టు ! అదే ఆయన సెంటిమెంటు కూడా!!

—సాధన

"ఎందుకనండీ? ఆకలిగా లేదా? ఒంట్లో బాగోలేదా?" అడిగేను కనీసం లైటు కూడా వేసుకోకుండా, చీకట్లోనే ఉండిపోయారు కొంత సేపటికి గొంతు పెగుల్చుకుని- "ఎలా సయిస్తుందయ్యా తిండి ! నాకళ్ళెదుటే నువ్వు భవానీ పట్ల కిరాతకంగా ప్రవర్తిస్తుంటే- నట్టింట నా కూతురు పుట్టెడు దుఃఖంతో తిరుగుతుంటే- నన్ను మేకల్లాగ తిని, కంటి నిండా నిద్రపొమ్మంటావా చెప్పు?

"బాబూ భాస్కరం! ఈ ఘోరం నేను కళ్ళతో చూడలేను దయచేసి మీరిద్దరూ రేపే వెళ్ళిపోండి " దీనంగా, ఆవేదనగా అన్నారాయన అనుకున్న ప్రయోజనం నెరవేరింది కాబట్టి- నిజం చెప్పేద్దామన్న ఉద్దేశ్యంతో- "క్షమించండి మామగారూ! ఇదంతా కేవలం నాటకం. ' అంటూ, భవానీని పిల్చి- ఆమె చేతే విషయమంతా చెప్పించెను ఆయన ముఖంలో 'రిలీఫ్'తో కూడిన తేట దనం

"అల్లుడూ! కళ్ళు మూసుకుపోయి, గుడ్డిగా ప్రవర్తిస్తున్న నాకు మా బాగా గడ్డి పెట్టావయ్యా!" ఆయన చెప్తుండగానే, మా అత్తగారు కూడా ఏదో పని మీద అక్కడ ప్రత్యక్షమయింది

"కాంతం! నన్ను క్షమించు నిన్ను క్షోభ పెట్టాను నాలాంటి వెధవల దిగజారుడుతనానికి- అసలైన శిక్ష చెప్పు దెబ్బలే " ఆయనకి జ్ఞానోదయమైందని రూఢీ అయ్యాక- మనసుకెంతో హాయిగా అన్పించింది

ఆయన నా రెండు చేతులూ పట్టుకుని- "బాబూ! చిన్నవాడివైనా నీకు చేతులెత్తి మొక్కాలి ఆ రోజు పెళ్ళిలో- కన్యాదానం కోసం నీ కాళ్ళు కడిగేను ఇవ్వాళ నువ్వు చేసిన ఈ మంచి పనికి మరోసారి భక్తితో నీ కాళ్ళు కడిగి, ఆ నీళ్ళు నా నెత్తిన జల్లు కోవాలనుందయ్యా "

ఏదొచ్చినా ఇంతే ఆయన్ని పట్టలేం ప్రతి చిన్న విషయానికి ఇట్టే చలించిపోతాడు అందుకే- ఆయనగార్ని- 'భలేమామ' అని పిలవాలనిపిస్తుంది నాకు

O

# పాతనగరం జాగాలో సరి

## హైదరాబాద్‌కి కొత్త సదుపాయాలు హంగులు



శ్రీ కె వి రమణాచారి

***భాగ్యనగరం 400 సంవత్సరాల పండుగ సందర్భంగా పాత నగరాభివృద్ధి సంస్థ "కులీకుతూబ్‌షా" ప్రాధికారి శ్రీ కె.వి. రమణాచారిని శ్రీ వేదగిరి రాంబాబు చేసిన ఇంటర్వ్యూ.***

మనదేశంలోని అతి పెద్ద నగరాలలో హైదరాబాద్ ఆరవది ఇప్పుడున్న నగర విస్తీర్ణం డెబ్బైనాలుగు చదరపు మైళ్ళంటే దాంట్లో అరవై రెండు చ మైళ్ళ విస్తీర్ణం పాత నగరం కాబట్టి హైదరాబాద్ అభివృద్ధి పాత నగరాభివృద్ధి మీద ఆధారపడి వుంది

1869 వరకు గోల్కొండ కోట అధీనంలో వున్న హైదరాబాద్‌కు, 1869లో సాలర్‌జంగ్ I నగరాభివృద్ధికో పాలక సంస్థని ప్రారంభించాడు అప్పట్లో చాదర్‌ఘాట్, బంజారాహిల్స్, ఆధునిక నగరాలకు వేరు వేరు పురపాలక సంస్థలుండేవి 1933లో వీటన్నింటినీ కలిపి ఒకే సంస్థని చేశారు మొట్టమొదటి పురపాలక సంఘ ఎన్నికలు 1934లో జరిగాయి ప్రభుత్వ అధికారులకు, కార్పొరేషన్‌కి మధ్య స్పర్థలు చెలరేగడంతో 1942లో కార్పొరేషన్ చిక్కుల్లో పడింది అప్పుడు కార్పొరేషన్ రద్దు చేసి, ఓ ప్రభుత్వ అధికారిని పురపాలక సంఘ విధుల్ని చూడడానికి నియమించారు 1951 వరకూ ఇలాగే కొసాగింది

1950లో మొదటిసారిగా హైదరాబాద్ కోసం ఒకటి, సికిందరాబాద్ కోసం ఒకటి వేరు వేరుగా కార్పొరేషన్లు వుద్భవించాయి ఇలా పాత నగరాభివృద్ధి సంస్థకు బీజం పడింది

"ఇధర్ దేఖియే ఏ దవాఖానా హై"



పాతనగరం విస్తీర్ణం ఎక్కువ కావడంతో, ఆ ప్రాంతంలో అభివృద్ధి లేకపోతే నగరాభివృద్ధే వుండదు పాతనగరంలో జనాభా ఎక్కువ వుండి వసతులు తక్కువ అనారోగ్య పరిస్థితుల్లో వున్న గుడిసెలు ఎక్కువ ఈ పరిస్థితులు చక్కదిద్దాలంటే ఆర్థిక వనరు౹ కావాలి ప్రత్యేక బాధ్యత స్వీకరించే వారుండాలి మున్సిపల్ కార్పొరేషన్ హైదరాబాద్ నగరాభివృద్ధి సంస్థలు మొత్తం నగరాభివృద్ధి చూసుకుంటూ వుండడంతో పాతనగరం, బాధ్యతల్ని ప్రత్యేకంగా చూడడానికి 'కులీ కుతూబ్ షా' నగరాభివృద్ధి సంస్థ ఏర్పడింది ఈ సంస్థ ప్రాధికారి శ్రీ కె వి రమణాచారి ఇంతకుముందు ఈయన మున్సిపల్ అడ్మినిస్ట్రేషన్‌లో డెప్యూటీ సెక్రటరీగా వుంటూ కులీ కుతూబ్‌షా బాధ్యతల్ని అదనంగా నిర్వర్తిస్తుండేవారు ఈ మధ్యే ఆయనని ఫుల్‌టైమ్ అధికారిగా కులీకుతూబ్‌షాకి నియమించింది ప్రభుత్వం

ఈ ఐ ఎ ఎస్ అధికార్ని ఈ సంస్థ నుండి వేరే చోట్లకి మూడుసార్లు బదిలీ చేసినా మూడుసార్లూ పాతనగరంలోని అన్ని పార్టీల నాయకులు, ప్రజలూ ఏకకంఠంతో కోరి ఆయనను వెనక్కి తెప్పించుకున్నారు

పాతనగరాభివృద్ధిలో జరుగుతున్న కృషిని తెలుసుకోవడం జరిగింది

"కులీకుతూబ్‌షా సంస్థతో మీకు మీతో కులీ కుతూబ్‌షా సంస్థకు అవినాభావ సంబంధం ఏర్పడి పోయిందే" అన్న ప్రశ్నకు జవాబుగా చిరునవ్వు నవ్వి "ఇది నా బాధ్యత నా బాధ్యతని నేను సక్రమంగా నిర్వర్తించడానికి ప్రయత్నిస్తున్నాను అన్నారు నెమ్మదిగా"

### ఇరుకుదారులు

ఆయన అన్నారు - "పాత నగరంలో రోడ్లు చాలా యిరుగ్గా వున్నాయి ఒక రోడ్డుకి మరో రోడ్డుకి సరైన కనెక్షన్స్ లేవు అందుకని రోడ్లని ఒక పద్ధతి ప్రకారం నిర్మించడం అవసరం లేకపోతే అసౌకర్యమే కాదు శాంతి భద్రతలకూ ముప్పు వాటిల్లవచ్చు 17 రోడ్లని వెడల్పు చేశాం అవి చార్మినార్ నుండి చాంద్రాయణగు

# కొత్త నగరం సాధ్యమా?

## అభివృద్ధి పథంలో పాతనగరం

ట్టరోడ్లు, తప్పాచి బుర్జ నుండి అసిఫ్ నగర్ రోడ్లు, ముస్లిమ్ జంగ్ పూల్ నుండి పురానాపూల్ వయా జుమ్రాత్ బజార్, చంచల్ గూడా నుండి డబీర్ పూరా రోడ్లు, బడాబజార్ రోడ్, మోతిగల్లీరోడ్ మొదలైన పదిహేడు రోడ్లని విశాలం చెయ్యడం జరిగింది అలాగే ప్రజల సౌకర్యం కోసం కొన్ని బ్రిడ్జి పనులు చేపట్టాం పురానాపూల్ బ్రిడ్జితో పాటు ఆ జంక్షన్ ని అభివృద్ధి చేస్తున్నాం డబీర్ పుర బ్రిడ్జి పూర్తవుతోంది అంబర్ పేట క్రాస్ వే, మొగల్ కానాలా బ్రిడ్జి పనులు పూర్తయ్యాయి ఈ రోడ్లని నిర్మించడానికి, బ్రిడ్జిలను నిర్మించడానికి పాత నగరాభివృద్ధి సంస్థ 866 69 లక్షల రూపాయల్ని వెచ్చించింది అంతే కాదు పాతనగరానికి వచ్చే 'హైవే'ల అభివృద్ధికి మేము కృషి చేస్తున్నాము రోడ్లు భవనాలు అభివృద్ధి శాఖ సాయంతో బహదూర్ పుర-రాజేంద్రనగర్ రోడ్, శ్రీశైలం రోడ్, నాగార్జునసాగర్ రోడ్, లింగంపల్లిరోడ్ లను మెరుగుపరిచే కార్యక్రమాలకు 229 7 లక్షలవుతుంటే దాంట్లో వంద లక్షల భారాన్ని కులీకుతూబ్ షా సంస్థ భరిస్తోంది కర్నూల్ రోడ్ ను అభివృద్ధి చేస్తున్నాం ఇట్లా వారు పాత నగరాభివృద్ధి సంస్థ చేపట్టిన రోడ్లు, బ్రిడ్జీల అభివృద్ధి కార్యక్రమాల్ని గుక్క తిప్పుకోకుండా వివరించారు "

ప్రశ్న మొత్తం పాతనగరాభివృద్ధినంతటినీ ఈ సంస్థే నిర్వహిస్తోందా, మిగతా డిపార్టుమెంటుల ప్రమేయం లేకుండా?

జవాబు "లేదండి, ఆర్ అండ్ బి, మున్సిపల్ కార్పొరేషన్, ఎలక్ట్రిసిటీ బోర్డ్, వాటర్ వర్క్స్ మొదలైన డిపార్టుమెంట్లన్నీ వాటి పనులే చేస్తున్నాయి కాకపోతే ఆయా కార్యక్రమాల్ని చేపట్టడంలో వాటికేమైనా ఇబ్బందులొస్తే మా సంస్థ వెళ్లి సహకరిస్తుంది అవసరమైన చోట ఆర్థిక సహాయాన్ని అందిస్తుంది

ప్రశ్న "మీరు రోడ్ల వైడెనింగ్ లో కొంత మంది ప్రజల స్థలాల్ని తీసుకోవలసి వస్తోంది కదా?" అప్పుడెలా చేస్తున్నారు

జవాబు "అలాంటప్పుడు వారు వుండడానికి వేరే స్థలాన్ని ముందు చూపించి అప్పుడు ఖాళీ చేయమంటున్నాం వారి యిబ్బందుల్ని మనం గమనిస్తే వారు మనల్ని యిబ్బంది పెట్టరు" అన్నారు రమణగారు

ఇంతలో క్రొత్త డిస్ట్రిక్ట్ బస్టాండ్ ఫౌండేషన్ కి టైము కావడంతో తనతో నన్నూ రమ్మని అహ్వానించారు శ్రీ రమణగారు కార్లో బయలుదేరాం

"నేను ప్రజల మనిషిగా పని చేస్తున్నాను ఆర్టీసివాళ్లు బస్టాండ్ ను ఇక్కడికి


హైకోర్టుదారిలో వనమహోత్సవం కావాలి?

మార్చాలనుకున్నప్పుడు ఈ స్థలం ఆర్టీసీకి రావడానికి నా శాయశక్తులా కృషి చేసాను" అని చెప్పారు

ఫౌండేషన్ కార్యక్రమం పూర్తయిన తరువాత తిరిగి కులీకుతూబ్ షా ఆఫీసుకి బయలుదేరాం

### డ్రయినేజీ

పాతనగరంలో డ్రైనేజి కార్యక్రమాల్ని పెంపొందించడానికి 42458 లక్షల్ని ఖర్చు పెట్టబోతున్నారు దాంట్లో మున్సిపల్ కార్పొరేషన్ కి మా సంస్థ చేయూత నిస్తోంది అలాగే వీధి దీపాలన్ని చోట్ల వుంచడానికి ఎలక్ట్రిసిటీ బోర్డ్ సాయంతో మా సంస్థ కృషి చేస్తోంది అన్ని ప్రాంతాలకి నీటి సౌకర్యం లభించేటట్లు వాటర్ టాంక్స్ వుండేటట్లు చూడడానికి హైదరాబాద్ మెట్రోపాలిటన్ వాటర్ వర్క్స్ డిపార్టుమెంటుతో కలిసి కృషి చేస్తున్నాం వీటన్నిటికన్నా ముఖ్యంగా పరిసర పారిశుద్ధ్యానికి, శానిటేషన్ ప్రోగ్రామ్స్ కి కృషి చేస్తున్నాము చెట్లు లేకపోవడం వల్ల నానా రకాల ఇబ్బందుల్ని ఎదుర్కొంటున్నాం అందుకని పాతనగరంలో చెట్లని పెంచడంలో కూడా ప్రత్యేక శ్రద్ధ తీసుకుంటున్నాం ఆటలాడుకోవడానికి, స్టేడియంల నిర్మాణానికి, ఆసుపత్రులు, పాఠశాలలు ఇలా పాత నగర ప్రజలకి అవసరమైన అన్ని సౌకర్యాలు కల్పించడానికి మా సంస్థ కృషి చేస్తోంది " ఇంతలో మా కారు కులీకుతూబ్ షా నగరాభివృద్ధి సంస్థ కార్యాలయానికి చేరింది

అప్పటికె రమణగారిగది ముందు ఎంతో మంది ఆయన రాక కోసం ఎదురుచూస్తున్నారు పాత నగరవాసులు ఎవరైనా, ఎప్పుడైనా తమ ఇబ్బందుల్ని చెప్పుకోవడం కోసం ఆయనని నేరుగా కలుసుకోవచ్చు కేవలం ఓపిగ్గా వినడమే కాదు వాళ్ల కవసరమైన సాయాన్ని ఆయన అందిస్తారు అందుకే ప్రతిరోజు అలా అంతమంది ఆయనని కలుసుకోవడానికి తహతహలాడేది

ఇక ఆ సమయంలో ఆయనను డిస్టర్బ్ చెయ్యడం ఇష్టం లేక శలవు పుచ్చుకొని ఇవతలకి వచ్చేశాను

ఫొటోలు-మిట్టమీద సుధాకర్




సీరియల్

# ప్రణయవల్లరి

## యర్రసంట్ల వరలక్ష్మిదేవి

**<u>ఇంతవరకూసాగిన కథ-3 :</u>** నాటకాలకు పెట్టుబడి పెట్టే రామకృష్ణ, నాటకాల డైరెక్టరు-యాక్టరు అయిన గణపతి స్నేహితులు. నాటకాల్లో హీరోయిన్‌గా వేసే రజనిని రామకృష్ణ నాటకాల రిహార్సల్సు పేరుతో ఆమెతో ప్రేమాయణం ప్రారంభించి పెళ్లి వరకు తీసుకువెళ్తాడు. సినిమాల్లో చేరాలనుకున్న రజనిపై ఏవగింపు కలిగి రామకృష్ణ ఆ ప్రయత్నం విరమించుకుంటాడు. నవనీత అనే టీచరు కూడా రామకృష్ణ ప్రేమను తిరస్కరిస్తుంది.

రామకృష్ణుడి తండ్రి శ్రీనివాస రావుగారు విశాఖపట్నంలో పేరు మోసిన క్రిమినల్ అడ్వకేటు. చాల మంచి ప్రాక్టీసు ఉండేది. శ్రీనివాసరావుగారు, నరసింహం మేనత్త మేనమామ పిల్లలు.

నరసింహం రాజమండ్రిలో ప్లీడరీ చేస్తుండేవాడు అతడ ప్రాక్టీసు బాగానే ఉండేది. అతడికి ముగ్గురు ఆడపిల్లలు. ముగ్గురూ రామకృష్ణ కన్న వయస్సులో పెద్దవాళ్ళే. రామకృష్ణ స్కూలు ఫైనలు చదువుతుండగ శ్రీనివాసరావు గార్కి గుండెపోటు వచ్చి పడిపోయేరు వెంటనే బావమరిది నరసింహాన్ని పిలచి, తను కోలుకునే వరకు తన ప్రాక్టీసు చూడమని కోరేరు. బావగారి మీదున్న ప్రేమ కొద్ది నరసింహం తన భార్యను పెండ్లికున్న మూడవ కుమార్తెను తీసుకుని విశాఖపట్నం వచ్చేసేడు. శ్రీనివాసరావు గారు కోలుకుంటున్న స్థితిలో, ఆర్నెల్ల తరువాత మళ్ళీ గుండెపోటు వచ్చి కన్నుమూసేరు. ఏ

(గత సంచిక తరువాయి)

ఐశ్వర్యం శ్రీనివాసరావుగార్ని రక్షించలేకపోయింది. మగ దిక్కులేని ఆ ఇంటికి దిక్కై నరసింహం ఆ ఇంట్లోనే చెల్లెలి ప్రార్థనపై ఉండిపోయేడు లక్షల ఆస్తికి రామకృష్ణ ఏకైక వారసుడయేడు, ఏకాకి అయేడు తల్లి తప్ప తనకు అక్కచెల్లెళ్ళు గాని, అన్నతమ్ములు గాని ఎవ్వరులేరు తండ్రి పోయింతరువాత తల్లి ఆదరానికి దూరమయేడు శాంతాదేవి ఎపుడూ ఏదో ఆలోచిస్తు, చింతిస్తు కూర్చునుంటుంది. అట్లాంటి పరిస్థితిలో తన కన్న రెండేండ్లు పెద్దదయిన మామ కూతురు సుజాత తనకి అక్క అయి ఎంతో అనురాగాన్ని చూపింది నరసింహం ఎప్పుడూ ఆ ప్రాక్టీసులో మునిగి తేలుతుండేవాడు. క్రమేపి బావగారికున్నంత పేరు ప్రఖ్యాతులు, అతడూ గడించు కున్నాడు

రెండేళ్ల క్రితం సుజాతకు న్యూఢిల్లీలో ఉద్యోగం చేస్తున్న ఓ ఇంజనీరు కిచ్చి ఘనంగ పెండ్లి చేసి, అత్తవారింటికి పంపించేసేడు. సుజాత వెళ్ళిపోయిం తరువాత మళ్ళీ ఆ ఇంటికి, రామకృష్ణ హృదయానికి వెలితి ఆవరించింది.

కొన్నాళ్ళు ఇంట్లో బుద్ధిగా కూర్చున్నాడు. తరువాత తన కోసం ప్రత్యేకంగ తన మేనమామకొనిచ్చిన ఫియట్ కారుని తీసుకొని స్నేహితులతో తిరగడం మొదలెట్టేడు. రామకృష్ణ ఎంత ఖర్చు చేసినా తల్లిగాని, మేనమామ గాని పట్టించుకొనే వారు కారు. అలా రామకృష్ణ జీవితం నందనవనమయింది.

అలహాబాదులో సీటు దొరికిందని తెల్సి రామకృష్ణ అంత సంతోషించలేకపోయేడు. విశాఖపట్నంలో నున్న స్నేహితుల్ని వదలుకుని వెళ్ళడానికి రామకృష్ణ మనస్సు ఒప్పుకోటం లేదు. కాని రామకృష్ణకు పై చదువుల మీద ఆసక్తి ఉంది. ముఖ్యంగ తన తండ్రికి మల్లే లా ప్రాక్టీసు చెయ్యాలని తల్లి కోరిక గవర్నమెంటు ఆఫీసులో గాని ప్రయివేటు ఫర్ములో గాని పని చేయాలని లేదు. తను స్వతంత్రంగ బ్రతకదల్చేడు. తన తండ్రి, మేనమామ ఎంత స్వేచ్ఛాజీవులో, సంఘంలో ఎంత పలుకుబడి, గౌరవం కలవారో రామకృష్ణకు తెల్సు రెండు మూడు తరాలకు సరిపోయే డబ్బుంది. అందుచే రామకృష్ణ ఎమ్. ఏ. ఎల్. ఎల్ బి. చదవదల్చేడు– గాని ఆ చదువేదో విశాఖపట్నంలో చదువుతే బాగుండును అనుకునేవాడు. అలహాబాదులో అయితే 'మూడేళ్ళలో రెండు కోర్సులు పూర్తి చెయ్యవచ్చుని ముఖ్యంగ అలహాబాదులో లా చదువుకు

చాల ప్రాముఖ్యముందని మేనమామ నచ్చచెప్పగానే, అలహాబాదు వెళ్ళి చదవడానికి రామకృష్ణ ఒప్పుకున్నాడు తనకు అలహాబాదులో సీటు దొరకిన విషయం స్నేహితులకు చెప్పి వచ్చేడు.

తల్లి శాంతాదేవికి ఒక్కగా నొక్క కొడుకుని దూరంగా పంపించడానికి బాధగానే ఉంది.

"అన్నయ్యా! వాడు నా కంట్ల ముందర తిరగకపోతే నేనేమయిపోతానో కదా, వాడిని విశాఖలో నే చదివించరాదు?"

అది కాదమ్మా– వాడకిక్కడ స్నేహితులెక్కువయిపోయేరు. వాడిదిప్పుడే ఎదుగుతున్న మనస్సు. ఈ వయస్సులో నే వాడు బాగుపడటమో, చెడిపోవటమో జరుగవచ్చు ఈ వయస్సులోనే వాడ భవిష్యత్తుకు పునాదు లెయ్యబడుతుంది వాడు ఏ రొంపెలో దిగినా, ఏ అపఖ్యాతి తెచ్చుకున్నా వాడి వాడ జీవితాంతం వెంట తరుముతుంది. ఆ రజని వ్యవహారం చూసేవు గదా– వాడు ఎంత తెలివిమాలిన పని చేయబోయేడో చూసేవు కదా? నేను సరైన సమయానికి అడ్డు తగలకపోతే, ఆ నాటకాల పిల్లను కట్టుకుని జీవితాంతం ఎంత నరకయాతన అనుభవించి ఉండేవాడో కదా! ఆ మధ్యన మరో మాస్టరమ్మ వెనకాతల పడ్డాడని గణపతి నాకు చెప్పేడు. ఆ పిల్ల గౌరవనీయురాలు కనుక. వాడికి మాటలతో సరైన బుద్ధి



చెప్పి పంపించి వేసింది. ఇంకొకర్తె అయితే రోడ్డు మీదే రసాభాసు చేసి, పోలీసుల వరకు ఆ వ్యవహారాన్ని పోనిచ్చును. మా బావగారు ఆడదాన్ని కన్నెత్తి చూసేవారు కాదు వాడికీ బుద్ధులు ఎలాగ వచ్చాయో!"

"అవునన్నయ్యా నీకు తెలియదు, వాడివన్నీ మేనమామ బుద్ధులని?" కాస్త నిష్ఠురంగానే శాంతాదేవి అన్నయ్యను దెప్పి పొడిచింది.

"అదేం చెల్లీ! నన్నే అనుమానిస్తున్నావు- కావలిస్తే నీ వదినను అడుగు, నా మంచితనం సంగతి "

"ఇప్పుడంతా పెద్దమనుష్యులే- మరి బి ఎల్. మద్రాసులో చదువుకుంటున్నప్పుడు నువ్వా అరవ పిల్ల పేరేమిటో మర్చిపోయేను, వెంటపడలేదు."

"తల్లీ - పొరబాటున అనేసేను. మరి గతాన్ని త్రవ్వకు. నీ వదిన చెవిని పడితే ఇంత వయస్సు వచ్చిన నా పరువు తీస్తుంది - ఒద్దు తల్లీ!"

"అలా ఒప్పేసుకో."

శాంతాదేవికి రామకృష్ణ గుర్తుకువచ్చి విచారంగ ముఖం పెట్టింది.

"అన్నయ్యా! నువ్వు వాడిని సరైన మార్గంలో పెట్టి ఇక్కడే ఉంచరాదు. వాడిని రోజూ చూడందే నేనుండలేనన్నయ్యా!

"అదికాదమ్మా! వాడు దూరంగ అలహాబాదు వెళ్ళనీ. నలుగురితో మెసలుతే విశాల దృక్పథం కూడ కల్గుతుంది. అలహాబాదులో లా చదువుకు పై రాష్ట్రాలవాళ్ళు చాలమంది వస్తారు అందరి మనోభావాలు తెల్సుకోవాలి పుట్టడం, పెరగడం, చదువు అంతా విశాఖలోనే అయితే వాడి దృక్పథం కూడ అంతంత మాత్రంగానే ఉంటుంది అలహాబాదు యూనివర్శిటీ వాళ్ళ గొప్పది అక్కడ చదివిరానీ నా మాట విను నువ్వు వాడిని చూడ్దామనుకున్నప్పుడు వాడు ప్లేను ఎక్కితే నాలుగు గంటలలో కలకత్తామీదుగ మన ఊరు వచ్చేస్తాడు దానికింత బెంగ ఎందుకమ్మా."

"సరే అన్నయ్యా - బాధ్యతంతా నీది. నీ ఇష్టమే కానియ్యి "

ఓ మంచి రోజు చూసుకొని స్నేహితులు, బంధువులు ఎయిరోడ్రోమ్‌కి వచ్చి వీడ్కోలు చెప్పగ, మేనమామ నరసింహం వెంటరాగా, అలహాబాదుకు బయలు దేరేడు రామకృష్ణ

రామకృష్ణను అక్కడ కాలేజీ లో చేర్పించి తిరిగి వస్తున్నప్పుడు నరసింహం తన మేనల్లుడికి హితబోధ చేసేడు.

"రామూ! జీవితం చాల లోతైనది. పైపై అలల్ని చూసి భ్రమించకు. ఈ వయస్సులో నీకు ప్రతి అమ్మాయి చాలా అందంగానే కనిపిస్తుంది. పరిస్థితులు అనుకూలించి చేరువైన ప్రతి యువతిని గాఢంగా ప్రేమించేననుకో గలవు. కాని అది ప్రేమ కాదు మోహం. వయస్సు పొంగులో కల్గే మమకారం అటువంటి మోహం అట్టేకాలం ఉండదు. తరువాత యథార్థం తెల్సి బాధపడవచ్చు. అందుచేత ఏ యువతికి మనస్సు ఇచ్చే ముందు, ఆమె గురించి అన్ని విషయాలు తెల్సుకోవాలి. రూపేకాదు, ఆమె ప్రవర్తన కూడ తెలియాలి హృదయం అందమైనదైతే; రూపు కూడ అందంగానే ఉంటుంది హృదయం మలినమైనదైతే ఎంత చక్కని స్త్రీయేనా వికారమైందే.

"నిన్ను ప్రేమించొద్దు అనలేదు గాని తొందర కూడదంటున్నాను. ప్రేమించడమే ఓ అలవాటుగా పెట్టుకుంటే, అదే వ్యసనంగా మారగలదు జాగ్రత్త! అప్పుడా ప్రేమకు విలువే ఉండదు. శ్రద్ధగ చదువు, మంచి మార్కులతో పేసవు నువ్వు ఉద్యోగం చేయనవసరం లేకపోయినా, విజ్ఞానం కోసమైన చదవాలి చదువయేక, నీ యవ్వనం ఒక పరిపక్వతకు వచ్చేక, తీరుబాటుగ ప్రేమించుకోవచ్చు-ఏం?" అని నవ్వుతూ, తన గీతా బోధన చేసి ఖర్చులకు ఉంచుకోమని ఓ అయిదు వందలు చేతిలో పెట్టి వచ్చేడు.

తను వచ్చేవరకు తన ముఖ్య స్నేహితుడు గణపతియొక్క బాధ్యతను మేనమామకు అప్పచెప్పేడు. గణపతికి ఎమ్. ఎస్. సి.లో సీటు దొరకలేదు. అందుకె విజయనగరంలో బి.ఇడి.లో సీటు సంపాదించి, హాస్టలులో బస యేర్పాటు చేసేడు నరసింహం. గణపతి చదువుకయ్యే ఖర్చునంత నరసింహం మేనల్లుడి ఆదేశంపై తనే భరిస్తానన్నాడు. గణపతి కృతజ్ఞతతో నమస్కారం చేసి ట్రెయినింగు కాలేజీలో చేరేడు.



## పొట్టివ్యక్తి రికార్డు



అనేకమంది అనేక రకాలుగా రికార్డులు సాధించి గిన్నిస్‌బుక్‌లో స్థానం సంపాదిస్తుంటారు. ఆ కోవలోకే వస్తాడట గుల్ మహమ్మద్. ఇరవై మూడున్నర అంగుళాల ఎత్తున్న ఇతనే ప్రపంచంలో కెల్లా అతి పొట్టి వ్యక్తి. ఇతను పాత ఢిల్లీలోని మురికివాడల్లో నివాసముంటాడట. పొట్టివ్యక్తిగా అంతర్జాతీయంగా పేరు సంపాదించాడే గాని, ఉబ్బస వ్యాధి అతడ్ని ఇబ్బందులకు గురిచేస్తోందని వాపోతున్నాడు. బంధువుల దయా దాక్షిణ్యాలపై ఆధారపడి బ్రతికే గుల్ మహమ్మద్ ఎన్ని రికార్డులు సాధించి ప్రయోజనమేముంది ?

గణపతి ప్రతివారం తప్పకుండ అలహాబాదుకు ఉత్తరం వ్రాసేవాడు. అలాగే రామకృష్ణ తల్లి కొడుక్కి ఉత్తరం వ్రాసేది. మేనమామ పదిహేను రోజులకోసారి అన్ని విషయాలతో మేనల్లుడికి ఉత్తరాలు వ్రాసేవాడు. రామకృష్ణ మొదట్లో అందరికి ఓపిగ్గా జవాబులు వ్రాసేవాడు. తరువాత నెలకోసారి అందరి ఉత్తరాలకు జవాబులు వ్రాయడం చేసేవాడు.

రామకృష్ణకు అలహాబాదు బాగా నచ్చింది. అందమైన ఊరు. ఆ ఊరులోని బజార్లు. తనలాగే పై రాష్ట్రాలనుండి వచ్చి అక్కడ చదువుకుంటున్న కుర్రాళ్ళు చాలమంది ఉన్నారు. ముఖ్యంగా ఎమ్. ఏ. ఎల్. ఎల్. బి. చదువుతున్నవాళ్ళు సుమారు ముప్పైమంది వరకూ ఉన్నారు. రెండు కోర్సులు మూడు సంవత్సరాలలో పూర్తయిపోతాయి. ఒకేసారి కలసి చదువుకోవచ్చు. అలహాబాదు కాలెజి 'లా'కి ప్రసిద్ధి ఆ రోజుల్లో. రామకృష్ణ స్వతహాగా చాల తెలివైనవాడు. పైగా అక్కడ విద్యాబోధన చాల శ్రద్ధగా జరిగేది. అందుకే రామకృష్ణకు క్రమేపి చదువులో మంచి ఉత్సాహం కల్గింది. శ్రద్ధ ఎక్కువైంది. కాని రామకృష్ణకు ఆ హాస్టల్ భోజనమే అంత రుచించడం లేదు. ముఖ్యంగా రోజ అన్నంతో బాటు ఆ చపాతీలు తినడం కాస్త ఇబ్బందిగానే ఉండేది. క్రమేపి ఆ చపాతీలకు అలవాటు పడజొచ్చాడు కష్టమైనా.

అలహాబాదులో చెప్పుకోదగ్గవి మిఠాయి పదార్థాలు. రామకృష్ణకి స్వీట్సు అంటే ఎంతో ఇష్టం. అతడి అభిరుచికి తగ్గట్టు అలహాబాదు స్వీట్సున్నాయి. దానితో పొంగిపోయేవాడు. ఇంటికి వచ్చినప్పుడల్లా ఉత్తర దేశ స్వీట్సును ఎన్నో రకాలు తెచ్చి తన తల్లిని, మేనమామను, మేనమామ భార్యను తినమని వత్తిడి చేసేవాడు.

అలహాబాదులో రామకృష్ణకు ఎటువంటి ప్రేమ వ్యవహారాలు తటస్థ పడలేదు. అక్కడ అటువంటి విషయాలకు దోహదం చేసే పరిస్థితులే ఎదురవలేదు. అందుకే రామకృష్ణ ఎక్కువకాలం చదువుమీద మనస్సును లగ్నం చేసేవాడు.

రామకృష్ణ అక్కడకు చేరిన నాలుగు నెలలకు ఇద్దరు విద్యార్థులకు సన్నిహితుడయేడు. ఒకడు బెంగాలీ యువకుడు రబీన్ ఛటర్జీ. బెంగాల్‌లోని మిడ్నాపూర్ వాసి: రెండవవాడు రాయపూర్ నివాసి దేవేంద్రసిన్హా. కొన్నాళ్ళకి కాలేజీలో వీళ్ళ ముగ్గురికి త్రిమూర్తులని పేరు పెట్టేరు. రబీన్‌ఛటర్జీ నెమ్మదస్తుడు బ్రహ్మలాంటివాడు. ఎప్పుడు చిరునవ్వుతో సరదాగా తిరిగే రామకృష్ణుడు విష్ణుమూర్తి, కోపిష్టి అయిన సిన్హా మహేశ్వరుడు. క్రమేపి ఈ ముగ్గురు గాఢమైన స్నేహితులయ్యేరు. ఎక్కడకు వెళ్ళినా కలసే వెళ్ళేవారు.

రబీన్‌ఛటర్జీ మధ్య తరగతి కుటుంబానికి చెందినవాడు. మేనమామ బంకురాలో ప్లీడరు. అతడికి ఒక్కరే కూతురు. మేనమామ కూతుర్ని చేసుకుందుకు, రబీన్‌ఛటర్జి పై చదువులకు డబ్బు పెట్టడానికి మేనమామ ఒప్పుకున్నాడు. ఆ ఒప్పందం పైనే రబీన్‌ఛటర్జి అలహాబాద్‌లో ఎమ్. ఏ. ఎల్. ఎల్. బి. చదువుతున్నాడు. దేవేంద్రసిన్హా ధనికుడు. అతడి తండ్రి రాయపూర్‌లో పేరున్న డాక్టరు. అతడికి ముగ్గురు కొడుకులు., ఇద్దరు కుమార్తెలు. పెద్దకొడుకు ఎం. బి. బి. ఎస్. అక్కడే చదివి ప్రయివేటు ప్రాక్టీసు చేస్తున్నాడు. మూడవ కొడుకుని ఇంజనీరు , రెండవ కొడుకుని అడ్వకేటు చేద్దామని ఆ తండ్రి సంకల్పం.

మధ్యప్రదేశ్‌కు చెందిన దేవేంద్రసిన్హా భావాలు చాల ఆధునాతనమైనవి. వాళ్ళ కుటుంబమే అంత. అతడి అక్కగార్ని బొంబాయిలో పెద్ద ఇంజనీరుగా నున్న ఓ మహారాష్ట్రుడికిచ్చి వివాహం చేసేరు. ఆమె ఎమ్ ఏ. పాసయింది. దేవేంద్రసిన్హా తండ్రికి .మంచి ప్రాక్టీసే కాక, నాలుగు ఇండస్ట్రీలలో షేర్లున్నాయి. అతడి తల్లి పేరున రాయపూర్‌లో ఓ పెద్ద సినిమాహాలుంది. కొన్నాళ్ళయేక దేవేంద్రసిన్హా రామకృష్ణని పరిహాస మాడేవాడు.

"చూడు రామకృష్ణ మన స్నేహం మరింత శాశ్వతంగ ఉండాలనుకుంటే

# పాఠకులే సెక్స్ కథలు కావాలంటున్నారా?

## శృతిమించిన సెక్స్

సైన్సుపరంగా సెక్స్ తెలుసుకోవడం మంచిదే. అలాగని మరీ అధిగమించకూడదు. ఈ మధ్య సెక్స్‌ను విచ్చలవిడిగా బహిర్గతం చేస్తున్నారు రచయితలు, చలనచిత్ర దర్శకులు. నేటి వారపత్రికలు సెక్స్, శృంగార కథల కోసం పోటీలు నిర్వహించి, యువతను, రచయితలను తప్పుదోవ పట్టిస్తున్నారు. ఏవో కొన్ని వారపత్రికలు తప్ప మిగతా వారపత్రికలన్నీ సెక్స్, శృంగారకథలకు ఎక్కువ ప్రోత్సాహం యిచ్చి యువతి, యువకులను పెడత్రోవ పట్టిస్తున్నాయి ఆ కథకు సంబంధించినసన్నివేశాలను చిత్ర కళాకారుల చేత అసభ్యకరంగా, బొమ్మలు గీయించి వారి కళకు కళంకం తీసుకు వస్తున్నారు. ఇప్పటికైనా ఈ సెక్స్ కథలకు ఎక్కువగా ప్రాధాన్యత, ప్రాముఖ్యత ఇవ్వక, సాహిత్యానికి సంబంధించిన సాంఘిక కథలకు ఎక్కువ అవకాశం ఇస్తే బాగుంటుంది.



—యం.డి. రియాజ్‌పాషా

మనం బాంధవ్యం కూడ కలుపుకోవాలి. రబీన్ ఆశ మనకు లేదు. వాడి మ్యారేజి సెటిల్ అయిపోయింది. వాడు వాడి మేనమామకు ద్రోహం చేయడం సబబు కాదుగా. పోనీ నీ చెల్లెల్ని పెండ్లి చేసుకుందామంటే నువ్వు ఏకాకివి. అందుకే నా చెల్లెల్ని నువ్వు పెండ్లి చేసుకోవోయి రామకృష్ణ!" అనేవాడు.

"ఆ యోగముంటే అలాగే జరుగుతుందిలే కాని ఒకటి తెల్సుకోవోయ్ సిన్హా. మీ ఇంటికి అల్లుణ్ణి అవగానే నాకు అహం పెరిగి నీ మీద అధికారం చెలాయిస్తాను. అప్పుడు మన స్నేహం చెడవచ్చు".

"ఎందుకేనా మంచిది ఒకసారి వచ్చి మా చెల్లెల్ని చూడు. ఒకటి మాత్రం చెప్పగలను, నా చెల్లెలు నిన్ను హతలు కొట్టిస్తుంది. దాన్ని మా ఇంట్లో ఆఖరి పిల్లని ముద్దు చేసి అందరూ దాన్నలా తయారు చేసేరు. ఎవ్వరి మాట వినదు. చాల స్వేచ్ఛగ తిరుగుతుంది."

స్నేహితులు సరదాగా నవ్వుకున్నారు. ఈ ముగ్గురు చాల శ్రద్ధగ చదువుకునేవారు. వీరిలో రబీన్‌ఛటర్జీ చాలా తెలివైనవాడు. చదువుతో మిక్కుటమైన ఆసక్తి. అందుకే అక్కడి మాస్టర్లకి ఇష్టుడయేడు. రామకృష్ణ

## ప్రణయవల్లరి

పైన అతడి ప్రభావం బాగానే పడింది. క్రమేపి చదువంటే అభిమానపడడం మొద లెట్టేడు రామకృష్ణ. సిన్హా చాల సరదా మనిషి. రామకృష్ణలా జీవితం నందనవనం అనుకునే వ్యక్తి. గాని తన గమ్యాన్ని మాత్రం యేనాడూ మరచేవాడు కాదు. స్వతహాగా తెలివైన వాడు కూడ. సినిమాలకు పోయిన, షికార్లకు పోయిన ముగ్గురు కలసే పోయేవారు.

ఒక సంవత్సరం బాగానే ఉత్సాహంగ, ఉల్లాసంగ రామకృష్ణ అలహాబాదులో గడిపేడు. మొదటి సంవత్సరం పరీక్షలు వ్రాసి వేసవి శలవులకు ఇంటికి బయలుదేరేడు. గాని స్నేహితుడు దేవేంద్రసిన్హా అందుకు ఒప్పుకోలేదు.

"నువ్వు, రబీన్ మా ఇంటికి వచ్చి ఓ వారం రోజులు ఆతిథ్యాన్ని స్వీకరించేక మీ ఊరు వెళ్ళేది".

"అది కాదు సిన్హా మాకు మా వాళ్ళను చేరాలని తొందరగ ఉంటుంది కదా".

"అవునురా. మీరు చంటి పిల్లలు కదా శలవులివ్వగానే తల్లి ఒడి మరి చేరాలి కద! ఈ ఆటలేమి నా దగ్గర సాగవు. మీరిద్దరు మా ఇంటికి రావల్సిందే".

చేసేదేమి లేక రబీన్, రామకృష్ణ సిన్హాతో రాయపూర్‌కి ప్రయాణమయ్యేరు. సిన్హాయే ముగ్గురికి ఫస్టుక్లాస్ టిక్కెట్లు తీసుకోబోయేడు, గాని రామకృష్ణ అందుకు ఒప్పుకోలేదు.

"సిన్హా! నీకంటె నేనే గొప్పవాడినోయ్. నీ ఆతిథ్యం మీ ఇంటికి చేరేక కాని ఇప్పుడు కాదు".

సిన్హా నవ్వేసి ఊరుకున్నాడు. రబీన్‌కు టిక్కెట్టు మాత్రం తను తీసుకున్నాడు. ముగ్గురు సరదాగా కబుర్లు చెప్పుకుంటూ రాయపూర్‌కు చేరేరు. సిన్హా తండ్రి మిత్రులిద్దర్ని చూసి ముచ్చటపడ్డాడు. రాయపూర్‌లో ఓ అయిదు రోజులున్నారు. మూడు హిందీ, ఒక ఇంగ్లీషు సినిమాలు చూసేరు. అవి చూసేవరకు సిన్హా చెల్లెలు నీలా ఒప్పుకోలేదు. సినిమాలు చూసేక, వాటి బాగోగుల గురించి వాళ్ళతో వివరంగా చర్చిస్తే గాని, వదిలిపెట్టలేదు. ఆమెకు ఎందరో గర్ల్ ఫ్రెండ్స్, బాయ్ ఫ్రెండ్స్ ఉన్నారు. చాల చక్కనిది, చాల ఉత్సాహవంతురాలు.

రామకృష్ణ చేపలుగాని, మాంసముగాని తినడంటే అమితంగా ఆశ్చర్యపోయింది. ఒకనాడు పరిహాసంగ సిన్హా చెల్లెలుతో అన్నాడు, రబీన్, రామకృష్ణల ముందర.

"చెల్లీ! నిన్ను, రామకృష్ణ పెండ్లాడతానంటున్నాడు".

ఆనందంగ నీల నవ్వేసింది.

"ఈజ్ ఇట్?" అని రామకృష్ణను ప్రశ్నించింది.

రామకృష్ణ నవ్వేసి ఊరుకున్నాడు.

"దెన్ లెట్ అస్ ఫాల్ ఇన్ లవ్ విత్ ఈచ్ అదర్ ఫస్ట్. దెన్ ఓన్లీ వుయ్ విల్ కన్సిడర్ ఎబౌట్ మారేజ్", అని చాల సహజంగ నవ్వుతు చెప్పింది. రామకృష్ణకు మరే జవాబు చెప్పడానికి తోచక "ఎస్, ఎస్" అని ఊరుకున్నాడు.

"కాని భయ్యా! నేను మీ రామకృష్ణను ప్రేమించగలనని అనుకోను", అంది చిలిపిగా.

దాంతో రామకృష్ణకు ఉక్రోషం

కల్గింది.

"ఏం నేను అందంగా లేనా?"

"యు ఆర్ హేండ్‌సమ్- ఐ కన్సీడ్ దట్ బట్"

"ఏమిటా బట్?"

"నువ్వు మరి శాకాహారివే. నాకు చేపలన్న, కోడిమాంసమన్న చాల ప్రీతి రోజు మా ఇంట్లో ముఖ్యంగ నా కోసం వండి తీరవల్సిందే. నువ్వు కనీసం ఆమ్లెట్ కూడ తీసుకోవే- మరెలా?"

"నా చెల్లెలికి తిండి , సినిమాలుంటే మరేం అక్కరలేదు".

"మంచి ఇబ్బందిలో పెట్టేసేరే. నేను ఇంకేమైన త్యాగం చేయగలను గాని, నా భోజనరీతిని మార్చుకోలేను."

"దెన్- ఐయామ్ సారి"

అందరు నవ్వుకున్నారు. సిన్హా తండ్రి స్నేహితుల్ని చాల ఆప్యాయంగ చూసుకున్నాడు. సిన్హా తల్లి సరేసరి.

"మీరు నా కొడుకు లాంటివారే అందుకే ఏమీ మొగమాట పడక మీకు కావల్సింది నన్ను అడగండి. ఈ ఇల్లు మీ ఇల్లే అనుకోండి", అనిచెప్పి దగ్గర ఉండి వడ్డింపించి, ఎంతో ప్రేమతో భోజనం పెట్టేది.

ఆ అయిదు రోజులు ఎంతో ఉల్లాసంగ గడిచిపోయేయి. సిన్హా ఎంత బలవంతం చేసినా మరి ఉండక రబీన్, రామకృష్ణ ప్రయాణమయ్యేరు. రబీన్ మిడ్నాపూర్‌కి బయలుదేరేడు. రామకృష్ణ పినతల్లి ఒకామె భిలాయిలో ఉంటున్నది. ఆమె భర్తకు అక్కడ స్టీల్ ప్లాంటులో ఉద్యోగం. వస్తున్నప్పుడు ఆమెను చూసి రమ్మని రామకృష్ణ తల్లి మరీ మరీ వ్రాసింది. అతడి పినతల్లి, భర్త కూడ రమ్మని వ్రాసేరు. అందుకే వాళ్ళింటికి వెళ్ళి ఓ రెండు రోజులుండి, భిలాయ్ ఉక్కు కర్మాగారాన్ని కూడ చూసి వద్దామనుకున్నాడు రామకృష్ణ.

ఆ మరునాడు రామకృష్ణ బస్సులో భిలాయి వెళ్ళేడు. రామకృష్ణ పినతల్లి భర్త అక్కడ మంచి ఉద్యోగమే, కమర్షియల్ డిపార్ట్‌మెంట్‌లో చేస్తున్నాడు. అతడు దగ్గర ఉండి రామకృష్ణకు ఫ్యాక్టరీ అంతటినీ చూపించేడు. ఆ ఊరిలోని పార్కు, సూపర్‌బజార్ పినతల్లి పిల్లలు తీసుకుని వెళ్ళి చూపేరు. రెండు రోజులు సరదాగానే గడచిపోయేయి. ఆ సాయంత్రం దుర్గ్- విశాఖ పాసింజరుకి ప్రయాణమయి భిలాయి స్టేషను చేరేడు రామకృష్ణ. ఇంకేదో ముఖ్యమైన పనుండి రామకృష్ణ పినతల్లి భర్త స్టేషనుకు రాలేదు.

రామకృష్ణ ఫస్టుక్లాసు టిక్కెట్టు విశాఖపట్నంకు తీసుకుని బండి ఇంకా రాలేదు కదా అని, ప్లాట్‌ఫారమ్ మీద తిరుగుతున్నాడు. కాస్త దూరం వెళ్ళేసరికి విశాఖలో తనకి తెల్సిన మేస్టరమ్మ నవనీత ఓ చిన్న సూటుకేసుతో ఎదురైంది. రామకృష్ణ ముందు కాస్త బిడియపడి తప్పుకోబోయేడు విశాఖలోని సంఘటన గుర్తుకొచ్చి. కాని ఎదురుపడ్డ మనిషిని పల్కరించకుండ ఉండడ మెలా-పైగ నవనీత రామకృష్ణను గమనించింది. చిరు నవ్వులతో





## సైకిల్ మీద లల్లూజీ!

వార్తల్లో వ్యక్తులుగా ప్రసిద్ధి కెక్కినవారిలో స్వర్గీయ రాజ్‌నారాయణ్, దొడ్డమనిషి సుబ్రహ్మణ్యస్వామి, బిజూ పట్నాయక్, ఎన్ టి ఆర్ లంతా అప్పుడప్పుడు లైమ్‌లైట్ కోసం చిన్న చిన్న ట్రిక్స్ చేస్తూంటారు కాని బీహార్ ముఖ్యమంత్రి శ్రీ లల్లూప్రసాద్ యాదవ్ గారు వారానికి రెండురోజులు సచివాలయానికి సైకిల్ మీద మాత్రమే వెళ్తామన్నారు పెట్రోలు పొదుపు ఉద్యమం ఈయన ద్విచక్ర శకటం మీద మొదలుపెట్టారు కనుక సెక్యూరిటీ స్టాఫ్ మొదలు పక్షీంద్రులదాకా అంతా సైకిళ్లమీద వెంటపడ్డారు అదో దసరా సందడిలాగా జనాలు రోడ్లవెంట భారులుగా నిలబడి జేజేధ్వానాలు చేశారు "దమ్మిడీ ఖర్చు లేకుండా, పి ఆర్ ఓ లు లేకుండా పబ్లిసిటీ మిల్‌గయా"- అంతటితో ఆగిందా- కేంద్ర హోంమంత్రికి స్వాగతం చెప్పడానికి కూడా ఈయన సైకిల్ మీదనే వెళ్లాడు అతనివెంట బలగంలో సైక్లింగ్ రానివాడుంటే పరుగెత్తాల్సి వచ్చేది జవహర్‌లాల్ అనేవాడు మనం సైకిల్ యుగంలో వున్నాం- ఇదే కాబోలు!

వంపుసొంపులతో మెరిసిపోతూంది నవనీత దగ్గరవగానే-"నమస్తే" అని రామకృష్ణ పలకరించేడు నవనీత ఎదురుగ ఆగి సొగసైన నవ్వుతో-"నమస్తే-చాలకాలంకి మళ్లీ కలిసేం", అంది

"ఆ ఏదో ఈ మధ్యన చాల బిజీగా ఉన్నానండి, అన్నాడు రామకృష్ణ చాల హుందాగా నవనీత చాల చిలిపిగా చూసింది

'పెళ్ళి కుమార్తెలను వెతుక్కుంటున్నారా?

"అదేమిటండీ అలా అంటారు నేను చాల శ్రద్ధగ చదువుకుంటుంటె!

### ప్రణయవల్లరి

"ఏమో మరెక్కడ మీరు విశాఖలో కనుపించకపోతే అలా అనుకున్నా

'నేను అలహాబాద్‌లో ఎమ్ ఏ, ఎల్ ఎల్ బి చదువుతున్నా మొదటి సంవత్సరం పూర్తి చేసి ఇలా ఇంటికి బయలుదేరేను చాల గంభీరంగా, గర్వంగ రామకృష్ణ జవాబిచ్చేడు

నవనీతకు ఎందుకొ అతని జవాబు ఆనందాన్ని కల్గించింది

'క్షమించాలి- నేను ఏదో పొరబడ్డాను అంది తన చిలిపితనానికి కాస్త నొచ్చుకుంటు

రామకృష్ణ అది గమనించి, మళ్ళీ సరదాగా మాట్లాడడానికి దిగేడు

"దానికేం లెండి- ఒక్కొక్కప్పుడు మంచివాళ్ళకు కూడా చెడ్డ పెరు వస్తుంటుంది

నవనీత సెలయేరులా గలగలా నవ్వేసింది తన ఆకర్షణంత ఒలకబోస్తూ రామకృష్ణకు మతిపోయినంత పనయింది

"ఇంతకీ ఎక్కడికండి మీ ప్రయాణం? అని అడిగేడు

'మన ఊరికే- మరి మీరో?

మన ఊరికే

ఇద్దరు హాయిగ నవ్వుకున్నారు ఇంతలొ బండి వచ్చింది స్టేషనుకు నవనీత అన్నయ్య టిక్కెట్టు తీసుకుని వచ్చి చెల్లెలుకి అందించేడు

"అన్నయ్యా- ఇతను విశాఖపట్నం వారే పేరు రామకృష్ణ అలహాబాదులో ఎమ్ ఏ, ఎల్ ఎల్ బి చదువుతున్నారు

రామకృష్ణ హృదయం ఒక్కసారి ఆనందంతొ వెచ్చనైంది తన పేరును సంవత్సరం గడచినా నవనీత జ్ఞాపకం ఉంచుకుంది- అంటే ?

"నమస్కారం మీరిప్పుడు విశాఖపట్నం వెళ్తున్నారా?

"అవునండి

"అయితే నా చెల్లెలు ఒక్కర్తే వెళ్తున్న భయం నాకు లేదు

"దానికేం లెండి- పదండి బండి వచ్చేసింది

జేబులోని ఫస్టుక్లాసు టిక్కెట్టుని మరింత లోనికి తోసి, రామకృష్ణ తొందరగ ఫస్టుక్లాసు పెట్టె వైపుకు పోతున్న కూలివాడి దగ్గర కెళ్ళి తన సామాన్లు రెండవ తరగతి పెట్టెలో పెట్టమన్నాడు తన వెంట వచ్చి కూలివాడు ఆశ్చర్యపోతూ రామకృష్ణను అనుసరించి, రామకృష్ణ చెప్పిన పెట్టెలో సామాన్లను పెట్టేసిపోయేడు

(ఇంకావుంది)

# రోకోమత్ రాంకిషన్

**యన్. చిరంజీవి**

**అసలే** మా దఫ్తరేమో చార్మినార్ చౌరస్తకాడ ఉండే- మరి మన ముండేదేమో దబ్బిపూరలో నాయె! దూరం ఎంత నే ఫికరయితెలేదనుకో- మస్తుగ సిటీ బస్సులుండెగదా! ఉండేటందుకు మల్లి పాంచ్‌మినట్ కొకటుంది! ఉండి కూడ గా బస్సులకు ఘుసాయించాలంటే- తలపానం తోకకొస్తది. గిదేం కాలమో? ఏందో? సమజగాదు గానీ- ఆడపోర్లు, మగపోరళ్ళు, ఒకళ్ళ మీద ఒకళ్ళు లడాయించుకుంటూ జొరబడ్తరు. దిగెకాడ గూడ గంతే.

గట్ల నానా చరలుపడి "అడ్డ" కాడ బస్సు దిగుతుంటంగద. ఆర్నియ్యవ్వ పాదం జమీన్‌పై పడనియ్యకుండ మల్లబడి- ఉసిళ్ళ తెరలెక్క బస్సులకి గుసాయించుకొనుడే పని! బస్సు భగాయించినంక- ఖమీజు గిట్ట దులుపుకొని- రస్త ఎక్కిన మనుకో గింతలో ఎవ్వడో ఒకడు- !నా పర్సేది'? అరే మేరా బట్వా కహారే,' అని అఖలు బోయినోడి లెఖన రులాయిస్తనే ఉంటడు. గీ మాట ఇనపడ్డాక ఆగాలి గదా! గాడి పరేషానేందో చూడాలి గదా! నౌకరిలో షరీఖయిన తొలి దినాల్లోనయితే గీమాటలు చెవిన పడగనే గుండె గబరాయించెడిది! ఇప్పుడంటే గిది- మామూలైంది. అంత పరేషాన్ అనిపించడంలె! అలవాటైయింది మల్ల.

నేను 'నా మకాన్'కు పొయ్యే రస్తలో- మైసమ్మ గుడి ఉండె. దాన్ని దాటకుండగనే- కాస్త ఆగి- పస్తాయించి గా బొమ్మను చూసి- బాపనయ్యకు- సలామ్ చేసి- మకాన్‌కు చేరేసరికి- దీనెమ్మ చిమ్నీలు ఎలుగుతనే ఉంటయి. పట్నంలో బిజిలి కదా' అడిగెటోడుండడు చెప్పెటోడు- గాయబ్, ఆడు దఫ్తర్‌ల డ్యూటీ చేసెటోళ్ళకు- మనకూ దఫ్తరీ ఉందిగదా! నౌకరికి పోవాలిగద.

'అమ్మో గిదికుదర్దని- లడాయికి పోతె- గాడ- 'నామ్‌నిషాన్ ఉండదు.

గేందిబే! మా మొహల్లలో చీకటేంది? 'బిజిలి' ఏమయింది? రోజు గిట్లనే జేస్తుండవు? నువ్వు నౌకరి చేస్తుండవా? లేక రండని పెటుకొని మజాలు గిట్ట చేస్తుండవా? నీ వాలకం జూస్తె- నక్సలెట్ లెఖగుంది. నోట్ల బెల్లం గడ్డ గిట్ట ఉందా? బోల్‌రే- బోల్! అని లొల్లి బెడితె గాడు మెల్లంగ వళ్ళిరుచుకొని ఆరామ్‌గ కుర్చీ నుంచి లేచి-

'ఏందివయ్యా! గిదేం బళ్ళదొడ్డి లెక్కన సమజయితందా? కళ్ళు కాస్త పూరా తెరిచి చూడు- గిదేందనుకున్నరు?' 'బిజిలి' గది ఈడికొస్తె- మీ కాడికి పంపెటందుకే గదా మాకు నౌకరిచ్చింది? గడిబిడజేస్తె- బిజిలొస్తాది? రస్త ఎక్కి లొల్లిపెడితె గిట్టవస్తదా? బిజిలి ఘర్‌లోకి- బిజిలి రావాలె గప్పుడు వదుల్తం! ఫికరు చెయ్యక పోండ్రి అని బేఫికరగ కూకోని ఆజంబీడి' ఎలిగించిండు- గప్పుగప్పున పొగ వదిలిండు కోపంగ.




'అమ్మో! ఇగ నాభంనేదు. గీ కొడుక్కి నీ ఖరాలు తగ్గింది. గీవాడకు బిజిలి రాదు అనుకొని గుస్స పట్టలేక- మీదికి పోయిండు బాలకిషన్.

'అరె గౌందిర బేటా! బిజిలి రాదా! నీ ముండీ సరిచేస్తె బిజిలొస్తది, దాని అబ్బొస్తది' అంటూ.

'అమ్మో ఈ పోరడు- మస్తుగుండు! ఆడి అడ్డీలిరుస్తడు! బిజిలి రాక పోగ ఈడ్ని పోలీసు ఠానలోకి తోసి మూసేస్తరు అనుకొని అరె తయిరోరె బాలకిషన్! నీ అఖలేమైంది? గాడు గవర్నమెంటోడు! గాడిజోలి మనకెందుకు?! అని వాటేసుకొని రస్త దాటకుండ ఆపిండు! దాంతో 'బిజిలి' పెట్టెటోడు బీడి పారేసిండు! ఈడేమో ఈడ్ని ఇదలాయించుకుంటూ 'రోకోమత్ రాంకిషన్' ఆడి గోంప్డి పగిల్తగాని- సమజ్... గాదు. వాడ వాడంత అంధేరీల ఉంచి- నఖరాలు చేత్తుండు! గీ, గీ రంత ఆడతాననే ఉండది అన్నాడు- రెచ్చిపోయి.

ఆడ్ని సమజాయించె సరికి- అఖలు మోకాళ్ళకొచ్చె- గింతలో బిజిలి వచ్చి- వాడంత వెలుగొచ్చె- భిక్కచచ్చి- గుస్సదించుకొని వాపస్ కావాల్సి వచ్చె-

# ఆదర్శం

యర్రమిల్లి విజయలక్ష్మి

"రావే.....రా.....రా..... ఎప్పుడొచ్చావు?" అంటూ మిత్రురాల్ని ఆప్యాయంగా ఆహ్వానించింది రమ.

"రాత్రి వచ్చాం...ఎలావున్నావే.... కులాసానా" నవ్వుతూ రమ ఇంట్లోకి నడిచి ఆమె చూపించిన కుర్చీలో కూర్చుంది లలిత. కొత్త కరిష్మా కాటన్ జరీ చీర మడతలు నలగకుండా సర్దుకుని–"చాలా రోజులైంది నిన్ను చూసి... క్రిందటి నెలలోనే వస్తావని చెప్పారు మీ అమ్మగారు- అక్కడ మీ వాళ్ళంతా బాగున్నారా?"

"ఆఁ అంతా బాగానే వున్నారు..." అని అనాసక్తంగా బదులిచ్చి... సుతారంగా ముక్కు విరిచి.... "అబ్బా....! ఎలా వుంటున్నావే రమా... ఈ కొంపలో...." అంది పాత సామాన్లతోనూ- ధాన్యం బస్తాలతోనూ మరీ ఇరుగ్గా కనిపిస్తున్న గదిని అదోలా చూస్తూ.

సరిగా అప్పుడే రమ ఆడబిడ్డ లక్ష్మి....."వదినా.....కాఫీ..." అంటూ ట్రేలో కాఫీ కప్పులుంచుకుని వచ్చింది. లలిత మాటలు లక్ష్మి ఎక్కడ విందోనని కలవరపడింది రమ... "ఆఁ...లలితా...కాఫీ తీసుకోవే.... మా లక్ష్మి కాఫీ చాలా బాగా చేస్తుంది....." అంది నవ్వు తెచ్చుకుని.

"ఆహా.... అల్లాగా?" అంది లక్ష్మిని తేరిపారచూస్తూ... "ఈ అమ్మాయి మీ రెండో ఆడబిడ్డకదూ.... ముగ్గురు కదూ ఆడపిల్లలు.....?" అంది తళ, తళ శుభ్రంగా మెరుస్తున్న కప్పుచూసి కాస్త సంతృప్తి చెందుతూ....

"అవును....లక్ష్మి క్రితం సంవత్సరమే బియ్యే పూర్తి చేసింది. మంచి సంబంధం దొరికితే పెళ్ళిచెయ్యాలని చూస్తున్నారు..... నీ దృష్టిలో ఎవరన్నా మంచి పిల్లాడుంటే చెప్పవే."

వదిన మాటలకి సిగ్గుపడుతూ లోపలికెళ్లిపోయింది లక్ష్మి. 'అట్లాగేలే....' అని కాఫీ సుతారంగా సిప్ చేస్తోంది. రమ లలిత వంక విస్మయంగా చూస్తోంది. ఈ లలిత ఎప్పుడూ ఇంతే... పిల్లల తల్లైనా ఏ మాత్రం మారలేదు. ముందు, వెనుక చూసుకోకుండా కుండబద్దలు కొట్టినట్లు అనేస్తుంది.

వేడివేడి కాఫీ తాగేసరికి ఆవిరి కమ్మినట్లు లలిత ముఖానికి చిరుచెమట పట్టింది సుతారంగా కర్చీఫ్‌తో అద్దుకుంటూ.... 'అబ్బా'.... అంటూ ఫ్యాన్ కోసం సీలింగ్ వంక చూసింది.

"దక్షిణపు గది... గాలి బాగానే వస్తుందని ఈ గదిలో ఫ్యాన్ వేయించలేదు.... విసనకర్ర ఇమ్మంటావా....?" స్నేహితురాలికి కలిగిన అసౌకర్యానికి నొచ్చుకుంటూ అంది రమ.

"అయితే... నీ బతుకికి ఈ మురికి కూపానికే అంకితమేమిటే రమా? అబ్బ... హారిబుల్...! ఎలా వుంటున్నావే బాబూ.... ఎంత తెలివిగా వుండే దానివి.... నీకెంతో మంచి ఫ్యూచర్ వుందనుకునేవాళ్లం.... ఎలా తయారయ్యావే బాబూ!" కొత్తగా మెరుస్తున్న ముత్యాల నెక్లెస్ సున్నితంగా సర్దుకుంటూ అంది లలిత. ఆమె చూపులు తన మెడలో పసుపుతాడుని గుచ్చి చూడటం రమకెంతో ఇబ్బంది కలిగించింది.

ఇద్దరూ వొక ఊరి వాళ్ళు. ఒకే స్కూల్లో చదువుకున్నారు. చిన్నప్పట్నించి మంచి స్నేహితులు. ఇంచుమించు పెళ్లిళ్లు కూడా ఒకేసారి జరిగాయి. లలిత భర్త పెద్ద గవర్నమెంట్ కన్సర్న్‌లో ఆఫీసరుగా వుంటే- రమ భర్త అదే ఊళ్లో హైస్కూల్లో మాస్టారుగా పనిచేస్తున్నాడు. కొద్దిపాటి ఆస్తి- ఒక సొంత పెంకుటిల్లు వున్నాయి.

"ఏం చెయ్యమంటావే.... మావగారు రిటైరైపోయారు. వళ్లు కూడా అంత బాగుండటం లేదు... ఈ ఊళ్లో స్థిరపడిపోయారు... అయినా నాకేం లోటు లేదు లేవే.. నన్నెంతో ప్రేమగా చూసుకుంటారంతా..." తన జీవితాన్ని గురించి స్నేహితురాలు అసంతృప్తిని వ్యక్తం చేస్తుంటే మెల్లిగా అంది రమ. లలిత మాటలు ఇంట్లో ఎవరన్నా వింటే ఎంత బాధపడతారోనని మనసులో ఖంగారుపడుతోంది. కాని వాళ్లిద్దరూ స్వేచ్ఛగా మాట్లాడుకోవాలని లాగుంది ఇంట్లో ఎవరూ ఆ పక్కకి రావటంలేదు.

"మనకంటూ సుఖం లేకపోయాక ఇంకెందుకు...? ఇంకా నయం.... నేన దృష్టవంతురాల్ని. ముందే తెలిసుండబట్టి- పెళ్లికి ముందే చెప్పేసాను ఆయనకి. మంచిసిటీకి బదిలీ చేయించుకోమని! నీకు తెలుసుగా మా పెళ్లినాటికి తను వాళ్ల ఊళ్లోనే ఉద్యోగం చేస్తుండేవారు... అయినా రమా... అనుభవించవలసిన వయసులో, హాయిగా స్వేచ్ఛగా నాలుగు సిటీలు తిరక్క.... ఈ బతుకేమిటి చెప్పు.... కొన్ని, కొన్ని విషయాల్లో మనం చాలా ప్రాక్టికల్‌గా స్పష్టంగా వుండాలి. నా మాట విని మీ అయన్నిక్కడ్నించి బదిలీ చేయించుకోమను. అంతగా కావాలంటే ఏదో నెలకింతని పంపించండి... అంతే కాని బంగారం లాంటి బతుకంతా ఇలా మురికిలో గడిపేస్తారా.. నిజంగా చెప్పు.... ఇక్కడీ ఇంట్లో నువ్వేమన్నా సుఖపడుతున్నావా?"

స్నేహితురాలు విసిరిన సవాలుకి రమ తికమకపడింది... మాట మార్చాలని.... "అవును కాని లలితా! మీ అమ్మగారు పాపం ఇక్కడ వంటరిగా ఇబ్బంది పడుతున్నారే.... మొన్నోసారి వెళ్లి చూసాను... ఆరోగ్యం కూడా అంత బాగా వున్నట్లు లేదు... కాస్త మీ తమ్ముడికి చెప్పకూడదూ... తన దగ్గర వుంచుకోమని."

"ఏమిటి....? నేనా..... వాడికా.... బాగా చెప్పావు.... మునపటి సుభాష్ అనుకున్నావేమిటి...వాడు.... పెళ్ళయ్యాక ఎంత మారిపోయాడంటావు? మా మరదలు మహాజాణలే... మొగుడ్ని కొంగుకి కట్టేసుకుంది. ఆవిడెంతంటే

అంత! మొగుడు పనికొస్తాడు వాడి తల్లి పనికి రాదు. పోనీ ఆడపడుచుని నా విషయం వదిలెయ్... ఎంతైనా వాడి తల్లి కదా... సొంత అత్తగారు కదా ఆవిడంటే నన్న కాస్త అభిమానం వుండొద్దూ.... ఊహూ...." ఉద్రేకంతో ముక్కుపుటాలె గరేస్తూ ముఖమంతా ఎర్రగా చేసుకుని కంప్లైంటు చేసింది.

లలిత ఆవేదన రమ అర్థం చేసుకుంది. అయిన సంబంధం అని సుభాష్‌కి ఏరికోరి చేసుకున్నారు శశిని. ఆ అమ్మాయియా బాగానే చదువుకుంది కాని అదేమిటో అత్తింటి వాళ్లంటే పడదు. మళ్లీ అన్ని విధాలా మంచిగానే వుంటుంది. కాపరానికి వచ్చీరాగానే వేరుకాపురం పెట్టేసారు. వంటరిగా లలితా వాళ్ల ముసలితల్లి పాత ఇంట్లో పడి వుంటోంది. సుభాష్ ఎప్పుడైనా వస్తే వస్తాడు. లేకపోతే లేదు. చేతికెదిగొచ్చిన కొడుకు నిన్నటి దాకా "అమ్మా....అమ్మా..." అంటూ తన చుట్టూ తిరిగిన బిడ్డ- దూరమై తన్న, లక్ష్యం చేస్తుంటే కనీస బాధ్యతను మర్చిపోయి తనని వంటరిచేస్తే ఆ తల్లి మనసు విలవిల్లాడిపోతోంది. పైన కొడుకు, కోడలు తనని వంటరిగా వదిలేసి తమ సుఖం తాము చూసుకొంటున్నారని ఊళ్ళోవాళ్ళంతా విమర్శిస్తుంటే మరీ బాధపడుతోంది. ఆ దిగులు తోనే మంచం పట్టింది. ఇదంతా తెలుసున్న రమ మాటల సందర్భంలో లలితను కదిల్చింది. ఆమె సమాధానం విని మరేమీ మాట్లాడలేకపోయింది. లలిత మాట మార్చి- "ఎంతకాలం ఈ మురికిలో పడుంటావే రమా... నా మాట విని మీ ఆయన్ని ఏదన్నా మంచి సిటీకి బదిలీ చేయించుకోమను. ఎంతైనా సిటీ లైఫ్ వేరు. అనుభవించవలసిన వయసులో హాయిగా వుండక ఇప్పట్నించీ ఈ బాధ్యతలేమిటి...? అవునూ... మీ పెద్దాడబిడ్డ



పెళ్ళి చేసారుటగా! మంచి సంబంధమే ఇచ్చారని చెప్పింది మా అమ్మ." అంది ఆరాగా.

"ఊ... ఈ సంవత్సరం. లక్ష్మికి కూడా చెయ్యాలని... డిగ్రీ అయిపోయింది. సంబంధాలు చూస్తున్నారు. మా మరిది రవి తెలుసుగా ఈ మధ్యే ఉద్యోగంలో చేరాడు బ్యాంక్‌లో..."

"పెళ్ళి చేస్తారా...?" అంది లలిత.

"ఇప్పుడప్పుడే చేసుకోనంటున్నాడు.... ముందు అన్నగారికి కాస్త రిలీఫ్ ఇవ్వాలట..." అంది నవ్వుతూ రమ.

"ఊహు... బాగానే వుంది... అయితే ఈ ఊరికే అంకితమన్న మాట... నువ్వు.... షు... ఏం చేస్తాం... ఈసారి మా ఆయన్ని బొంబే బదిలీ చేయించుకో మంటున్నాను. ఈ వయస్సులోనే దేశమంతా తిరిగేస్తే తరువాత రిటైరయ్యాక ఎటూ ఇక్కడికే వచ్చేస్తాం... ఇల్లూ-వాకిలి వుంది కదా.... పిల్లల చదువులూ అవీ కూడా బాగుంటాయక్కడ... సరే... మరి వస్తా... రాత్రికే ప్రయాణం... ఆయనకింకా నాల్రోజులు సెలవుందనుకో.... మా వప్పీకి స్కూల్ రీవోపెనింగ్ రేపే.... విమల్ ని కూడా జాయిన్‌చెయ్యాలి...." మాట్లాడుతూనే గేటు దాటింది లలిత... గుమ్మం దాకా వచ్చి వెళ్లిపోతున్న స్నేహితురాలి వంకచూస్తూ నిలబడింది రమ.

సంవత్సరం ఇట్టే గడిచింది. అత్తింట్లో ఏదో శుభకార్యానికి వచ్చి రెండ్రోజులు పుట్టింట్లో గడిపింది లలిత. ఆ సాయంత్రం




# ఆదర్శం

రమ ఇంటికి వచ్చింది. స్నేహితురాళ్లిద్దరూ కబుర్లలో పడ్డారు. లలితలో ఏదో మార్పు ఇట్టే పసికట్టేసింది రమ.

"ఏమిటే లలితా... అలా నీరసంగా వున్నావు... ఒంట్లో బాగుంటోందా.. కొంపదీసి.... మళ్ళీ.... " అంటూ నవ్వుతూ ఆగి చిలిపిగా చూసింది.

ఉసూరుమని నిట్టూర్చింది లలిత- నీరసంగా..." అబ్బే.... అదేంకాదే ఈ మధ్య నా ఆరోగ్యం అంత బాగుంటంలేదు. అక్కడి వాతావరణం పడలేదు... పైన ఈ పిల్ల వెధవలు... నా ప్రాణం తీస్తున్నారనుకో...."

"అదేవిటే... ఇద్దరేగా.... అంత అల్లరిచేస్తున్నారా... నీ పిల్లలు...?" అంది రమ స్నేహంగా నవ్వి.

"ఆ చస్తున్నాననుకో.. ఆయన ఆఫీసుకు వెళ్లి రావాలంటే మనం నరసాపురం వెళ్లి వచ్చినట్లే. తెల్లారకట్టే లేచి అన్నీ అమర్చాలి.. మళ్లీ అర్ధరాత్రికే రావటం. పిల్లలొకళ్లు.. అందరికీ అన్నీ టైంకి అమర్చాలి. ఆ ఊళ్లో మన ఊళ్లోలా పనివాళ్లు దొరకరు... అన్నీ స్వయంగా చేసుకోవాల్సిందే...?"

లలిత మాటలు వింటూనే నిమ్మరసం తయారుచేస్తోంది రమ... "అయ్యో... పాపం.... అయితే కష్టమేనే..." అంది జాలిగా.

"పైన ఆ వాతావరణం నాకు పడలేదు... ఎప్పుడూ ఏదో ఒకటి...."

"పోనీ మళ్లీ ట్రాన్స్‌ఫర్ చేయించుకోలేకపోయారా... ఎక్కడికైనా....." సానుభూతిగా అంది.. ఎప్పుడూ చలాకీగా నవ్వుతూ తుళ్లుతూ బేఫర్వాగా వుండే లలిత మన్నుతిన్నట్లు డల్‌గా వుండడం ఆమెకీ బాధగానే వుంది.

"అదంత తేలికకాదుటే....! ఇక్కడ్నించంటేఇతర రాష్ట్రాలకి తొందరగా బదిలీచేస్తారు. మళ్లీ అట్నించి రావటమంటే... అంత త్వరగారాదు..."

"....పోనీ.... మీ వాళ్లనెవరినైనా తీసుకెళ్లకూడదూ కొన్నాళ్లు... కాస్త సాయంగా వుంటారు."

"ఆ. ఎవరొస్తారే... మన వాళ్లు... మన వాళ్లు అని మనం అనుకోవటమే తప్పు... ఎవరి గొడవలు వాళ్లవి. మా అత్తగారు పెద్దది అంత దూరం రాలేనంది... మా పెద్దాడబిడ్డకు ఫైనల్ ఎగ్జామ్స్ దగ్గరపడుతున్నాయట. నాతో చనువుగా మాటే మాట్లాడదు. ఇంక అక్కడికేం వస్తుంది."

"పోనీ మీ అమ్మగారు... మరదలు...."

"సరే.... వీళ్ల ముక్కే చెప్పావు... మా అమ్మ అసలే కదిలే పరిస్థితిలో లేదు... ఇక... 'ఆవిడ'గారు అత్తగార్నే పట్టించుకోదు... ఇక నేను కావాలా... తనూ తన సంసారం..." అంతే...."ఊ వస్తానే... సామాను సర్దుకోవాలి." అంటూ లేచింది. పరిస్థితులు మనిషిని మార్చినా.... ఆలోచన, అవగాహన పెరగలేదు. తనలోని లోపాన్ని గ్రహించలేక- ఎంతసేపూ ఇతరులలోని తప్పులు వెదుకుతోంది. తన సమస్యలే కాని వాళ్ల సమస్యలు అర్థం చేసుకోలేక పోతోంది. వాళ్ల దృష్టితో ఆలోచించలేకపోతోంది... "లల్లీ... ఒక్క మాట...నీ మరదలు- ఆడబిడ్డ వాళ్లు నిన్ను 'ఆదర్శం'గా తీసుకుంటున్నారేమో... నువ్వు మారు.... వాళ్లూ మారతారు అందరికీ సంతోషంగా వుంటుంది..." అనకుండా వుండలేకపోయాను. గేటు దాటుతున్న లలిత క్షణం ఆగి విస్మయంగా నా వంక చూస్తోంది. అలా చెప్పినందుకు ఎక్కడ నా మీద విరుచుకుపడుతుందోనని భయపడుతున్న నాకు... ఆమె చూపుల్లో...ఏదో ఆలోచన.. కొత్తగా... మెరుస్తూ.... ○

# హలో! డాక్టర్ నేనేం చెయ్యాలి?



డా. కొత్త రవీంద్రబాబు

**జి. కె. రమేష్, టి. కె. పాలెం.**

నా పెదవులు నల్లగా వుంటాయి. లావుగా వుంటాయి. ప్లాస్టిక్ సర్జన్స్ ఎక్కడ వుంటారు? ఖర్చు ఎంత అవుతుంది? వయసు 18 సంవత్సరాలు.

జవాబు:– మెడికల్ కాలేజీలకు అనుబంధంగా వున్న జనరల్ హాస్పటల్స్ అన్నింటిలోనూ ప్లాస్టిక్ సర్జన్స్ వుంటారు. బెజవాడ, హైదరాబాద్, గుంటూరులలో ప్రైవేటు ఆస్పత్రులలో ప్లాస్టిక్ సర్జరీ చేస్తారు. ఖర్చు పెద్దగా భరించ లేనంతగా వుండక పోవచ్చు. గవర్నమెంట్ హాస్పటల్స్‌లో ఖర్చు వుండదు.

**పి. ఆర్. రావు, విజయవాడ.**

కడుపులో అల్సర్‌కు ఆపరేషన్ చేయించుకున్నాను. ఆపరేషన్ అయి నెల రోజు లయింది. రతిలో పాల్గొనవచ్చా?

జవాబు:– కుట్లు మాని, బాధ లేకపోతే రతిలో పాల్గొనవచ్చు.

**పి. కే. రావు, గుడివాడ.**

కథలు రాయాలని వుంది. రాస్తే పత్రికలలో వేసుకుంటారా అని అనుమానంగా వుంది.

జవాబు:– రాయాలన్న తపన వుంది గనుక మీ మనసులోని భావాలను క్రమ పద్ధతిలో రాయండి. రాసిన తర్వాత మీ స్నేహితులకు చూపించి మీరు రాసిన దానిలో వున్న మంచి చెడుల గురించి చర్చించండి. అవసరం అయితే మరలా మరలా తిరిగి రాసి వజ్రాన్ని సానపట్టినట్లు నిగ్గుతేల్చండి.

పత్రికలలో వేసుకుంటారో లేదో అన్న ఆలోచన అప్రస్తుతం!

మీలోని రచనా శక్తిని పెంపొందించుకుంటూ సాఫు చేసిన రచనలను పత్రికలకు పంపండి.

రచన తిరిగి వచ్చిందని బాధపడకుండా మీ కృషి కొనసాగించండి.

ఇప్పుడు పేరున్న రచయితలు ఒకప్పుడు మీలా భయపడిన వారే అన్న విషయం గుర్తుంచుకోండి.

**టి. జి. సి. రావు, విశాఖపట్నం.**

చదువు తున్నది బుర్ర కెక్కడం లేదు. నిద్ర పట్టదు. సెక్సుపరమైన కోర్కె లెక్కువ.

జవాబు:- సెక్సు పుస్తకాలు, మాగజైన్సు చదవటం మానండి. సెక్సు సినిమాలు చూడకండి.

ఒక పేజీ చదివాక అందులో వున్న ముఖ్యమైన విషయాలను మననం చేసుకోండి. పాయింట్స్ కాగితం మీద రాసుకోండి.

ఎక్కువ సేపు చదివినందు వలన నిద్ర దానంతటదే వస్తుంది.

స్పీమన్ బిళ్ళలు రోజుకు మూడు చొప్పున మూడు నెలలపాటు వాడండి.

**డి. శైలజ, రామకృష్ణాపురం.**

వయసు 17 సంవత్సరములు. జుట్టు వూడిపోతున్నది. నెరుస్తున్నది. తల మొత్తము నెరసింది.

జవాబు:– జావిట్ గొట్టం రోజు రాత్రి భోజనానంతరం ఒకటి వేసుకోండి. మూడు నెలల పాటు నెరసిన జుట్టుకు నల్లరంగు వేసుకోండి.

**ఎం. సాంబశివరావు, కావలిపురం, ప.గో.జిల్లా.**

మీ శీర్షిక నచ్చింది. నా వయసు 18 సంవత్సరములు. ముఖం మీద పొక్కులను గిల్లుతుంటాను. గిల్లిన చోటల్లా నల్లమచ్చలు పడుతున్నాయి. మందుల వలన ప్రయోజనం లేక పోయింది.

జవాబు :– ముఖం మీద మొటిమలను పొక్కులను గిల్లడం ప్రమాదకరం.

గోళ్ళు తరచు శుభ్రంగా కత్తిరించుకుని చివరలు ఫైల్ చేసుకోండి.

నెలరోజులపాటు లెడర్‌మైసిన్ 300 మిల్లీగ్రాముల గొట్టం రోజూ రాత్రి పడుకోబోయేముందు వేసుకోండి.

ముఖం తరచు శుభ్రమైన నీటితో కడుగుకోండి.

నల్లమచ్చలు పోవటానికి జెబెక్స్ బిళ్ళ రాత్రి భోజనానంతరం ఒకటి చొప్పున ఆరునెలలపాటు వాడండి. ○



సీరియల్

# సాగరమథనం

## అడివి సూర్యకుమారి

<u>ఇంతవరకూసాగిన కథ-8 :</u> శ్రీలంక ఉగ్రవాదులను అరికట్టడంలో తమ వంతు కర్తవ్యాన్ని నెరవేర్చి స్వదేశం తిరిగి వెళ్తున్న భారత శాంతి సేనకు వీడ్కోలిచ్చేందుకు వచ్చిన ముగ్గురు అధికారులు దుండగుల బుల్లెట్లకు బలి అవుతారు. ట్రింకోమలిలో శక్తి నెలకొల్పిన సేవాగ్రామంలో జయసూర్య డాక్టరుగా చేరతాడు. రణసింఘె పారిపోవటంలో నిర్లక్ష్యం చూపిన పోలీసుల్ని, ఇన్‌స్పెక్టర్‌ను డి.జి.పి. మేఘవర్ణ కాల్చిచంపుతాడు. అనేక మంది నరికిన తలలతో వున్న అంబులెన్స్‌ను ఒక వ్యక్తి ఎత్తుకుపోతాడు.

(గత సంచిక తరువాయి)

చీకటి రాక్షసి జడలు విప్పుకున్నట్లుంది.

స్ట్రీట్ లైట్లు లేవు.

ఇళ్ళల్లో దీపాలుకూడా ఆర్పేసినట్లున్నారు.

అంతా గాఢాంధకారం.

తలలున్న గోతాల్ని తీసుకొని వ్యాన్ ఓ లో క్లాసుపీపులుండే లొకాలిటీలో కొచ్చింది.

నాల్గు నిముషాల తర్వాత వ్యాన్ ఓ పెంకుటింటి ముందాగింది.

అందులో నుండి దిగిన ఆగంతకుడు ఎటూ చూడకుండా, తలొంచుకొని గబగబ రెండంగల్లో గుమ్మం సమీపించి చిన్నగా తట్టాడు.

పావు నిముషంలో తలుపు తెరుచుకొంది.

అతను లోపల కదుగిడటం ఆలస్యం తలుపులు మూసుకున్నాయి.

ఆ వెలుతురులో అక్కడున్న వారంతా అతణ్ణి చూశారు.

స్కంధ అతణ్ణి చూసి "ఎవర్నువ్? ఇక్కడి కెలా రాగలిగావ్?" ఆశ్చర్యంగా చూస్తూ అడిగాడు.

"నేనెవరో తర్వాత చెబుతాగాని, బైట వ్యాన్‌లోని తలలు మీ వాళ్ళవేనేమో లోపలికి తెచ్చి చూసుకోండి" అన్నాడతడు.

అతని పైకి దూకబోయే అనుచరుల్ని ఆపుతూ స్కంధ "వెళ్ళి ఆ తలల్ని తీసుకురండి" అన్నాడు ఆందోళనగా.

నిన్నటి నుండి తమ వాళ్ళుకొందరు కనపట్టం లేదు. తను వారి కింకా ఏ ఎస్సైన్‌మెంటు అప్పగించ లేదు. రోజు మాదిరిగా వారీ కార్యాలయానికి రాలేదు సరికదా! తామెక్కడున్నది, ఏం చేస్తున్నదీ తనకి కనీసం కబురైనా చేయలేదు. ఇది తమ రూల్స్‌కి విరుద్ధం. పార్టీ రూల్స్‌కి కట్టుబడని వాళ్ళు కఠినంగా శిక్షించబడతారని అందరికీ తెలుసు. తెలిసి వాళ్ళు ఎలాంటి కమ్యూనికేషన్ తన కందివ్వ లేదంటే వాళ్ళేదో ప్రమాదంలో చిక్కుకున్నట్లే. తనా విషయంగానే ఇప్పుడు చర్చించబోతున్నాడు ఇంతలో ఇతను వచ్చాడు.

స్కంధ అనుచరు లిద్దరూ చిన్నవి రెండు గోతాలు లోపలికి తెచ్చి దొర్లించారు. తాటికాయల్లా దొర్లిన తలకాయల్ని చూసి 'కెవ్వ'న అరిచారు వాళ్ళు.

వాళ్ళెన్నో నేరాలు, ఘోరాలు చేశారు. కాని ఇంత అమానుషా లెన్నడూ చేయలేదు.

ఇది మానవ జాతి మానవత్వాన్నే సవాలు చేస్తున్న ఘోర దుర్ఘటన.

మనసులో నుండి మమత, జాలి, సోదరభావం మొదలైన పదాల్ని అడుగంట తుడిచి వేసే రాక్షస క్రియ ఇది.

ఆ తలలను గుర్తించిన అతని అనుచరులు భోరు భోరుమని ఏడిచారు.

స్కంధ మోకాళ్ళపై కూలబడి ఓ తలను చేతిలోకి తీసుకొని వెక్కి వెక్కి ఏడ్చాడు. అది అతని బావమరిదిది. అతని చెల్లెలికి పెళ్ళై రెండు నెలలైనా కాలేదు. ఆమె నుదుటి కుంకుమ ఇలా రాలిపోయింది.

స్కంధ కళ్ళు మండుతున్న సూర్యగోళాలయ్యాయి.

అతడు తలెత్తి ఆగంతకుడి వైపు

## ప్రశ్నావళి:

# రచయిత్రి జవాబులు

శ్రీలంకలో ప్రస్తుత రాజకీయ పరిణామాల మీద, జాతి విద్వేషాలమీద పాఠకులు అడిగే ప్రశ్నలకు రచయిత్రి శ్రీమతి అడివి సూర్యకుమారి ఆంధ్ర సచిత్ర వారపత్రికలో జవాబులు యిస్తారు. పాఠకులు తమ ప్రశ్నలను కార్డుమీద వ్రాసి -

"సాగర మథనం ప్రశ్నావళి", ఆంధ్ర సచిత్ర వారపత్రిక, గాంధీనగరం, విజయవాడ-3 అన్న చిరునామాకు పంపాలి. వ్యక్తిగత ప్రశ్నలు, చొప్పదంటు ప్రశ్నలు వద్దని మనవి

- ఎడిటర్



క్రూరంగా చూశాడు తీక్షణంగా చూశాడు

చటుక్కున లేచి ఆగంతకుడిపై విరుచుకు పడ్డాడు

కాని వచ్చిన వ్యక్తి చలించ లేదు అతణ్ని వెనక్కి నెట్టాడు

ఆ మాత్రానికే అతడు అల్లంత దూరాన పడ్డాడు స్కంధ అనుచరులు ఆగంతకుడి పైకి లంఘించబోగా అతడు వారిస్తూ -

"ఆగండి! మీ అనుమానం నేనే చంపానని కదూ! మీరింత తెలివి తక్కువ వాళ్లు గాబట్టే శత్రువు మిమ్మల్నింత తేలిగ్గా దెబ్బతీయ గలిగింది నేనే చంపి నేనే ఎందుకు తెస్తాను? అనురాధపురం నుండి వెళ్తుంటే దారిలో " అతడు జరిగిన సంగతంతా చెప్పాడు

## సాగర మథనం

స్కంద అతణ్ని చూస్తూ "నువ్వు నువ్వా రోజు సేవాగ్రాం దగ్గర మమ్మల్ని కొట్టినవాడివికదూ!

"ఔను! మీ ప్రతాపం ఆడపిల్లల మీద చూపిస్తుంటే ఊర్కోలేక వచ్చాను వాళ్ళు ఆడపిల్లలు కాదు ఆడ చిరుతలు ఇంకెప్పుడూ వాళ్ళ జోలికి పోకండి ఆడపిల్లల చేత మళ్ళీ లేవకుండా తన్నులు తిన్నారన్న అపఖ్యాతి మీక్కలక్కుండా చేశాను సంతోషించండి' చివరిమాట హాస్యంగా అన్నాడతను

వాళ్ళ మొహాల్లో రోషం మెదిలింది



"వర్ గెటిట్ బ్రదర్స్ నౌ వాట్ కెన్ వ్యుయ్ డూ?

"నువ్వు మావాడి వెలా అవుతావ్? మాకు శత్రువువి' అన్నాడు స్కంధ అనుచరుడు

"నో! నేను మీలాంటి వారికెవ్వరికీ శత్రువుని కాను నేను అవినీతికి, అధర్మానికి, అసత్యానికి, రాక్షసత్వానికి శత్రువుని మీకు మిత్రుణ్ని మీ వాణ్ని అయితే నా అనుమానం నిజమేనన్న మాట వీళ్ళు మీ వాళ్ళే!'

సంభ్రమంగా అతడి మాటలు వింటున్న వాళ్ళకి కళ్ళు మళ్ళీ నీళ్ళతో నిండాయి, తమ వారి దుస్థితికి

అతని ఆజానుబాహు రూపం, ఆ నోటి నుండి వస్తున్న మాటలు వారిని మెస్మరైజ్ చేశాయి అతడు తమ కంటే అధికుడుగా వాళ్ళకనిపించాడు

"నువ్వెవరు? నీ పేరేంటి? మాకు సాయం చేయాలని నువ్వెందు కనుకుంటున్నావ్? అడిగాడు స్కంధ

"మీకీమధ్య మందుగుండు సామాగ్రిని, ధన సహాయం- చేసే వాళ్ళని మీరీ ప్రశ్న అడిగితే ఏం చెప్పారు వాళ్ళు?

ఖంగుతిన్నాడు స్కంధ ఎంతో గోప్యంగా ఉంచబడ్డ విషయం- కేవలం తనకూ సమరసింహుకు తప్ప మరొకరికి తెలీదు అలాంటిది ఇతనికెలా తెలిసింది? ఇతనెవరో సామాన్యుడు కాదు

'వాళ్ళు మాకు మిత్రులే'

'నేనూ అలాంటివాణ్నే నా పేరు అగ్ని అంటూ అతనొచ్చి స్కంధ పక్కన

కూర్చొని–

"ఇప్పుడు మీరాలోచించాల్సింది మీ నాయకు దేమయ్యాడోనని. ఒక వేళ అతన్నెవరైనా కిడ్నాప్ చేసినా వాళ్ళ కుపయోగ మేమిటి? పోలీసులే చంపి వుంటే వాళ్ళకి లాభ మేమిటి? ఇటీవల జరిగిన పోలీసు అధికారుల హత్యకి మీ నాయకుడికి సంబంధం ఉందా? ఈ హత్యలు ఆ హత్యలకి ప్రతీకారమా? ఒక్కసారి ఆలోచించండి. నిజానికి ఎవరెవరిని చంపుతున్నారు అన్న ప్రశ్నలకిసమాధానాలు పూర్తిగా దొరికిన తర్వాత ఓ నిర్ణయానికి రండి. దయచేసి తొందర పడకండి. అసలు మీరంతాఇలా చెదిరి పోవటానికి కారణం ఏమిటి? మీకు ధనసహాయం ఆయుధసాయం చేసే శక్తి వెనకుంది. మరి మీ రెందుకు పరాజితులౌతున్నారు?' అడిగాడు అగ్ని.

ఈ లోపుగా కొందరు ఆ తలలను లోపలికి తీస్కెళ్ళారు. అక్కడంతా నీరు పోసి శుభ్రంగా కడిగారు.

స్కంధ మనసు పది సంవత్సరాలు వెనక్కి వెళ్ళింది. అప్రయత్నంగా ఆనాటి విషయాలతని నోటి నుండి రాసాగాయి.

"ఈ ప్రజా విముక్తి పార్టీ సదుద్దేశంతో స్థాపించ బడింది. కొన్ని వందల సంవత్సరాలుగా కలిసి మెలిసి జీవిస్తున్న, సింహళులకు తమిళులకు మధ్య స్పర్థలు సృష్టించ బడ్డాయి. తమతో సమానంగా అన్నిరంగాల్లో అభివృద్ధి పథంలో పయనిస్తున్న తమిళుల్ని చూసి సింహళీయులకి కన్ను కుట్టింది. అప్పటి దాకా తమకు పోటీ లేదు. నేడు విద్యా, వైజ్ఞానిక, వ్యాపార



## వినోద్-మహేష్‌ల మాటల యుద్ధం

గతంలో రజనీష్ శిష్యులుగా వున్న మహేష్‌భట్, వినోద్‌ఖన్నాల మధ్య పచ్చగడ్డివేస్తే భగ్గు మంటోందట. "జుర్మ్" షూటింగప్పుడు వినోద్ అడ్రసులేకుండా పోవటంతో యిద్దరికీ మధ్య ఏదో గొడవ ప్రారంభమైంది. ఇద్దరూ ఒకరినొకరు పరుషపద జాలాలతో తిట్టుకుంటూ పత్రికలకు ఎక్కుతున్నారు. ఈ విధంగా వీరిద్దరిమధ్యా మాటలయుద్ధం ఒకవైపు కొనసాగుతూనే వుంది, మరో వైపు షూటింగ్ కార్యక్రమాలు జరిగిపోతూనే వున్నాయి. మరి ఈ యుద్ధం ఎప్పటికి ముగుస్తుందో?

రంగాలన్నింట, తమిళులు తమకు సాటిగా, దీటుగా అంతకన్న మిన్నగా ఉండటం చూసి సహించలేక పోయారు. మేము ఎక్కణ్ణించో వచ్చి తమ దేశ వనరుల్ని, సంపదని అనుభవిస్తున్నామని కక్ష కట్టి కత్తి కెర వేయసాగారు. మేమెక్కణ్ణించొచ్చాం. ఈ గడ్డ మీది వాళ్ళమేగా!' ప్రభుత్వం సింహళులది కావటంతో వివక్షత చూపసాగారు. అది అన్ని రంగాల్లో వికృత రూపం దాల్చి విలయతాండవం చేస్తోంది.'

'ఇవన్నీ నాకు తెలుసు. మీ రెందుకిలా అయిపోయారన్నదే నా ప్రశ్న'.

'అదే చెప్పబోతున్నా. మా పార్టీలో చేరిన వారంతా సింహళ, తమిళ భేదాలకి బలైనవారు.

శ్రీలంక అధికారుల దౌష్ట్యానికి ఉద్యోగాలు పోగొట్టుకొన్నవాళ్ళూ.

ఆ ఉద్యోగాలు కూడా వీళ్ళు తమిళులైనందు వల్లనే పోయాయి తప్ప మరో కారణం లేదు.

చదువుల్లో వివక్షత చూపించారు నూటికి 70% 80% మార్కులు తక్కువగాకుండా వచ్చిన అనేక మంది తమిళ విద్యార్థులకి కాలేజీల్లో, యూనివర్సిటీల్లో సీట్లు లేవు. అదే 40% వచ్చిన అనేక మంది సింహళ విద్యార్థులకి పిలిచి సీట్లిచ్చారు. ఈ ప్రభావం అనేక వేలమంది విద్యార్థుల మీదే గాక వారి తలిదండ్రుల మీద కూడా పడింది. తమిళులకు ప్రత్యేక వసతులు కల్పించడం కోసమే ఎడ్మినిస్ట్రేటివ్ పాలసీ అనే పేరుతో, మాకు ప్రత్యేకం

## ఆకాశగమ్యాలు

వాతావరణ కాలుష్యంతో
అలసట నీరసంతో
గాలిలో కొరివి దయ్యంలా
దేహం తేలుతోంది.
రైలు జనాల గళాల రొదలు
జిబిజిగా ముసిరిన ఈగల్లా
చచ్చి కుళ్ళిన దేహంపై వాలినట్లు
సందడిగా గందరగోళం చేస్తున్నాయి
చీకట్లో కదుల్తున్న రైలుబండి
చింతల మూటలు మోసుకుంటూ
బాధల నడకల శబ్దాలతో
ఎన్నో గాధలు అల్లి చెబుతోంది



ఎదురుగా మెరిసిన ఓ పూబోణి
నవ్వుల పెదాల లావణ్యంతో
లైట్లు జిమ్మిన కాంతి పెంచి
వెలుగుతున్నాయి
లైట్లు అన్నీ ఆమె కనులనే
ముద్దుగొన్నాయి
చీకటిలో చిమ్మిన కాంతిరేఖ
ఆకలితో ఎదురైన అపూర్వ అమృతశాఖ
కొత్త జీవ చైతన్యం పూలజల్లు
రాలుస్తూ
ఆకసంగమ్యాలు అందంగా చూపించాయి

—పోతుకూచి సాంబశివరావు

రిజర్వేషన్లు కల్పిస్తామనే పేరుతో తయారు చేశామని చెప్పే ఈ కొత్త ఎడ్మినిస్ట్రేటివ్ పాలసీ నిజానికి మా అందరి జీవితాల కదిగొడ్డలిపెట్టు'.

'అవును. అది నిజమే' అన్నాడు వింటున్న అగ్ని.

'అంతేనా! కాలేజీ, యూనివర్సిటీల్లో ఇది వరలో ఎలాగో చదువుకొన్న యువకులు అంటే ఈ కొత్త ఎడ్మినిస్ట్రేటివ్ పాలసీ రాకముందు పాసైన విద్యార్థు లెవ్వరికీ కూడా చదువుకు తగ్గ ఉద్యోగాలు రాకుండా చేశారు. నాలుగో తరగతి స్థాయి ఉద్యోగం కూడా రాలేదు. ఆర్మీలో గాని, పోలీసు శాఖలో గాని నావీలో గాని చేరటానికి మేం అప్లికేషన్లు పెట్టుకుంటే కనీసం వాటిని పరిశీలించకుండా బుట్టదాఖలు చేశారు. ఎందుకని? మేం తమిళులమని. తమిళు లెవ్వరికి అధికార యంత్రాంగంలో స్థానం ఉండరాదు. అది వాళ్ళ ధ్యేయం.

స్కంధ పక్క నున్న యువకుడు ముందుకు జరిగి 'తమిళులంతా దేశం వదిలి వెళ్ళిపోవాలని ఈ దేశం కేవలం సింహళీయులదేనని, వీళ్ళు చేస్తున్న వాదన వింటూంటే ఆశ్చర్యమేస్తుంది. ఒకవేళ ఇది మా దేశం కాకపోతే ఈ దేశం సింహళీయుల క్కూడా సంబంధించింది కాదు. ఔను. సింహళీస్‌కి హక్కుంటే మాకూ ఉన్నట్లే, 1850 ప్రాంతంలో ఇదికూడా భారత్‌తో పాటు బ్రిటీష్ వారి పాలనలో ఉన్నప్పుడు మా తాత ముత్తాతలు ఈ దేశంలో వున్న రబ్బరు, టీ, కాఫీ తోటల్లో పన్చేయటానికి భారత్ నుండి పిలిపించ బడ్డారు. అప్పటి నుండి ఇక్కడే అనేక పనులు చేసుకొని జీవితం వెళ్ళబుచ్చు కుంటున్నారు. బ్రిటీష్ వారిని ఇక్కడి నుండి వెళ్ళగొట్టే ప్రయత్నంలో మా పూర్వీకులు ప్రధాన మైన పాత్ర వహించారు. నిజాని కిప్పుడు సింహళులమని చెప్పుకొనే వీరు దేశ స్వతంత్రం కోసం పోరాడింది అతి తక్కువ. ఈ దేశంలో ఉండటానికి పూర్తి స్వతంత్రం అనుభవించడానికి నిజానికి వారికన్న మాకు నైతిక హక్కెక్కువ. మా కంటే కొన్ని వందల సంవత్సరాల క్రిందట-

## సాగర మథనం

వాళ్ళొచ్చారు ఈ దీవి మీదికి. అంతా భారత్ నుండి వచ్చిన వాళ్ళమే. కొద్దిగా ముందూ వెనకా తేడా అంతే...' ఆపాదతను.

అగ్ని వారి వైపు చూసి చిరునవ్వుతో "అయితే తగాదా వెనకా ముందూ వచ్చిన వాళ్ళ మధ్య అన్నమాట" అన్నాడు.

"అంతేగాదు. ఈ దేశంలో అభివృద్ధి చెందిన ప్రతి అంశంలోనూ మా భాగం వుంది. మా కష్టం వుంది. అటువంటిది ఈ దేశాన్నొదిలి గత 200 సంవత్సరాలుగా ఎటువంటి సంబంధం లేకుండా వదిలేసి వచ్చిన భారతీకు మేం ఎందుకెళ్ళాలి? వాళ్ళు మమ్మల్ని రెండవ తరగతి పౌరులుగా చూడరని గ్యారంటీ ఏమిటి? స్వంత దేశంలో నే మా స్థితి ఇలా వుంటే ఆ దేశంలో మా పరిస్థి తేమిటి?" ఆవేశంగా అడిగాడా యువకుడు. అతడు ఆవేశ పడటంలో అర్థం వుంది. అగ్ని ఓదార్పుగా అతని భుజం తట్టాడు.

స్కంధ ఆవేశం ఆగటంలేదు. కొన్నేళ్ళుగా అతని కడుపులో రగుల్తున్నదీ ఆవేశం. అదీ రోజు వెళ్ళగక్కబడింది.

"ఈ కొత్త పరిశీలనా విధానం వలన యువకుల విషయంలో జరిగిన అన్యాయం ఇలా ఉంటే పారిశ్రామికంగా మటుకు... మనకెంత అన్యాయం జరిగిందీ... అని అగ్ని వైపు చూసి "మీరు వినాల్సిం దసలు ఇది. ఇది వింటే మా గుండె లెలా మండుతున్నాయో మీ కర్థమౌతుంది. 74 – 75 సంవత్సర ప్రాంతాల్లో చాలా లాభసాటిగా నాగుతున్న ప్రైవేట్ స్పిన్నింగ్‌మిల్స్‌ని, రైస్ మిల్స్‌ని, టీ ఎక్స్‌పోర్ట్స్ కంపెనీలని, రబ్బరు మార్కెటింగ్ కంపెనీలని, కొబ్బరి కాయల ఎగుమతి కంపెనీలను ఏదో కుంటిసాకులు చెప్పి వారిపై వత్తిడి తీసుకొచ్చి వారి కిష్టం లేకుండా ప్రైవేటు మానేజిమెంటుని తొలగించి నేషనలైజేషన్ అనే పేరుతో ప్రభుత్వం పరిపాలనా బాధ్యతను చేతిలోకి తీసుకొంది. అంతేగాక వాళ్ళ కివ్వాల్సిన నష్టపరిహారాన్ని కూడా డిప్రిసియేషన్ వ్యాల్యూ

సంవత్సర సంవత్సరానికి తగ్గించి, ప్రభుత్వానికి వారు కట్టాల్సిన పన్ను మినహాయించుకోవటమేగాక ఫ్యాక్టరీ వర్కర్స్‌కి మోతాదు మించిన జీతాలు ఇస్తున్నారన్న నెపంతో ఆ డబ్బంతా కూడా నష్టపరిహారంలో తగ్గించి మిగిలిన డబ్బు వాయిదాల పద్ధతిలో ఇవ్వసాగారు. దీంతో బళ్ళు ఓడలు, ఓడలు బళ్ళు అయ్యాయి. జాతీయకరణ చేసిన కంపెనీల్లో డైరెక్టర్లుగా, ఛైర్మన్లుగా కేవలం సింహళీయులకి మాత్రమే అవకాశం ఇచ్చి ఎంతో అనుభవం, పరిపాలన యోగ్యత వున్న అనేకమంది కంపెనీ యజమానుల్ని కేవలం తమిళులనే ఉద్దేశ్యంతో ఎటువంటి అవకాశాలు ఇవ్వలేదు. డైరెక్టర్లుగా, ఛైర్మన్లుగా చేరిన ఈ సింహళీయులు మెల్లి మెల్లగా కంపెనీల్లో వున్న అనేకమంది తమిళుల్ని తొలగించనారంభించారు. ఈవిధంగా ఒకేసారి అందరిని ఉద్యోగాలనుండి తొలగిస్తే గొడవౌతుందని మెల్లి మెల్లగా ఐదు వేల మందిని ఉద్యోగాల్లో నుండి తొలగించి వారి జీవితాలు నాశనం చేశారు.

ఈ దెబ్బ తిన్న వాళ్ళంతా ఓ చోట చేరి తమ హక్కులకోసం పోరాడటానికి నిశ్చయించుకున్నారు. ఈ ఉద్యమానికి అనేకమంది తమిళ సంపన్నులు ప్రోత్సహించారు. ఈ ఉద్యమం ఊపందుకొని పార్లమెంట్ హౌస్ ముందు రెండు వేల మంది ప్రదర్శన ఇస్తున్న సమయంలో హఠాత్తుగా పోలీసులు దాడి చేసి వెయ్యి మందిని అరెస్ట్ చేశారు. ఆ తర్వాత వారం రోజులకి ఐదు వందల మందిని వదిలేశారు. మిగిలిన ఐదు వందల మందిమీద పార్లమెంటుహౌస్ మీద దాడి చేయడానికి వచ్చారన్న నెపంతో కేసులు బనాయించారు. కేసు నడుస్తున్న సమయంలో వాళ్ళందరినీ సమావేశ పరిచి, కొందరు ప్రభుత్వ ప్రధానాధికారులు 'మీ రుద్యమం మానేసి మేం ఇచ్చే ఉద్యోగాల్లో చేరతారా? లేక కోర్టు ప్రాసిక్యూషన్స్ చేస్తే శిక్ష అనుభవిస్తారా?' అనడిగారు. ఆ ఐదొందల మంది తలో చోట ఉద్యోగాల్లో చేరిపోయారు. నిజానికి వాళ్ళంతా ఉద్యమంలో ముఖ్యులు. ఆ తర్వాత మా ఉద్యమం బాగా దెబ్బ తిన్నది. అదే సమయంలో కొందరు ప్రభుత్వాన్ని అహింసావాదంతోనే ఎదుర్కోవాలనే వుద్దేశంతో మా నుండి విడిపోయారు. దాంతో మా ఉద్యమకారులంతా తలో దిక్కు అయిపోయారు. వాళ్ళ చీలిక వలన పార్టీ ప్రతిష్ఠ దెబ్బ తిన్నది.

ఇంతలో ఒకతను హడావుడిగా లోపలికొచ్చాడు.

'స్కంధా! ఎవరివో తలలున్న వ్యాన్‌ను పోలీసు స్టేషన్ నుండి దొంగిలించుకొచ్చారుట. అది మనింటిముందుందేమిటి?' ఆశ్చర్యంగా కొత్త వ్యక్తి కేసి చూస్తూ అడిగాడు.

'ఔను. ఆ దొంగను నేనే. ఇంతకీ ఏమనుకుంటున్నారో చెప్పు?' అడిగాడు అగ్ని.

అనుమానంగా చూశాడతడు.

'చెప్పు విషయమేమిటి?' అడిగాడు స్కంధ. అప్పుడు బైట పెట్టాడతడు. "ఆ వ్యాన్ని డ్రైవర్ని హెడ్‌క్వార్టర్స్‌కి తీస్కెళ్ళారుట. మనతో ఆ డ్రైవర్కి సంబంధం ఉందనుకుంటున్నారు. ఎవరో జీప్‌లో వచ్చిన వ్యక్తి ఎత్తుకెళ్ళాట్ట. ఇంకా ఆశ్చర్యమేమంటంటే ఆ జీప్ ఐ. జి. పి. దిట"

స్కంధ, అతని అనుచరులు అనుమానంగా చూశారు అగ్ని వైపు.

అగ్ని నవ్వి 'ఈ వ్యాన్‌ను ఎలా ఎత్తుకొచ్చానో, అదీ అలా తెచ్చిందే' అదిసరే. ముందా ముగ్గురు డ్రైవర్లని రేపు ఎన్ని గంటలకి, ఏ రోడ్డు గుండా తీసుకుపోతారో కనుక్కోండి. వాళ్ళ ముగ్గురు మనక్కావాలి. వాళ్ళ ద్వారా ఈ దారుణానికి కారకులెవరో కనుక్కోవచ్చు. హెడ్‌క్వార్టర్స్ చేరుకుంటే వాళ్ళు మళ్ళీ మనక్కనిపించరు" అన్నాడు అగ్ని.

'ఔను. ఆ పోలీసు లెంతదారుణానికైనా ఒడిగడ్తారు. నువ్వెళ్ళి, మన శ్రమణుణ్ని పిలుచుకురా' అన్నాడు స్కంధ. పది నిముషాల్లో ఓ బుద్ధ సన్యాసి అక్కడికొచ్చాడు. స్కంధ అతణ్ని చూసి చెప్పబోయేంతలో 'నాకు తెలుసు. రెండు గంటల్లో నేనా విషయం తెలుసుకొని ఫోన్ చేస్తాను లేదా నేను వస్తాను' అంటూ వెళ్ళిపోయాడు.

ఈలోపు టీలొచ్చాయి. అంతా 'టీ' తాగారు. భవిష్యత్ కార్యక్రమాన్ని గురించి చర్చిస్తున్నారు. స్కంధ మాట్లాడుతున్నా, అగ్ని బుర్ర వేగంగా పని చేస్తోంది.

రెండు గంటల్లో శ్రమణ్ వచ్చి వివరాలందించాడు. 'ఇప్పుడు చెప్పు?ఎలా తెస్తావ్ డ్రైవర్లని? ఆ జీప్‌లోని మనుషుల్ని చంపేద్దామా?' అడిగాడు స్కంధ.

'వద్దు. ఎవరినీ చంపకుండా డ్రైవర్లని ఇక్కడికే తెస్తాను. రేపు కలుస్తాను. గుడ్‌నైట్' ఎలావచ్చాడో అలాగే వెళ్ళిపోయి వ్యాన్‌లో కూర్చోటం అది ముందుకు దూసుకుపోవటం సెకన్లలో స్కంధ అతని అనుచరులు- అగ్ని రావటం పోవటం ఈ మధ్యకాలంలో జరిగిందంతా నిజమేనని నమ్మించుకోవటానికి తంటాలు పడాల్సొచ్చింది.

శ్రమణుకు చెప్పిన విధంగానె మర్నాడు- మధ్యాహ్నం దాటింది. ఎండలేదు. చలిగా వుంది. సన్నని తుప్పర పడోంది. అనురాధపురా నుండి

## చన్నీటి స్నానం చాలా మంచిది




జీవ్యావయవ ఆకార- నిర్మాణ పరిణామ శాస్త్ర (ఇవల్యూషనరీ మార్ఫాలజీ) సంస్థ శాస్త్ర వేత్తల పరిశోధనలో చన్నీటి స్నానంవల్ల వ్యక్తి అయనవికిరణ ప్రభావానికి తట్టుకునే శక్తి పెరుగుతుందని వెల్లడయింది. ఈ సందర్భంగా తెల్ల ఎలుకలపై ప్రయోగాలు జరిగాయి. ఎలుకల బృందాన్నొకదానిని సాధారణ పరిస్థితులలో ఉంచారు. రెండవ బృందాన్ని చన్నీటికి అలవాటు చేశారు మూడవ బృందాన్ని చన్నీటి నుండి వేన్నీళ్లకు క్రమేణా మార్చారు. అటు తర్వాత వీటన్నిటినీ ఎక్స్-రే తీశారు. సాధారణ పరిస్థితులలో నున్న ఎలుకలలో క్రోమోజోముల నష్టం చాల ఎక్కువగా ఉండగా, చన్నీరు- వేడినీరు రెండింటిలో స్నానం చేసేవాటిలో అంతకన్నా తక్కువగాను, కేవలం చన్నీటిస్నానం చేసేటివాటిలో అతి తక్కువగాను జరిగింది.

## సాగరమథనం

ట్రింకోమాలికి ఒక జీపు, ఒక వ్యాన్ వెళుతున్నాయి. ముందున్న జీపులో ఓ సర్కిల్ ఇన్స్పెక్టరు, నల్గురు కానిస్టేబుల్స్ ఉన్నారు. వెనక వస్తున్న వ్యాన్‌లో డ్రైవరు, అతని వెనక డోర్ వుంది. ఆ పక్కనే వున్న క్యాబిన్‌లో డ్రైవర్లు ముగ్గురూ కూర్చున్నారు. డ్రైవర్లకి, వ్యాన్ నడిపే డ్రైవర్‌కి మధ్య డోర్ వేసి వుంది.

ట్రింకోమాలి ఇంకా పది కిలో మీటర్ల దూరంలో కొచ్చింది. కను చీకటి పడింది.

క్యాబిన్‌లోని డ్రైవర్లు తాము చేసిన తప్పేంలేకపోయినా, తమ పైకి వచ్చిన ఈ కేసును ఎలా మాఫీ చేయించుకోవాలో ఏం చేస్తే తమ ప్రాణాలు దక్కుతాయో తెలీక తల్లడిల్లి పోతున్నారు. డ్రైవరొక్కడె అయితే వాణ్ణి తన్ని పారిపోయేవారే. కాని ముందు మెషిన్‌గన్స్‌తో జీప్‌లో ఉన్న సర్కిల్ ఇన్స్పెక్టర్ యముడిలా కన్పించాడు వాళ్ల కళ్లకి.

కన్నీళ్లు తుడుచుకుంటూ ప్రాణాలపై ఆశలు వదులుకొని కూర్చున్నారు ముగ్గురూ.

ఇంతలో వ్యాన్ కీచుమనే శబ్దంతో ఆగింది. ఏం జరిగిందోనని చూసే అవకాశం లేక చెవి ఒగ్గి వినటానికి ప్రయత్నిస్తున్నారు.

"ఈ పక్కనే వున్న పల్లెటూరు మాది. ఈ విలేజి పోలీసు భార్యను నేను. నా భర్త ట్రింకోమాలి హాస్పిటల్‌లో వున్నాడు. కొంచెం నన్ను మీతో ప్రయాణం చేయనిస్తే ధన్యవాదాలు. నన్ను ట్రింకోమాలిలో దించెయ్యండి. హాస్పిటల్‌కి పోతాను. మీకు పుణ్యం వుంటుంది. దేవుడు మీకు మేలు చేస్తాడు. 'మీ అక్కా చెల్లెలో ఆపదలో వుంటే సాయం చేయరా!'' చాలా జాలి గొలిపే విధంగా ఉందామె గొంతు, రూపు కూడా.

డ్రైవర్ మొహం చిట్లించి మళ్లీ ఏమనుకొన్నాడో ఏమో 'సరె. ఎక్కు' అన్నాడు.

ఆమె క్యాబిన్ వైపు పోబోతుండగా అటొద్దు, ఇటురా' అంటూ డోర్ తెరిచాడు. ఆమె ఎక్కి అతని పక్కన కూర్చొంది. 'అక్కడంతా మగవాళ్లే ఉన్నారు' అన్నాడు.

ఆమెకు నవ్వు రాబోతె కష్టం మీద అణచుకొంది. దిగులుగా మొహం మళ్లీ మారిపోయింది. హాస్పిటల్‌లో వున్న భర్తని పదె పదే తలచసాగింది.

పది నిమిషాలు గడిచాయి.

కొండల ప్రాంతం. అటూ ఇటూ కొండలు, మధ్యలో సిమెంటు రోడ్డు. మెలికలు తిరుగుతోంది రోడ్డు పాములా.

కొద్ది దూరం వచ్చాక-

సర్కిల్ ఇన్స్పెక్టర్ తల వంచి వెనకొస్తున్న వ్యాన్ కోసం చూశాడు. కళ్లు చిట్లించాడు. ఆశ్చర్యంతో అతని కనుబొమలు వంపు తిరిగాయి.

'డ్రైవర్ జీప్ బ్యాక్ చెయ్యి. వ్యాన్ రావటం లేదు. చూద్దాం' అన్నాడు.

డ్రైవర్ జీప్‌ని వెనక్కి మళ్లించాడు. కొద్దిదూరం వచ్చారు. కనుచూపు మేరలో ఎక్కడా వ్యాన్ జాడేలేదు.

ఇదేమిటి? పది నిముషాల క్రితం ఉన్న వ్యాన్ ఇంతలో ఏమైంది?

అదే సమయానికి మౌంటినీరింగ్ రొప్స్ సాయంతో కొండ దిగిన అగ్ని- జీప్ ఒక్కటే ఆగి వుండటం, జీప్ దిగి నిలబడ్డ పోలీసుల్ని సర్కిల్ ఇన్స్పెక్టర్ని చూసి అక్కడే ఆగి పోయాడు.

ఏం జరిగుంటుందో ఒక్క సెకన్ ఆలోచించాడతడు.

ఆ వ్యాన్‌ను ఎవరో తప్పించేశారు వీళ్ల కళ్లల్లో కారం జల్లి.

ఎవరై ఉంటారూ?

(ఇంకావుంది)

# జీవనరాగం

అలపర్తి రామకృష్ణ

సుమనతో చెప్పకుండా ఆఫీసుకు వొచ్చేసేడు కార్తీక్.

అతని మనస్సంతా చికాకుగా వుండిపోయింది.

ఉదయం నిద్ర లేవగానే టూత్‌బ్రష్, పేస్టు పట్టుకు రమ్మని సుమనని అడిగేడు. అతని మాటలు పట్టించుకోకుండా కాఫీ కలిపే ప్రయత్నంలో వుండి పోయిందామె. ఆ చిన్ని విష యానికే కోపం వొచ్చేసింది కార్తీక్‌కు. రుస రుసలాడుతూ ఆఫీసుకు వొచ్చేసేడు.

ఆఫీసుకు రాగానే వో దుర్వార్త చెవిలో పడింది.

భరణి భార్య పల్లవి ఆత్మహత్య చేసుకుందట.

ఆఫీసు వాళ్ళంతా ఆఫీసు వ్యాన్‌లో భరణి యింటికి బయల్దేరేరు.

పల్లవి అందంగా వుండదు. కట్నంకు ఆశపడి ఆమె మెడలో ఉరి త్రాడు కట్టాడు భరణి.

డబ్బు కట్టలు చూసుకుని పల్లవి అందంగా లేకపోయినా రాజీపడదా మనుకున్నాడు భరణి. అతని మనస్సు పూర్తిగా ఎదురు తిరిగింది. కుష్టువ్యాధి సోకిన మనస్సును శుభ్రపరుకో లేక పోయేడు. శరీరానికి వొచ్చిన కుష్టువ్యాధి ప్రమాదకరమైనదేం కాదు. ఆరు నెలలు మందులు వాడితే తగ్గిపోతుంది. మనస్సుకు పట్టిన కుష్టువ్యాధి మహాభయంకరమైనది.

కుళ్ళు ఆలోచనలతో సతమతమయ్యే వారికి ఆ వ్యాధి తప్పకుండా వొస్తుంది. పైకి బంగారంలా కన్పించినా చాలా ప్రమాదకరమైన వాళ్ళు మనస్సుకు కుష్టువ్యాధి పట్టించుకున్న మను ష్యులు. శారీరకంగా కుష్టువ్యాధి వొచ్చిన వాళ్ళని మనలో కలుపుకున్నా ఆ వ్యాధి మనకు సోకదు గాని, మానసికంగా కుష్టువ్యాధి వున్న వాళ్ళతో మెసిలితే ఆ లక్షణాలు పక్కవాళ్ళకు కూడా సోకు తాయి.

భరణి అంత దుర్మార్గుడా?

భార్య ఆత్మహత్య చేసుకునే పరిస్థితి



కల్పించిన వాడు మంచివాడెలా అవుతాడు?

భరణి యింటి ముందు జనం మూగేరు.

నల్లగా కాలిపోయి మసిబొగ్గులా మారింది పల్లవి శవం.

"అన్నయ్యా! టీ తీసుకోండి!" అంటూ టీ కప్పుతో సహా వొచ్చి తనను పలుకరించే పల్లవిని ఆ స్థితిలో చూసేసరికి కార్తీక్ కళ్ళల్లో నీళ్ళు తిరిగేయి. భార్యాభర్తల మధ్య మనస్పర్థలు కార్తీక్‌కు తెలుసు.

నాలుగైదేళ్ళు పోతే వాళ్ళే సర్దుకుపోతారులే ననుకున్నాడు గాని పల్లవి ఆత్మహత్యకి పాల్పడుతుందనుకోలేదు కార్తీక్.

ఆ అమాయకురాలు చనిపోవడానికి ముమ్మాటికి కారణం భరణి ప్రవర్తనేనని నిర్ణయానికి వొచ్చేసేడు కార్తీక్. మిత్రులందరూ మంచివాళ్ళు వుండరని, చెడ్డవాళ్ళు కూడా వుంటారని, ఆ చెడ్డవారి ప్రభావం తన మీద పడకుండా చూసుకోవాలనుకున్నాడతను.

అప్పుడే సుమన గుర్తుకు వొచ్చింది.

ఆఫీసుకు వొచ్చే ముందు సుమనతో చెప్పకుండా, అన్నం తినకుండా వొచ్చెయ్యడం గుర్తుకు వొచ్చింది.

శ్మశానానికి పల్లవిని తీసుకువెళ్ళే వరకు వుండి యింటికి తిరిగి వొచ్చేశాడు కార్తీక్.

# జీవన రాగం

* * * *

"ఉదయం నేను స్నానం చేస్తుంటే చెప్పా పెట్టకుండా భోజనం చేయకుండా వెళ్ళారెందుకు?"

ఇంటికి రాగానే కార్తీక్‌ను అడిగింది సుమన.

ఆమెతో మాట్లాడకుండా బట్టలు మార్చుకుని మంచం మీద బోర్లా పడుకున్నాడు.

"భోజనంచేశారా? వడ్డించమంటారా?"

"నువ్వు భోజనం చేశావా?" ఆమె వైపు తలెత్తి చూడకుండానే అడిగేడు.

ఆమె మాట్లాడలేదు.

ఉదయం కాఫీ త్రాగేటప్పుడు జరిగిన సంభాషణ గుర్తుకు వొచ్చింది.

"రేపు మా వూరు వెళ్ళి వొస్తాను" అంది సుమన.

"క్రిందటి నెలలో వెళ్ళివొచ్చావు కదా!"

"రాత్రి మా అమ్మ కల్లో కొచ్చింది... మా అమ్మను చూడాలని వుంది"

"నువ్వు మీ వూరు వెళ్ళితే నువ్వు నా కల్లో కొస్తావ్... నేను మీ వూరు పరుగెత్తుకు రావాలి"

"ఇద్దరం చక్కగా కలిసి వెళ్దామండి" అంది కార్తీక్ చెంపలు గోముగా నిమురుతూ.

"నాకొచ్చే జీతం నీ ప్రయాణ ఖర్చులకే చాలడం లేదు. చీటికి మాటికి వూళ్ళు పట్టుకుని తిరుగుతుంటే నా ఉద్యోగం వూడిపోతుంది."

అతని మాటలకు ఆమె నొచ్చుకుంది.

మూతి బిగించుకుని వంటింట్లోకి దూరింది.

ఆమె మనస్సు గాయపర్చాలని అనలేదు అతడు. ఆమెను ఉడికించడానికి అన్నాడతను. ఆమెను వొక్కరోజు కూడ వొదిలి వుండలేని స్థితి అతనిది.

సాయంత్రం వరకు మాటా మంతీ లేకుండానే గడిపారిద్దరూ.

కార్తీక్ మెదడులో భరణి, పల్లవిల గుర్చిన ఆలోచనలే మెదలుతున్నాయి.

పల్లవి ఎందుకంత తొందర పడింది?, కొంతకాలం భరణికి దూరంగా వుంటే అతనిలో మార్పు వొచ్చేదేమో! ఆత్మహత్యకు పాల్పడే బదులు విడాకులు యిచ్చినట్లయితే సరిపోయేదిగదా!...

మళ్ళీ కట్నం యిచ్చే పని లేకుండా రెండో కూతురిని భరణికి కట్టబెట్టాలని అతని మామ ప్రయత్నిస్తున్నాడా?

మొదటి భార్య ఎందుకు చనిపోయిందో విచారించకుండానే తమ ఆడపిల్లల్ని భరణికి యిచ్చి పెళ్ళి చెయ్యాలని అతని బంధువులు ఆలోచిస్తున్నారా?

పల్లవి అడ్డు తొలిగి పోయిందని భరణి





## జూహీ కలలు

"ఖయామత్‌సే ఖయామత్ తక్" చిత్రం తర్వాత వచ్చిన మూడు చిత్రాలు జూహీ చావ్లాకు అంత మంచి పేరు తెచ్చి పెట్టలేక పోయాయి. ఇప్పుడు కీర్తికుమార్ నిర్మించిన "రాధా కా సంగమ్" చిత్రం గురించి కలలు కంటోంది. ఈ చిత్రంలో రాధ పాత్రకు తన జీవితానికి దగ్గర సంబంధం వుందని ఈ పాత్ర పోషణకు ఒప్పుకుందట. ఈ చిత్రం విజయవంత మవుతే తనకిక ఎదురు లేదని కూడా భావిస్తోంది జూహీ. జూహీ తమ చిత్రానికి హీరోయిన్‌గా దొరకటం అదృష్టం అని అంటున్నాడు కీర్తికుమార్. ఈ చిత్రంతో జూహీ పెద్ద నటి కాగలదని గోవింద నొక్కి వక్కాణిస్తున్నాడు. మరి జూహీ మీద ఆ మోజెంటో అంతుచిక్కటంలేదు.



లోలోపల సంతోషపడుతున్నాడా?

హాల్లో వో పక్కకు భరణిని తీసుకెళ్ళి తను చెప్పినట్టు రెండో పెళ్లిలును పెళ్ళి చేసుకోక పోతే డౌరీ డెత్ కేసు పెట్టి, ఉద్యోగం వూడగొట్టి జైల్లో తోయిస్తానని అతని బావమ్మరిది బెదిరిస్తున్నాడా?

ఎవరి ఆలోచనలు ఎలా వున్నా పల్లవి బ్రతుకు ఖూడిదయ్యింది. కార్తీకకు టీ తెచ్చి యిచ్చింది సుమన.

ఔట్ను చేయకుండా తాగేశాడు.

మళ్ళీ వంట పనిలో మునిగి పోయింది సుమన.

రాత్రి భోజనాలయ్యాక పక్క మీదకు చేరారు.

ఆమె నడుం మీద చెయ్యి వేయబోయే డతను.

అతనికి దూరంగా జరిగింది వారపత్రిక తిరగేస్తూనే.

"మావూరు రేపు వెళతాను" అంది వున్నట్టుండి.

"ఇప్పుడొద్దు... నా మాట విను... వచ్చే నెలలో వెళ్ళువుగాని" అన్నాడు అనునయంగా.

విసురుగా పక్కమీదనుంచి లేచి చేతిలోని పత్రిక డ్రస్సింగ్ టేబిల్‌మీద గిరాటేసి బాత్‌రూమ్ కేసి నడిచింది.

మళ్ళీ ఆలోచనలలో మునిగి పోయేడు కార్తీక్.

ఆలోచనల నుండి తేరుకునే సరికి అరగంట పట్టింది.

ప్రక్కన సుమన లేకపోవడంతో వులిక్కి పడ్డాడు.

ఇంత సేపు బాత్‌రూమ్‌లో సుమన ఏం చేస్తున్నట్టు?

పల్లవిలా కొంపదీసి ఏ అఘాయిత్యానికైనా పాల్పడలేదుకదా?

అతని గుండెలు వేగంగా కొట్టుకున్నాయి.

వొంటినిండా చెమటలు పట్టాయి.

తడబడే అడుగులతో పెరట్లోవున్న బాత్‌రూమ్ కేసి నడిచేడు.

"సోనీ... సోనీ" కంగారుగా పిలుస్తూ బాత్‌రూమ్ తలుపు తట్టాడు.

మరోక్షణం దొర్లిపోకముందే బాత్ రూమ్ తలుపు తెరుచుకుంది.

"ఇంతసేపా... మీ రొస్తారని అరగంట నుంచీ ఎదురుచూస్తూ బాత్‌రూమ్‌లోనే కూర్చున్నాను... ఇక్కడ దోమలు కుట్టి చస్తుంటే మీరేమో రాకపోతిరి... మొండిగా ఇక్కడే కూర్చున్నాను" అంది నవ్వుతూ.

కార్తీక్ మనస్సు కుదుట పడింది.

ఆమెను గట్టిగా గుండెలకు అదుము కున్నాడు.

"సోనీ ఇలాంటి పిచ్చి పనులతో నన్ను పరీక్షించకు. ఆ వూహే భరించలేను. నువ్వు లేకుండా నేను వొక్క క్షణం బతకలేను."

"అయితే నన్ను రేపు వూరికి పంపుతున్నారుగా!" అంది గోముగా అతని జుట్టు నిమురుతూ.

"నిన్ను వొంటరిగా పంపడం లేదు నేనూ నీతో నే వొస్తున్నాను"

ఎగిరి గంతేసింది సుమన.

"అర్జంటుగా నాకో తియ్యటి ముద్దు యిచ్చెయ్యండి" అంది సుమన చిలిపిగా.

"ఇక్కడకాదు లోపలికి వెళ్దాం పద" ఆమె నడుం చుట్టూ చేయి వేసి లోపలకు తీసుకెళ్ళాడు అపశ్రుతి లేకుండా జీవన రాగం పల్కించడానికి.






అడ్వొకేట్: **బి.భాస్కరరావు** ఎం.ఎ.,ఎల్.ఎల్.బి.

**కంటు లక్ష్మయ్య, కావలి.**

ప్రశ్న: నాకు స్వంత యింటిలో రెండు కరెంట్ మీటర్లు కలవు. ఎస్.సి. 2355 మా ఇంటిలో ఉన్న గ్రైండింగ్ మిషన్ కొరకు వ్యాపారమునకు తీసుకున్నాము. ఎస్.సి. 5043 మీటరు ఇంటి ఉపయోగముకొరకు వాడుతున్నాము. 9-11-89 తేదిన పెద్ద గాలివానకు ఎస్.సి. 2355 కనెక్షన్ పోలునుండి తెగిపోయినది. గ్రైండర్ తడిసిపోనందున అమ్మివేశాను. ఈ విషయము 7-12-89 తేదిన ఎలక్ట్రిసిటీ అసిస్టెంట్ ఇంజనీర్‌కు పోస్టులో తెలియపర్చాను. అప్పటి నుండి మీటరు ఛార్జీ కట్టలేదు. ఎలక్ట్రిసిటీ డిపార్ట్‌మెంట్ వారు ఇప్పటి వరకు వచ్చి చూడలేదు. అయితే మినిమమ్ ఛార్జీ కట్టవలెనని వత్తిడి చేయుచున్నారు. దీనికి ఏదైనా కోర్టుకు పోవుటకు వీలున్నదా? దయచేసి తెలుపవలెను.

**జవాబు:** మీరు ఎ.పి.ఎస్.ఇ.బి. సూపరింటెండింగ్ ఇంజనీర్‌కు, ఎగ్జిక్యూటివ్ ఇంజనీర్‌కు రిజిష్టర్డ్ పోస్టులో మీ గ్రైండర్ అమ్మివేసినట్లు తెలియపర్చండి. మీరు అమ్మివేసినట్లు, మీ దగ్గర కొన్నట్లు పత్రాలు కాపీలు జతచేసి పంపండి. వారు తదుపరి చర్యతీసుకుంటారు. ఎలక్ట్రిసిటీ డిపార్ట్‌మెంట్‌వారు మీకు మీటరు ఛార్జీ కట్టమని నోటీసు పంపినట్లయితే నెల్లూరులోని జిల్లా ఫోరమ్‌లో పిటిషన్ పెట్టుకొనండి. వినియోగదారుని రక్షణ (1986) చట్టము (కన్స్యూమర్ ప్రొటెక్షన్ ఏక్ట్) క్రింద జిల్లా జడ్జి అధ్యక్షత క్రింద ఈ డిస్ట్రిక్ట్ ఫోరమ్ విచారణ చేసి వెంటనే తీర్పు ఇస్తుంది.

**భోగరాజు సుబ్బారావు, తేతలి (పశ్చిమ గోదావరి జిల్లా)**

ప్రశ్న: మా స్నేహితుడి మరదలు ఒక మగ బిడ్డను కని మరణించినది. ఆ బాలుని నా స్నేహితుడు పెంచుతున్నాడు. ఆ బాలుని వయస్సు ఒక సంవత్సరము. ఆ బాలుని తండ్రి మరియొక వివాహము చేసుకొన్నాడు. తన కొడుకును ఇచ్చి వెయ్యమని అడుగుతున్నాడు. ఒక సంవత్సరం వరకు కొడుకుని చూడని తండ్రికి బాలుని ఇచ్చి వెయ్యడమా? న్యాయశాస్త్రము ఏమని చెప్తున్నది. తెలియజేయ ప్రార్థన.

జవాబు: తల్లి మరణించినది గనుక కొడుకు యొక్క సంరక్షణ భారము తండ్రిదే. ఆ బాలుని తండ్రికి ఇచ్చి వెయ్యక తప్పదు. ఈ విషయంలో ఒరిస్సా హైకోర్టు తీర్పు ఇచ్చింది. ఆ వివరాలు ఇవి:

ఒరిస్సాలోని సంబల్‌పూర్‌లోని యుధిష్టర్‌కు, దాలింబకు వివాహమైనది. వారికి కుమారుడు జన్మించాడు. పిల్లవాని వయస్సు $1\frac{1}{2}$ సంవత్సరాలు ఉండగా, తల్లి మానసిక వ్యాధితో బాధపడుతున్నందు వలన 1988లో బుర్లాలోని హాస్పిటల్‌లో చేర్పించారు. కుమారుని తీసుకొని యుధిష్టర్ తన గ్రామం వెళ్ళిపోయాడు. తర్వాత దాలింబ భర్త దగ్గరకు వెళ్ళి కొన్నాళ్ళు వున్నది. ఒక రాత్రి ఆమెను ఇంటి నుండి గెంటివేశారు. కొడుకును ఆమెకు ఇవ్వలేదు. ఆమెను తండ్రి తీసుకొని వెళ్ళిపోయాడు. కొడుకుని ఇవ్వవలసినదిగా ఆమె సంబల్‌పూర్‌లోని సబ్ డివిజనల్ మేజిస్ట్రేట్ కోర్టులో పిటిషన్ పెట్టుకొన్నది. క్రిమినల్ ప్రొసీజర్ కోడ్‌లోని 97 సెక్షన్ క్రింద మేజిస్ట్రేట్ సెర్చివారెంట్ జారీ చేశాడు. ఆ ఉత్తర్వుల మీద యుధిష్టర్ ఒరిస్సా హైకోర్టుకు రివిజన్ పిటిషన్ పెట్టుకున్నాడు. ఒరిస్సా హైకోర్టు 1989 లో తీర్పు చెప్తూ హిందూ మైనారిటీ మరియు గార్డియన్ షిప్ (1956) చట్టములోని సెక్షన్ 6 ప్రకారము మైనర్ బాలుడు 5 సంవత్సరముల లోపల తల్లి సంరక్షణ క్రింద వుండాలని, 5 సంవత్సరాలు దాటిన తర్వాత తండ్రి గార్డియన్ అవుతాడని నిర్దేశించినట్లు పేర్కొన్నది. ఈ కేసులో తల్లి మానసిక వ్యాధితో బాధపడుతున్నది గనుక సెక్షన్ 6 ప్రకారం తల్లి సంరక్షణ క్రింద వుంచడానికి వీలులేదు. ఈ కేసులో నేచురల్ గార్డియన్ తండ్రి అవుతాడు. కనుక తండ్రి దగ్గర కుమారుడు ఉండటం నేరము కాదని హైకోర్టు తీర్పు చెప్తూ తండ్రి పెట్టుకున్న పిటిషన్ అనుమతించింది. క్రింది కోర్టు ఆదేశాలు కొట్టివేసింది.

కాబట్టి తండ్రి సంరక్షణ క్రింద కొడుకు వుండాలని చట్టములో నిర్దేశించబడినది.

ఆంధ్రసచిత్ర వారపత్రిక

న్యాయ చట్టం-ప్రశ్నలు జవాబులు

ప్రశ్న:

పేరు: ..................................................

పూర్తి చిరునామా:

..................................................

ఈ బొట్టులోని
సుగంధ పరిమళ దైవత్వాన్ని
చూడగలుగుతున్నారా?





ఐటెక్స
దివ్యా
కుంకుం

దైవీక సుగంధ పరిమళాన్ని గుభాళింపుతోంది - దివ్యా!
లక్షలక్ష భారతీయ నారీమణుల నమ్మకాన్ని
ఆకట్టుకొన్న కుంకుం మీ అభిరుచికి తగిన
రంగులలోనూ, మీరు ఆశించే వెల్‌వెట్
తళుకుబెళుకులతోనూ దొరుకుతోంది
మీ కోమలమైన చర్మానికి అనువైనది,
సంపూర్ణంగా సురక్షితమైనది — దివ్యా!

**ఐటెక్స** — 50 ఏళ్ళకు పైగా
మీ విశ్వాసానికి మహత్తరమైన చిహ్నం



అరవింద్ లాబరేటరీస్, మద్రాసు 600 033

Imageads 3090 Tel

ఇద్దరం కబుర్లలో పడ్డాము ఇంతలో స్టేజ్ దగ్గరనుంచి ఒక ఆడగొంతు విని పించేసరికి అటు చూశాను ఆమె పాడే పాట వినేసరికి ఆశ్చర్యపోవడం నావంతు అయ్యింది ఆమె ఓ అన్నమయ్య కీర్తన పాడుతోంది ముఖ్యంగా ఆమె గొంతులో ఉన్న మాధుర్యం నన్ను ముగ్ధుణ్ణిచేసింది ఎవరో అనుభవమున్న శాస్త్రీయ విద్వాం సురాలు పాడుతున్న అనుభూతి కలిగింది అప్పటిదాకా ఇలాంటి ప్రదేశాల్లో పాటలు పాడే వాళ్లమీద నాకు చాలా చిన్నచూపు ఉంది మత్తులో ఉన్న కష్టమర్లని రెచ్చ గొట్టే చవక'బారు' పాటలు పాడతారనీ, ఇలా ఏవో దురభిప్రాయాలు అలాంటిది ఈమె పాట వింటుంటే నా అపోహలన్నీ తుడిచిపెట్టుకుపోతున్నాయి ఇదే కనుక రికార్డు చేసి శోభారాజ్ పాట అంటే నిస్సందేహంగా నమ్ముతారు అంతటి మాధుర్యం ఉంది ఆమె గొంతులో

చుట్టూ చూశాను చాలా మంది మత్తులో జోగుతున్నారు సంతోషాన్ని సెలబ్రేట్ చేసుకోవడానికీ, బాధని మర్చి పోవడానికీ రెండిటికీ 'మందే' మందు అయింది ఈ నవీన ప్రపంచంలో

ఇటువంటి చోటా ఈమె అన్నమయ్య కీర్తన పాడుతోంది? ఏ ఇళయరాజానో, మహదేవనో ఈమె పాట వింటే ఒక అద్భుతగాయనిగా తీర్చిదిద్దగలరనిపిస్తోంది

'ఏమిట్రా ఉలుకూ పలుకూ లేదు? ఎవ రైనా తెలిసిన వాళ్ళు కనబడ్డారా ఏమిటీ కొంపదీసి? నవ్వుతూ అడిగాడు సూర్యం

నేనేమి ఆలోచిస్తున్నానో వాడితో ఎలా చెప్పను? చెప్తే ఫూల్ అని తిడతాడు అందుకే ఓ చిరునవ్వు నవ్వి ఊరుకు న్నాను కొన్ని కొన్ని ఆలోచనలు అనవ సరమైన వారిదగ్గర చర్చిస్తే వాటి విలువ తగ్గడమే కాకుండా మనమీద విమర్శలు కూడా వస్తాయి ఈమె ఇక్కడ ఎందుకు పాడుతోందో? ఏ దుర్భర దారిద్ర్యమో, లేక అంతకంటే అలవికాని పరిస్థితులో ఆమె లోని అద్భుతగాన కళని ఇలా అడవికాచిన వెన్నెల చేస్తున్నాయో? అనుకున్నాను

ఇంతలో ఎవరో ఆమె దగ్గరకు వెళ్ళి అయిదు రూపాయలు ఇచ్చారు ఆమె అతనికి కృతజ్ఞతలు చెప్పి మళ్లీ పాట కొనసాగించింది

అప్పుడు కలిగింది నాలో చైతన్యం అంతవరకూ ఆమెమీద సానుభూతి తప్ప ఏం చేయగలిగాను నేను? ఏ ఇళయరా జాయో ఆమెను పైకి తీసుకొస్తే బావుణ్ణను కుంటున్నాను గానీ నాకు చేతనైనంతలో నేనేమి చేశాను? వెంటనే లేచాను చేయి కడుక్కుని జేబులో చూశాను యాభైరూ పాయల కాగితం ఉంది బయటకి తీసి తిన్నగా స్టేజీ దగ్గరకు వెళ్ళాను ఆమె చేతిలో పెట్టి రెండు చేతులూ జోడించి మనస్ఫూర్తిగా అన్నాను

"మీలోని అద్భుతమైన విద్వత్తుకి ఈ చిన్న బహుమతి దయచేసి స్వీకరిం చండి"

ఆమె సంభ్రమంగా చూసింది నావైపు

ముందు టేబిల్ దగ్గరున్న వ్యక్తి ఆశ్చ ర్యంగా నావైపు చూసి ప్రక్కనున్నతనితో అంటున్నాడు

"డోసు ఎక్కువైనట్టుందిరోయ్ గురు డికి"

నాకు కోపం రాలేదు సరికదా నవ్వొ చ్చింది అందులో అతని తప్పేముంది అతను అలవాటుపడిన వాతావరణం అటు వంటిది ఈరోజు ఇక్కడికి రావడం వల్ల ఎంత మంచి జరిగింది! పొట్టకూటి కోసం ఇలాంటి చోట్ల పాటలు పాడేవా ళ్ళమీద నాకున్న దురభిప్రాయాలు సమూ లంగా తుడిచిపెట్టుకు పోయాయి పైగా ఒక కళాకారిణికి నాకు చేతనైన సహాయం చేయగల అవకాశం దొరికింది

అన్నింటికంటే ముఖ్యమైనది

ఒక బార్‌లో అంత మంది ముందు నడిచి వెళ్ళి ఆమెకి బహుమతి ఇస్తున్నప్పుడు ఎవరైనా చూస్తారేమోనన్న భయాన్ని నేను పూర్తిగా జయించాను ●



# సినిమా..సినిమా..

"రైతు రాజ్యం"

"కృష్ణ సరసన శాంతిలత, సారిక తొలిసారి నాయికలుగా నటిస్తున్నారు. ఎస్. పి. కోదండపాణి ఏకైక పుత్రుడు ఈశ్వర్‌ను సంగీత దర్శకుడుగా, వి. ప్రభాకర్‌ను ఛాయాగ్రాహకుడుగా పరిచయం చేస్తున్నాం" అన్నారు పి. చంద్రశేఖరరెడ్డి. ఈయన కథ, దర్శకత్వంలో శ్రీ అరవింద్ ఆర్ట్ క్రియేషన్స్ చక్కా సత్యనారాయణ నిర్మించే "రైతు రాజ్యం" చిత్రంలో పి. యల్. నారాయణ, బాబూమోహన్, జి. నిర్మల అదిగాగలవారు పాల్గొంటున్నారు. సత్యానంద్ సంభాషణలు, జాలాది గీతాలు, శ్రీను నృత్యాలు, ఎస్. ఆర్. పాటి శిల్పం, చంద్రమోహన్ సహకార దర్శకత్వం, ఘూర్తి ప్రొడక్షన్‌తో ఎస్. పి. వెంకన్నబాబు నిర్మాణ సారథ్యం వహించే ఈ చిత్రానికి ఐలా శ్రీనివాసరావు నిడదవోలు విష్ణువర్ధన్ సహ నిర్మాతలు.

"దాదర్ ఎక్స్‌ప్రెస్"

"ఆగస్ట్ 12న మద్రాసు నుంచి బొంబాయి వెళ్ళే దాదర్ ఎక్స్ ప్రెస్‌లో ముగ్గురు యువతులపై ఎనిమిది మంది పాశవికంగా ప్రవర్తించిన వార్తను పత్రికల్లో చాలామంది చూసే ఉంటారు. ఒక నిజాయితీగల సి.బి. ఐ. ఆఫీసర్ ఈ కేసును ఎలా పరిష్కరించాడన్నది ప్రధాన ఇతివృత్తం. అక్టోబర్ మొదటి వారంలో విడుదల చేయాలని మా ప్రయత్నం. నాగేంద్రబాబు సి. బి. ఐ. ఆఫీసర్‌గా అమోఘంగా నటిస్తున్నాడు" అన్నారు జి. సత్యమూర్తి. ఈయన కథ, స్క్రీన్‌ప్లే, మాటలు, పాటలు, దర్శకత్వంలో కె. వెంకటేశ్వరరావు నిర్మించే "దాదర్ ఎక్స్‌ప్రెస్" చిత్రంలో కోట శ్రీనివాసరావు, దేవదాస్ కనకాల, ప్రసాద్‌బాబు, బ్రహ్మానందం, సిందూరి ఇతర నట వర్గం. రాజ్-కోటి సంగీతం, కె. సురేష్ ఛాయ, బాలు శిల్పం, రాజు సాహసాలు, డి. వెంకటరత్నం కూర్పుతో బి. సతీష్‌బాబు సమర్పణ.

శారద సమర్పించే చిత్రం

"రాయలసీమలో జరిగిన ఒక యదార్థ సంఘటన ప్రేరణ. ఇద్దరు యువతీ యువకులు ప్రేమించుకున్నారు. ఆ రెండు కుటుంబాల మధ్య చెలరేగిన అలజడులు, సంభవించిన పరిణామాలు ఉత్కంఠ కల్గిస్తాయి. నాయికా నాయకులుగా కొత్తవారిని పరిచయం చేస్తున్నాం" అన్నారు తమ్మారెడ్డి భరద్వాజ. ఈయన దర్శకత్వంలో రాధాకృష్ణ, చలపతిరావు నిర్మించే ఆర్. సి. క్రియేషన్స్ చిత్రంలో ఊర్వశి శారద, మోహన్ బాబు, చలపతిరావు, రాళ్ళపల్లి, రాజేష్, వేలు, నర్రా, కిరణ్, రమాప్రభ, అన్నపూర్ణ పాత్రధారులు. పరుచూరి సోదరుల రచన, వేటూరి పాటలు, విద్యాసాగర్ సంగీతం, కోటేశ్వరరావు ఛాయ, ప్రకాశరావు శిల్పం, కళ, నృత్యాలు, త్యాగరాజన్ సాహసాలు, శ్రీనివాస్ సంయుక్త దర్శకత్వం, జయ ఎగ్జిక్యూటివ్ డైరెక్షన్, మురళి-రామయ్య కూర్పుతో ఈ చిత్రాన్ని సమర్పించే ఊర్వశి శారద "తుణుకు పరిసరాలలో అక్టోబర్ మొదటి






# అఖండ జర్మనీకి జై!

కలిసి వుంటే గలదు సుఖం అనుకున్న తూర్పు, పశ్చిమ జర్మనీలు రెండూ నాలుగు దశాబ్దాల తరువాత అక్టోబర్ 3న కలుసుకుని ఒకే జర్మనీగా సంబరాలు చేసుకున్నాయి స్వతంత్ర భారతదేశం అవతరణకు ముందు భారత్, పాకిస్తాన్‌లుగా మన ఉపఖండం రెండు ముక్కలయినట్లు - ద్వితీయ ప్రపంచ సంగ్రామంలో ఓడిపోయిన జర్మనీని అమెరికా, ఫ్రాన్స్, బ్రిటన్, రష్యాలు నాలుగు ముక్కలుగా పంచుకున్నాయి దరిమిలా రష్యా ముక్క తూర్పు జర్మనీగా కమ్యూనిస్టు రాజ్యమైపోయింది పశ్చిమ దేశాల చేత వున్న ముక్కలు కలిసి పశ్చిమ జర్మనీగా ఏకమైపోయాయి ఒక శరీరంలోని రెండు ఖండాలు అటొకటి యిటొకటి పడిపోయినట్లయింది! - 1945 మే 18న ఓడిపోయిన ముక్కచెక్కలైన "జర్మనీ" 1990 అక్టోబర్ 3 నాటికి ఒక్కటైపోతుందని యిటీవలి కాలం దాకా ఒక్క పొలిటికల్ పండిట్ కూడా వూహించలేకపోయాడు రష్యా - తూర్పు, పశ్చిమ జర్మనీల మధ్య 160 కిలోమీటర్‌ల పొడవునా గోడ కూడా కట్టేసింది - అయితే యిది కేవలం గోడ - జాతిని సంస్కృతినీ వెరు చేయగల శక్తి దీనికి లేదన్నది పోయినేడాది ప్రజలు తిరగబడి దీన్ని ఛిన్నాభిన్నం చెయడంతో యావత్ ప్రపంచం జర్మన్ ఏకీకరణావకాశాల వట్ల - ఆశగా చూసింది ఇష్టంలేని వారు యిష్టంలేనట్లు - యిష్టమున్న వారు యిష్టమున్నట్లు చూసినా జర్మన్‌లు ఏకమైపోయారు ఇవాళ ఒక్కటే జర్మనీ - రష్యాలోనే కమ్యూనిస్టు ప్రాబల్యం కరిగిపోతున్న దశలో తూర్పు జర్మనీని తన ప్రాబల్యం క్రింద వుంచుకోడానికి సోవియట్ యూనియన్ పిచ్చి పిచ్చి ప్రయత్నాలు చేయలేదు కాకపోతే తూర్పు జర్మనీలో వున్న రష్యా సైన్యాలు - తిరిగి పోడానికి అయ్యే ఖర్చు మొత్తం జర్మనీ ప్రజలు భరించాలి మరో 4 సంవత్సరాల కాలం పాటు యీ సైన్యాల ఉపసంహరణ జరుగుతూ వుంటుంది తూర్పు జర్మనీ వాసులు మొదట హంగెరీ, చెకొస్లొవేకియా దేశాల

## వెనుక బురద ముందు బురద

ఇల్లంతా బ్రహ్మాండంగా కట్టి మెట్లకి బదులు నిచ్చెనవేసి ఎక్కమన్నట్లు చేశారు ఆశియాలోనే అతిపెద్దదంటూ పబ్లిసిటీయిచ్చి ముఖ్యమంత్రి చేతిమీదుగా ప్రారంభించిన విజయవాడ బస్‌డిపో- సామాన్య ప్రయాణీకుల పాలిట శాపం అయిపోయింది- దారిలేని బస్‌డిపో నుంచి అర్జంట్‌గా సర్వీస్ మొదలెట్టడమెందుకు? రోడ్లు వేసేదాకా ఆగవచ్చుగా

మీదుగా లక్షల సంఖ్యలో పశ్చిమానికి వలస వెళ్లిపోయారు. పశ్చిమ దేశాల నాగరికత, సంస్కృతి మీద తూర్పు వాసులకున్న మోజు - ఉధృతమై చివరికి బెర్లిన్ గోడ తునాతునకలై పోయింది - ప్రజా ప్రభంజనం భోనభూంతరాళాలను తాకి తూర్పు జర్మనీ నియంత ఎరిక్ హోనేకర్‌ను 'ఉఫ్' మని వూదేసినట్లు గద్దె మీద నుంచి దింపేసింది - తూర్పు జర్మనీ ఏర్పడ్డ తర్వాత మొదటిసారి, ఆఖరిసారి ఎన్నికలు మొన్న మార్చిలో జరిగి - కమ్యూనిస్టులు వోడిపోయారు. క్రిస్టియన్ డెమోక్రాటిక్ పార్టీ జెండా ఎగురవేసి - ఉభయ ప్రజల అభీష్ట సిద్ధికి పూనుకొన్నది - మొదట ఆ "రూపాయిని" యీ "రూపాయిని" ఏకం చేశారు. దాంతో చెలామణీ ఆటంకాలు తొలగిపోయాయి - యిప్పుడు తూర్పు, పశ్చిమాలు ఏకమై ఆవిర్భవించిన కొత్త జర్మనీ దేశం - ప్రపంచ రాజకీయాల్లో, ప్రపంచ వాణిజ్యంలో, ప్రపంచ క్రీడారంగంలో - మరోసారి తన ధాటిని చూపించే అవకాశాలు వచ్చాయి. అయితే ఏకైక జర్మనీ అయిన జర్మనీ దేశంలో రేపు పార్లమెంట్ ఎన్నికలు జరిగిన తరువాత కాని జర్మనీ తన శక్తియుక్తులను కూడకట్టుకుని తిరిగి ప్రపంచ పటంలో ప్రత్యేక స్థానం కోసం ప్రయత్నం చేయలేదు. - కాని ఈపాటికే క్రీడారంగంలో జర్మనీ ధాటి ప్రపంచ దేశాలకు భయభ్రాంతులను కలిగిస్తున్నది - ఉభయ జర్మనీ వాసులకీ కూడా స్వేచ్ఛా ప్రియులందరి అభినందనలు అందుతున్నాయి. ఈసారి క్రిస్‌మస్ - గత నలభై సంవత్సరాల కాలం ఎన్నడూ జరగనంత ఘనంగా అక్కడి ప్రజలు చేసుకుంటారు! - అయితే ఏకీకరణ వేడుకలలో - బాణాసంచా కాల్పులలో కొన్ని అపశ్రుతులు లేకపోలేదు - నూటికి 80 శాతం ముక్తకంఠంతో జాతీయగీతం ఆలాపిస్తూ వున్నా - మైనారిటీ వర్గాలకు చెందిన కొందరు - దాడులు, దొమ్మీలు చేసి బీభత్సకాండ చేశారు. వీరిని కూడా తృప్తిపరచడం మీదనే "హెల్మట్ కోల్" శక్తి సామర్థ్యాలు వెల్లడి అవుతాయి.

## ఏది విశ్వాసం ?

## ఏదవిశ్వాసం ?

దేవీలాల్ నిష్క్రమణ వెనుక ఎంత రాజకీయ విజ్ఞత వున్నదో



అంచనాలు కట్టడం అతని శత్రువులు చేయాల్సిన పని కాని - ఆయన రిజర్వేషన్ల వ్యతిరేకోద్యమం పేరు మీద రాజీనామా చెయ్యడం - సుప్రీంకోర్టు "స్టే" రావడం రెండూ ఒకదాని వెంట ఒకటి జరగటంతో రేపటి ఎన్నికలలో శ్రీ దేవీలాల్‌కే మంచి వూపు లభించే అవకాశాలున్నాయి - శ్రీ వి.పి.సింగ్ పట్ల విశ్వాసం ప్రకటించిన పార్లమెంటరీ పార్టీ - ఆ"విశ్వాసం" ఆదరాబాదరా ఎందుకు ప్రకటించవలసి వచ్చిందో - ఎవ్వరికీ అంతు చిక్కలేదు - జనతాదళ్ లోపల అసమ్మతి వర్గాలున్నాయి అనటానికి యీ విశ్వాస తీర్మానం "ఫార్సు"నే మనం ఉదాహరణగా తీసుకోవచ్చును - వి.పి.సింగ్ మీద విశ్వాసం కేవలం అతని పార్టీ లోపల వుంటేనే చాలదు - కాని అతనే లేకపోతే యివాళ వూగిసలాడుతున్న ఫ్రంట్ గవర్నమెంట్ కుప్పకూలిపోతుంది కనుక ఆరు మాసాలైనా కాకుండా వచ్చిన పదవులు వూడిపోతాయి అంటే అందరికీ దుఃఖమే కనుక వి.పి. సింగ్ గారి మీదనేమిటి? ఆ జాగాలో వున్న ఎవరి మీదనైనా విశ్వాసం ప్రకటిస్తారు. కాని అసలు "విశ్వాసం" సంగతి అక్టోబర్ 30 నాటికిగాని తెలియదు. రిజర్వేషన్ మంటలు తెలిసో తెలియకో రగిలించిన ఫ్రంట్ గవర్నమెంట్ - చివరికి దాన్ని చల్లార్చ లేకపోయింది. ఈ మంటలకి తోడుగా - రామజన్మభూమికి అద్వానీగారి రథయాత్ర సాగుతున్నది. శ్రీ వి.పి.సింగ్ చేసుకున్నది కొంతా, వెలుపల నుంచి రాజీవ్‌గాంధీ, లోపల్నించి వి.పి ప్రతివర్గాల వారు చేస్తున్నది మరింత వుండగా - అదంతా వృత్త భ్రమణనకుంటున్న ప్రధాన మంత్రికి ప్రజలలోను, రాజకీయ వర్గాలలోను కూడా - అవమానం, పరాభవం జరుగుతూనే వున్నాయి. చివరికి పార్లమెంట్‌లో - రాజ్యాంగ సవరణ మీద వోటింగ్ జరుగుతూ వుంటే - ఆ పార్టీ సభ్యులు మొత్తం లోపల లేకుండా పోతే అర్థం? శ్రీ వి.పి. సింగ్ నైతికంగా కూడా బలం పుంజుకోకపోడాన్ని యిది రుజూ చేయలేదా? ప్రధాన మంత్రిగా శ్రీ వి.పి.సింగ్ యీ పరిస్థితుల్లో కేవలం ప్రతిపక్షాల దయాదాక్షిణ్యాల మీద - సోకాల్డ్ మిత్రపక్షాల అవసర మద్దతు మీద తన రాజకీయ మనుగడ సాగిస్తున్నట్లు స్పష్టమైపోయింది - పంజాబ్‌లో రాష్ట్రపతి పాలన పొడిగింపు వ్యవహారంలో ఫ్రంట్ గవర్నమెంట్‌కి జరిగిన శృంగభంగం - వి.పి. సింగ్ మీద అతని అనుయాయులకి విశ్వాసం వున్నదని చెపుతున్నదో? లేక అసమ్మతి వర్గాల ప్రాబల్యాన్ని సూచిస్తున్నదో...?

కేంద్రంలో రాజకీయ పటం యీ రెండు మూడు వారాలలో చిత్రవిచిత్రంగా - వూహాతీతంగా మారిపోవచ్చును - కాంగ్రెస్ (ఐ) పార్టీకి పరిస్థితులు కనీసం తన "పాచికలాట" కొనసాగించటానికైనా అవకాశం యివ్వవచ్చును - పంజాబ్‌లో అందరూ కోరేది రాష్ట్రపతి పాలనే. [ఒక్క అకాలీలు సిఖ్ఖు వర్గాలలో తీవ్రవాదులు తప్ప -] అంచేత రాజ్యాంగం 70వ సారి సవరించబడ్డది కాని మండల్ కమిషన్ "కార్చిచ్చు"కు సంబంధించి సుప్రీంకోర్టు "స్టే" దృష్ట్యా అయినా శ్రీ వి.పి.సింగ్ మళ్లీ అసంబద్ధమైన వ్యాఖ్యలు చేయకుండా వుంటే అదే పదివేలు. దేశంలో తక్షణ శాంతికి యువకులు పూనుకోకపోతే - సంఘ వ్యతిరేకులది రాజ్యమైపోతుంది - ప్రస్తుతం ఆందోళన ఆగాలన్న విషయం అందరూ గ్రహించాలి.

*[4-10-90]*

"అప్పుడే ఫోన్ చేస్తున్నారెవరో? బహుశా హోటల్ డెస్క్‌నుండి అయివుంటుంది." ఫోన్ రిసీవర్ తీసుకుంది.

"రేఖా స్పీకింగ్."

"నానాసాహెబ్ స్పీకింగ్ ఫ్రం ఎ పబ్లిక్ కాల్ ఆఫీస్."

"థాంక్యూసార్."

"ఇందాక ఏదో విషయం అడిగావు."

"అవున్సార్. స్నేహితునితో మాట్లాడాలని ఎంతోదూరంనుండి వచ్చాను."

"అతని స్నేహితులమంటూ యిప్పటికెంతోమంది ఫోన్‌చేసారు. అయితే ఫోన్ చేసిన స్నేహితురాలు మటుకు నువ్వే!"

"సార్ నేను వొకసారివచ్చి మీతో మాట్లాడుతాను."

"నేనూ అదే చెబుదామనుకుంటున్నా."

"థాంక్యూసార్. ఎక్కడ కలుసుకోమంటారు?"

"సాయంత్రం అయిదింటికి సహేలియోంకిబారిలోని రోజ్‌గార్డెన్‌లో కలుద్దాం."

"అలాగేసార్ - థాంక్యూసార్." ఫోన్ పెట్టేసిన శబ్దం వినపడింది రేఖకు.

"వృద్ధుడుగారూ తమ అచూకీకి దగ్గర్లోవున్నా" అనుకుంటూ ఫోన్ పెట్టేసింది రేఖ.

హోటల్ రూం బయట కారిడార్‌లో ఇన్‌డోర్ ప్లాంట్స్‌కుండీల దగ్గర నిలబడి వున్న వ్యక్తి ఆసక్తిగా రేఖ ఫోన్ సంభాషణ వినసాగాడు కిటికీలోంచి ఆమెను గమనిస్తూ.

రేఖ ఉత్సాహంగా గది తలుపు తెరుచుకుని బయటకు రావడం గమనించి కుండీలోని మొక్కలకున్న ఎండుటాకులు తీసివేయసాగాడు - బహు నెమ్మదిగా.

"ఉదయ్‌పూర్‌లో అంతా మన్నుదిన్న పాముల్లావుంటారుగాబోలు. ఇతను గంటన్నరనుండీ యీ పూలచెట్టు కుండీదగ్గరే వున్నాడు" మెట్లవైపుగా నడిచివెళ్తూ అనుకుంది రేఖ.

ప్రకృతి కన్యకు గులాబి పువ్వులతో అలంకరించుకోవాలనే కోర్కె ప్రబలమై భూమిమీద వుండే గులాబిచెట్లనన్నీ తెచ్చిపెంచుకుంటున్నట్లుంది సహేలియోంకిబారి.

విరగబూచిన గులాబీలను అలంకరించుకున్న వనకన్యలా గులాబిచెట్లతో నిండిపోయివున్నదా ప్రదేశం.

ప్రపంచంలోని బాధలు బాధ్యతలు బడలికలు సర్వం పోగొట్టగల శక్తి నా సొంతం అన్నట్లు గులాబీ పరిమళం నిండినగాలి సేదదీర్చుతూ మందగమనంతో ఎదురైంది రేఖకు.

రేఖ కళ్ళు గులాబీతోటలో దూరాన కనపడుతున్న వృద్ధునివైపే కేంద్రీకృతమైవుండడంతో తన వెనుక కొంత దూరంలో వెంబడించివస్తున్న యువకుని గమనించలేకపోయింది.

సన్నగావున్న వృద్ధుడు ఎదురవగానే రేఖ -

"మీరు...."

"అవును నానాసాహెబ్."

"నమస్తే - మీరు నన్ను స్వయంగా కల్సుకున్నందుకు థాంక్స్."

"ఉహూ. ఇక్కడకాదు. నా వెంటరా" నానాసాహెబ్ వెనుక వెళ్ళింది రేఖ.

కృత్రిమ సరోవరం మధ్య జలయంత్రం నీరుచిమ్ముతూన్నది - సరోవరం చప్టా పక్కన సిమెంట్ దిమ్మమీద కూర్చుని "రేఖా - కూర్చో" అన్నాడు. ఆయన కెదురుగా నేలమీద కూర్చుంది రేఖ.



ఏం లేదమ్మా! మొన్న తుఫాన్‌కి లెటర్స్ సరిగా అందుతున్నాయో లేదోనని కొంచెం డౌటు.. అమ్మాయి పెళ్ళి తర్వాత అయిదేళ్ళకు మళ్ళీ జరుగుతున్న వేడుక ఇదేకదా! ఒక్కగానొక్క ఆడపడుచువి .. నువ్వు లేకుంటే ఎలా! అందుకే ఈ పూట రాకపోతే రాత్రికి నేనే బయలుదేరదా మనుకుంటున్నాను." అన్నగారి అభిమానానికి కళ్ళు చెమర్చాయి పావనికి.

నయం! ఎలాగో భర్తను బ్రతిమిలాడ ఈ పూటే రావడం మంచిదయింది అనవసరంగా అన్నయ్య హైరానా పడేవాడు అనుకుంది మనసులో

"మామయ్యా, రాజేష్ రాలేదేమి టత్తయ్యా." అంటున్న రవి తల్లి చాటు నుండి తొంగి తొంగి చూస్తున్న మరదల్ని చూసి "అరే! సరిత కూడా వచ్చిందా! బీరకాయలా ఉండేది పొట్లకాయలా సాగిపోయిందే" అన్నాడు ఆట పట్టిస్తూ.

చటుక్కున అంది సరిత "నువ్వు మాత్రం సొరకాయలా లేవూ" అంటూ పొడవే అయినా బొద్దుగా ఉండడం వల్ల కొంచెం పొట్టి అనిపిస్తాడు రవి.

"తప్పమ్మా! బావని అలా అనకూడదు .." వారిస్తున్న మేనత్తను చూసి చిన్నగా నవ్వాడు రవి "పోన్లే అత్తయ్యా! బావని నన్ను కాకపోతే ఎవర్నంటుంది. నాకుంది ఒక్కటే మరదలు కదా! ఎవర్ని ఏడిపిస్తాను" అన్నాడు తనేమి నొచ్చుకోనట్టు

తన కూతుర్ని చేసుకోవాలని అన్నగారింటిల్లిపాదికి ఉందని తెల్సు. తనకీ ఇష్టమే... కానీ భర్త మనసే తెలియదు. గతానుభవాల దృష్ట్యా సరిగా ఊహ తెలియకుండానే పెళ్ళి చేస్తారో .. లేక చదివించి ఏ పద్దెనిమిది ఇరవైకి చేస్తారో! మొదటిదైతే మాత్రం కష్టమే. పూర్తిగా చదువైపోకుండా, ఏ జాబ్ లేకుండా పెళ్ళి చేయడానికి అన్నయ్య వాళ్ళు ఒప్పుకుంటారా!.... అయినా ఎప్పుడో సంగతి ఇప్పుడెందుకులే.. అప్పటికి ఎలా జరగాల్సుంటే అలా జరుగుతుంది–

మనసుని అదుపులోకి తెచ్చుకొని "జలజేది వదినా" అంది చుట్టూ చూస్తూ. "గదిలో ఉంది వెళ్ళు పావనీ! ఈ లోపల నేను టిఫిన్ సంగతి చూస్తాను" అంటూ వంట గదిలోకి నడిచింది సరస్వతి రవి కూడా బైటికి వెళ్ళడానికి రెడీ అయి "అత్తయ్యా! నేను చదువు కోవడానికి మా ఫ్రెండ్ రూమ్‌కి వెళ్తున్నాను. ఎక్కువ సేపు మాట్లాడ లేదని ఏమనుకోవద్దు" అంటూ వెళ్ళిపోయాడు గబగబ.

గదిలోకి నడిచింది పావని కూతురితో పిల్లాడికి పాలిస్తున్న జలజ మేనత్తను చూసి పలకరింపుగా నవ్వింది కూర్చోమంటూ నడుముకి కట్టు, తలకు గుడ్డ, తాంబూలంతో ఎర్రబారిన పెదవులు, నిండైన చనుకట్టుతో కొంచెం బిగుతుగా ఉన్న జాకెట్టు – ఒక విధమైన మాతృత్వపు అందంతో మెరిసిపోతున్న జలజస్థానంలో ఒక్క క్షణం తన కూతుర్ని ఊహించుకున్న పావని కళ్ళు ఆర్ద్రమయ్యాయి క్షణకాలం వెంటనే తేరుకొని పక్కకు తిరిగి కళ్ళు ఒత్తుకొని కబుర్లు చెప్పసాగింది మేనకోడలితో

మర్నాడు బారసాల అయిపోయి సాయంత్రానికి ఎటుబంధువులు అటు వెళ్ళిపోగానే "అన్నయ్యా! నీతో ముఖ్యమైన విషయం మాట్లాడాలి" అంటూ చుట్టూ చూసింది కూతురక్కడుందేమోనని

ఆది గమనించిన సరస్వతి బైట ఆడుకుంటున్నదని చెప్పడంతో తేలిగ్గా ఊపిరి పీల్చి తన చేతిలో అంతవరకు దాచిన లెటర్‌ని అన్నగారి చేతికిచ్చింది పావని అప్పటికెన్నిసార్లో చదివినట్టుగా కొంచెం నలిగి ఉన్న ఆ లెటర్‌ని చదివేస్తు మడత విప్పిన సారథి కళ్ళు ఆందోళనగా ముడుచుకున్నాయి దానిలోని మేటర్‌కి భర్త వెనుకగా తను కూడా చదివిన సరస్వతి మనసులో విషాదం చోటు చేసుకుంది

"మరి ఇప్పుడేమి చెయ్యాలను కుంటున్నావు?" చెల్లెలిని అడిగాడు అయోమయంగా

"దాన్ని ఎలాగో అక్కడ నుండి తీసుకొచ్చి ఇక్కడ దగ్గర్లో ఏదైనా చిన్నరూమ్ మాట్లాడు. తర్వాత నాకు లెటర్ వ్రాసి వీలు చూసుకొని వస్తాను" అన్నగారి కళ్ళలో సంశయాన్ని నివృత్తి చేస్తున్నట్టుగా "మీ బావగారికి తెలియకుండా నేనెలాగో చూసుకుంటాను. కన్నకూతురు ఆ

## జితేంద్ర పంక్చ్యువాలిటీ



అందరిలా కాకుండా జితేంద్ర నిశ్చితంగా, సమయం తప్పకుండా షూటింగ్‌లకు హాజరవుతాడట. చెప్పిన సమయానికి మేకప్ రూంలో వుండిపోతాడు. షూటింగ్ విరామ సమయంలో భార్యతో బాతాఖానీ కొడుతుంటాడు తప్ప యితరులాగా మరొకరితో చెట్టాపట్టా లేసుకొని తిరగడు. కారణం భార్య కూడా షూటింగ్‌కు వస్తుంది ఇంకొకళ్ళతో తిరగడానికి ఎలా కుదురుతుంది కాని జితేంద్ర మరో అమ్మాయితో తిరుగుతుంటాడని భార్య మాత్రం చెప్పాలంటే సినిమా వాళ్ళకు ఆమాత్రం "స్వేచ్ఛ" తప్పదు కదా!

పాత్రలా మారిపోయాడు "

"మీరు అతనిలో జ్ఞానద్రవం నింపారు!"

"లేదు జ్ఞానపాత్ర నందించాను అతనే పాత్రలోని ద్రవాన్ని తనలోకివం పుకున్నాడు చాలా త్వరితగతిని నేర్చుకున్నాడతను! తాచి బహుత్వరగా నేర్చుకుని అతిక్లిష్టమైన హిగరులో పరిపక్వత సాధించాడు ఎంతో మానసిక పరిణత వుంటేగాని హిగరు సాధ్యంకాదు హిగరు వచ్చిన వ్యక్తికి ఎవరూ హానికల్గించలేరు

కన్నార్పకుండా నిశ్చలంగా గంటల తరబడి బొంటికాలి మీద నిలబడి వుండ గలడతను గాలి అలల కదలిక వింటూ క్షణాలలో మనసును ప్రశాంత పరచుకోగ లడు మనసును ప్రశాంత పరచుకున్నాక అతను అద్భుత విజయాలను అలవోకగా సాధించగలడు.

ఎదురుగా వున్న పుస్తకంలోని పుట లలోని విషయాలను చూచిన క్షణాలలో మనోఫలకంలో గుర్తుంచుకోగలడు "

"ఫొటోగ్రాఫిక్ మెమరీ అన్న మాట!"

"ఉహు- అందరు బయట కనపడే విష యాలను తెలుసుకోవాలనుకుంటే అతను అంతర్ముఖుడై మనసును మధించి రహ స్యాలను తెలుసుకుంటున్నాడు "

"అత్యంత ప్రతిభాశాలి అన్న మాట!"

"ఉహు-ప్రతిభ స్వతస్సిద్ధంగా వచ్చేది రవితేజశక్తి అంతర్మథన జనితం సాధించి తెచ్చుకున్నది

కేవలం మనసు పొరలలోకి దృష్టి నిగుడించి పొందిన అప్రమేయ శక్తి!"

"ఎలా అయితేనేం?! శక్తియుక్తి కల వాడు! "

"రేఖా- రవితేజ ఆపదనుండి తప్పిం చుకోడానికి అజ్ఞాత వాసంలో వున్నా డేమో? సురేష్ బాబు కోసం అతను బయటకు వస్తే ప్రమాదాలెదురవవచ్చు?"

"పాకిస్థాన్ గూఢచారి విభాగం అతన్ని అంతమొందించాలని చూస్తున్నా దనేనా మీ ఉద్దేశం?"

"కనిపించే శత్రువులు కొందరు కన పడని వాళ్ళు ఎందరో?!"

"మనసుంటే మార్గ ముండదా? రవి తేజ మారురూపం దాల్చడంలో సిద్ధహ స్తుడు "

లేదా రవితేజ మరణించాడని ప్రపం చాన్ని నమ్మించగల్గితే ప్రమాదం ఉండదు "

"అన్నీ ఆలోచించే వచ్చావన్న మాట!"

"నన్ను నమ్మండి నానాసాహెబ్ జీ!"

"రేఖా-జబ్బును నయం చెయ్యవచ్చు కాని విధి వ్రాత అనుల్లంఘనీయం " అంటూ లేచి వెళ్ళిపోయాడు నానాసా హెబ్

"ఏం చెయ్యాలో ఏమనాలో తోచక నిలబడి పోయింది అయిదు నిముషాల పాటు

తర్వాత నెమ్మదిగా కదలివెళ్ళింది రేఖ

హోటల్ దగ్గర పూలకుండీలో ఎరు వువేస్తున్న వ్యక్తి కనపడ్డాడు

"పొద్దుటి నుంచీ కష్టపడ్డావు బాబూ" అంది అతనితో రేఖ

సమాధానంగా పళ్ళికిలించా డతను హోటల్ రూములోకి వెళ్ళి తలుపేసు కుంది రేఖ

ఆమెకెందుకనో వచ్చిన పని సఫలమ వుతుందన్న ఆశ కల్గింది

"ఏమిటి నా సూట్ కేస్‌ను ఎవరో కది లించినట్లున్నారే " అనుకుంటూన్న రేఖ కంటికి సూట్ కేస్ పక్కన పేపర్ వెయిట్ కింద ఉంచిన కాగితం కనపడింది

" రాత్రి ఎనిమిదింటికి యీ కాగితం హోటల్ గేట్ బయట వుండే టోపీవాలా కిస్తే అతను గమ్యస్థానానికి తీసుకువస్తాడు" అని రాసి వుంది

* * * *

నానా సాహెబ్ రోజ్‌గార్డెన్ నుండి సరాసరి మైలుదూరాన వున్న మేడదగ్గరకు వెళ్లాడు

పురాతనమైన ఆ మేడను కమల ముఖ నీట్‌గా మెయిన్ టెయిన్ చేస్తూ వుంది

"నమస్తే సాహెబ్ జీ" వంగి నమస్క రించింది కమల

"నమస్తే" అంటూ లోపల గదిలోకి వెళ్లాడు నానాసాహెబ్ కమల సైగచే యగా పద్దెనిమిదేళ్ళ పడుచుపిల్ల అగరుచం దనం కలపినమందార తైలం గిన్నె తీసుకుని లోపలకు వెళ్లింది

గిన్నెలో చమురు చేతిలోకి వంపుకుని వేళ్లకొనలతో నూనె తలలోని వెంట్రుక లకుదుళ్లకు తగిలేలా రాస్తూ మధ్య మధ్య



## రాధికకు మళ్ళీ పెళ్ళి!

చలన చిత్రరంగంలో నటీనటుల పెళ్ళి వ్యవహారాలు భలే చిత్రాతిచిత్రంగా వుంటాయి కొంతమంది చిత్రరంగంలో ని వాళ్లనే పెళ్లి చేసుకోవటం ఆనక వారికి విడాకులిచ్చి ఎంచక్కా యింకొకరిని పెళ్లి చేసుకోవటం మనం చూస్తూనే వుంటాం అదే కోవలోకి వస్తుంది రాదిక ఆమె యిటీవల లండన్‌కు చెందిన ప్రముఖ పారిశ్రామికవేత్త రిచర్డ్సను శ్రీలంకలో వివాహమాడింది అత్యంత రహస్యంగా జరిగిన ఈ వివాహ విషయాన్ని రాధికే స్వయంగా తెలియజేసిందట ఇది ఆమె చేసుకున్న రెండవ వివాహం అంతకుముందు ప్రముఖ నటుడు, దర్శకుడు ప్రతాప్ పోతన్‌ను వివాహమాడి ఆయనకు విడాకులిచ్చిన విషయం తెలిసిందే

వైపరీత్యం రాసేలా చేస్తున్నది ఇన్నాళ్ళ నుంచి నాన్న పెట్టే శాపనార్థాలే నాకు తగిలినట్టున్నాయి ఇన్నాళ్ళకు సురేష్‌కి పర్మినెంట్ జాబ్ దొరికిందని ఆనందంతో గుడికి వెళ్ళి అర్చన చేయించి వస్తూ్తండగా ఆటో యాక్సిడెంట్లో అత్తయ్య, సురేష్ అక్కడికక్కడే కన్నుమూశారు నేను మాత్రం కొద్దిపాటి గాయాలతో బైటపడ్డాను వాళ్ళతోనే నా జీవితాన్ని చాలించుదామనుకున్నా. కానీ నా కడుపులో పెరుగుతున్న ఆయన ప్రతిబింబాన్ని తుంచే అధికారం నాకు లేదనిపించి, మొండి ధైర్యంతో ఇంట్లో వున్న చిన్న చిన్న వస్తువులు అమ్ముతూ ఇన్ని రోజులు కాలం గడిపాను ప్రస్తుతం నాకు ఏడో నెల అయినవాళ్ళు ఎవరూ లేకుండా ఈ పురుడు ఎలా గడుస్తుందో అని నాకు భయంగా ఉంది ప్రసవం స్త్రీకి మరో జన్మ అంటారు నాకేమైనా అయితే నా బిడ్డ అనాథ కాకూడదు అందుకే అభిమానాన్ని చంపుకొని లెటర్ వ్రాస్తున్నాను ఒక్కసారి వస్తావు కదూ! నే చేసింది తప్పయితే నాన్నని క్షమించమని చెప్పమ్మా! అసహ్యించుకొవద్దని చెప్తావు కదూ! అమ్మా! నాన్న మనస్ఫూర్తిగా దీవించి పంపితే ఈ అనర్థం జరిగి ఉండేది కాదేమో అనిపిస్తుంటుంది ఒక్కోసారి నన్ను ఆదరిస్తారా నాన్న!''

కూతురి గురించిన ఆలోచనలతో మనసంతా చేదు తిన్నట్టయ్యింది పావనికి ఒక్కసారిగా వృద్ధాప్యం మన శరీరాలను ఆవహించినట్లనిపించింది

అన్యమనస్కంగా పులుసు బదులు మజ్జిగ పోస్తున్న భార్యను చూసి భానుమూర్తి కనుబొమ్మలు ప్రశ్నార్థకంగా ముడిపడ్డాయి తను చేసిన పనికి కంగారుపడిన పావని "బాగా తలనొప్పిగా ఉంది పొరపాటున " అతని చూపులను ఎదుర్కోలేనట్టు చప్పున తల వాల్చుకుంది

"నెప్పిగా ఉంటే ఏదో రాసుకోవాలిగానీ ఇలా నా ఎదురుగా ఏదో కొంపలు మునిగిపోయినట్టు నీరసంగా ముఖం వేలాడేసుకొని కూర్చుంటే తగ్గుతుందా?''

ఆర్ద్రత ఏమాత్రం లేని ఆ మాటలు ఈ శరపై రెండేళ్ళ నుంచి కొత్తకాదామెకు అది ఆయన తత్వంలే అని ఎంత సరిపెట్టుకున్నా అప్పుడప్పుడు మనసు చివుక్కుమనక మానదు ఆయన సరిగుంటే తనతోనే ఈ బాధను పంచుకొని కొంచెం ఊరడిల్లేది!

ఆ రాత్రి ఎంతసేపటికి నిద్ర పట్టలేదు పావనికి గత స్మృతులు వెల్లువలా ముంచెత్తాయి

* * * * * *

భానుమూర్తి చిన్నప్పటి నుంచి తన పిల్లల విషయంలో (మగపిల్లాడిని తప్ప) చాలా స్ట్రిక్ట్‌గా ఉండేవాడు అవసరమైనంత వరకే తప్పితే భార్యతో కూడా మనసు విప్పి మాట్లాడేవాడు కాదు బైట సర్కిల్‌లో 'మంచి కలుపుగోరు మనిషని' పేరున్న అతనిలో ఈ ద్వంద్వ ప్రవృత్తికి కారణం లేకపోలేదు

అతనికి 12 సం వయసులో టెన్త్ చదువుతున్న అతని అక్క తనకు ట్యూషన్ చెప్పే మాస్టర్‌ని పెళ్ళి చేసుకొని వెళ్ళి (లేచి) పోవడం పరువు, ప్రతిష్టలకు ప్రాణం పెట్టే కుటుంబంలో జన్మించిన అతని లేత మనసులో ఒక గా(ఢమూ)ఢ నమ్మకాన్ని మొలకెత్తించింది

ఆడవాళ్ళకు చనువిస్తే నెత్తికెక్కుతారని, చదువుసంధ్యలు వాళ్ళల్లో స్వతంత్ర భావాల్ని రెచ్చగొడుతుందని పెద్దగా చదువుకోని పావనిని చేసుకోనడమే కాదు, ఆమెను అల్లంత దూరంలోనే ఉంచాడు

నిజానికి పావని టెన్త్ పాసయింది చదువు పట్ల అతనికున్న అయిష్టతను మధ్యవర్తుల ద్వారా తెలుసుకున్న ఆమె తండ్రి ఆ వంకతో వచ్చిన సంబంధాన్ని చేజార్చుకోవడం ఇష్టం లేక నాలుగు వరకే చదివిందని అబద్ధమాడాడు అందుకే భర్త ఎదురుగా ఎప్పుడు ఇంగ్లీష్ పేపర్ పట్టుకోదు పావని సెవెన్త్‌తోనే కూతురు లలితను స్కూలు మానిపించడం ఆమెకు విపరీతమైన బాధను కలిగించినా భర్తకు నచ్చచెప్పడం 'చెవిటివాని ముందు శంఖమూదినట్లేనని' తెలుసు కనుక మౌనం వహించక తప్పలేదు

మూడేళ్ళు ఇంట్లో ఖాళీగానే ఉంది

# అమితాబ్‌కు గోవింద కితాబు



గోవింద- అమితాబ్ బచ్చన్ అభిమానిగా మారాడట మా కంటే కూడా చాలా హుషారుగా బచ్చన్ పని చేస్తాడని అంటున్నాడు గోవింద అమితాబ్ ఏదైనా సవాల్‌గా తీసుకొని పని చేస్తారని యింత వయసులో కూడా ఆయన చురుకుగా పని చేయటం చూస్తుంటే మాకెంతో సిగ్గుగా వుందని అంటున్నాడు

తేరీ పాయల్ మేరేగీత్ చిత్రంలో నటిస్తున్న గోవింద సరసన మీనాక్షి శేషాద్రి నటిస్తోంది ఈమె అమితాబ్ అభిమాని అందుకే తనతో నటించటానికి గోవింద ఒప్పుకున్నాడు ఇదెక్కడి అభిమానమో మరి!

కారు తలుపు తీసాడు టోపీవాలా. చల్లటిగాలి రివ్వునవీచింది. "ఉదయ్‌పూర్‌లో ఎక్కడకు వెళ్లినా సరసుమీద నుంచి ప్రసరించే గాలి ఎదురవుతుంది " అనుకుంటూ కారు దిగింది రేఖ.

పాతమేడ- బహుకాలంగా పాడుపెట్టినట్లుంది. 'ప్రతాప్ హావేలి ' అని చెక్కిన అక్షరాలు మేడ మూడో అంతస్తుపైన కనపడ్డాయి.

ఇక తనపని అయిపోయినట్లు విరిగిపోయిన గేటు పక్కన నిలబడిపోయాడు టోపీవాలా

దూరాన ఎక్కడో కారువస్తున్న శబ్దం వినబడి వెనుదిరిగి చూచింది రేఖ. ఏమీ కనబడలేదు. వెనుదిరిగి వెళ్దామన్న ఆలోచనను బలవంతంగా అణచుకుంటూ ముందుకు కదిలింది.

ఇనపగేటు- చువ్వలు తుప్పు పట్టి వున్నాయి. బలమంతా వుపయోగించి నెడితేగాని గేటు కదలి మనిషిలోపలకు వెళ్లేంత కాళీరాలేదు.

"రాజాగారి మహళ్లలో యిదొకటి. రాజభరణాలు రద్దవడంతో అన్ని భవనాల లాగే యిదీ పాడుబడిపోయింది " వెనుక నుండ అన్నాడు టోపీ వాలా.

విశాలమైన ఆవరణ నిండా పిచ్చి మొక్కలు మొలచివున్నాయి. పిచ్చి మొక్కల మధ్య సన్నని దారి మేడ సింహద్వారం వరకు వుంది. ఆ దారిన నడచివెళ్లి సింహద్వారం ముందు నిలచి క్షణం వూపిరి పీల్చుకుంది రేఖ.

ఏనుగులు తొండాలమీద పూలహారాలుంచుకుని స్వాగతం పలుకుతున్నట్లు తలుపులమీద చెక్కివుంది! "ఈ పట్టణంలో ఏ మారుమూల మేడలో చూచినా పూర్వపు కళాకారుల నైపుణ్యం కన్పడుతుంది " అనుకుంటూ తలుపులు నెట్టింది.

భూమిలోకి పైన గోడలోకి అమర్చిన ఇనుప స్తంభాలకు తలుపులమర్చడంతో కీచుమంటూ తలుపులు తెరుచుకున్నాయి.

ముందుకు నడిచింది రేఖ.

ఆ క్షణాన వీధిలో నిలబడి రేఖ వంకే చూస్తున్న టోపీ వాలా నెత్తిన బలమైన యినుపరాడ్ దెబ్బపడింది. టోపీ మడతలలో అమర్చిన మందమైన చర్మం దెబ్బనుండి కొంతవరకు కాపాడబట్టి బతికిపోయాడు గాని లేకుంటే కపాలమోక్షం కలిగేది.

టోపీ ఇనపరాడ్ దెబ్బను కొంత ఆపినా పూర్తిగా రక్షణ యివ్వలేకపోవడంతో దభీమని కిందపడి స్పృహ కోల్పోయాడు టోపీవాలా.

"చచ్చాడేమోగురూ " సన్నగా రివటలా వుండే వ్యక్తి దొప్పచెవుల వాడితో అన్నాడు.

"చావనీ- అడ్డం తొలగిపోతాడు " అంటూ ముందుకురికాడు దొప్ప చెవులవాడు. అతనివెంటే సన్నపాటి వ్యక్తి పరుగెత్తాడు.

పెద్దహాలులో కడుగెట్టింది రేఖ. మధ్యలోంచి మెట్లు కనపడ్డాయి. పక్కన విశాలమైన గదులున్నాయి.

నేలంతా దుమ్మునిండి గోడలకు బూజుపట్టి వుంది.

చండాలపు వాసనతో గాలి ముఖాన్ని తాకింది. "ఛీ ఛీ" అనుకుంది రేఖ నెత్తి మీదగా పోతున్న గబ్బిలాన్ని చేతితో అదిలిస్తూ.

మెట్ల మీదుగా పైకి వెళ్లింది రేఖ. రెండో అంతస్తులో అనేక గదులున్నాయి. శక్తివంతమైన టార్చ్ లైట్ వెలుగులో గదులన్నీ గాలించి చూచింది. మెట్లమీదుగా మూడో అంతస్తులోకి వెళ్లింది. మూడో అంతస్తులోని గదులూ గాలించి వెదకింది. దుమ్ము, బూజు, గబ్బిలాలు తప్ప రవితేజ ఆచూకీ తెలియరాలేదు.

మొదటి అంతస్తుకంటే రెండో అంతస్తు అంతకంటే మూడో అంతస్తులోని తలుపులు, దర్వాజాలు గోడలు కళాకారుల పనితనం మరింత నైపుణ్యం సాక్షాత్కరిస్తూ రేఖ మనసును ఆకట్టుకోసాగా




యిగాని "ముందు రవితేజతో మాట్లాడాలి సుమా" అని తనను తాను హెచ్చరించుకుంటూ కిందకు దిగివచ్చింది.

మెట్లు దిగుతున్న రేఖకు కుడిపక్కనవున్న గది వాకిలి వద్ద అలికిడి వినవచ్చింది. దొప్ప చెవులున్న అతను ఆ గదిలోకి వెళ్లడం కనపడింది.

"ఇతనా రవితేజ? రవితేజ అయితే నన్ను చూచి అవతలకెందుకు వెళతాడు?" రేఖ మనసులో భయం మొదలయింది.

ఎడమవైపున వున్న గదుల్లో వొక గదిలో వెలుతురు కనపడింది. అటువైపుగా పరుగెత్తుకు వెళ్లిందిరేఖ. ఆజానుబాహుడైన పొడవాటి వ్యక్తి రూపం గది చివర కనపడింది. పెద్ద కొవ్వొత్తి వెలుగులో అతని దగ్గరకు వెళ్లి రొప్పుతూ "మీరు?" అంది.

అవునన్నట్లు తలూపి "వెంబడి తోకలను తెచ్చావేం రేఖా? " అన్నాడు.

ఉలికిపడి వెనుదిరిగి చూచి లోపలకు వస్తున్న దొప్ప చెవుల వాడిని, అతని వెనుకవస్తున్న సన్నటి వ్యక్తిని గమనించి భయవిహ్వాలతతో "బాబోయ్ దొంగలు" అని కెవ్వున అరచింది. అప్రయత్నంగా రేఖ ఎదురుగా వున్న వ్యక్తికి దగ్గరగా వెళ్ల సాగింది.

"రేఖా " అంటూ ఆమెను పక్కకు లాగాడు ఎదురుగా వున్న వ్యక్తి. ఆ క్షణాన ఏదో రివ్వున దూసుకువెళ్ళి అతని చొక్కాలోంచి కుడి భుజంలో దిగబడ్డం గమనించింది రేఖ.

భయంతో బిగుసుకు పోయింది రేఖ.

(ఇంకా వుంది)

# నీలం తండ్రి కోరిక



నీలం చిత్రరంగంలో గొప్ప తారగా వెలిగిపోతుంటే చూడాలని వుందట తండ్రికి ఆయన బాగా పేరుబడిన వజ్రాల వ్యాపారిట అందుకే తన కూతురు భవిష్యత్తును దృష్టిలో పెట్టుకొని యిద్దరు నిర్మాతలకు పెట్టుబడి పెట్టాడు చిత్ర నిర్మాణానికి కేవలం పేరు కోసమే తాను చిత్రాల్లో నటించాలనుకుంటున్న నీలం మంచి వ్యక్తిత్వం గల పిల్ల అని గోవింద అంటున్నాడు మరి ఆ పిల్ల మీద గోవిందకు అంత అభిమాన మేమిటో! ఆలోచించాల్సిందే

సుభద్రమ్మ భయపడినట్లుగానే కూతురి విషయం తెలుసుకోనందుకు భార్యని తెలి.ు ఊరుకున్నందుకు సుభద్రమ్మని ప్రేమించుకున్నందుకు లలితని, సురేష్‌ని తిట్టినతిట్టు తిట్టకుండా దులిపేసాడు 'తండ్రంటే అమిత భయమున్న లలిత ఈ విషయంలో మాత్రం సాహసించి అతనితో వెళ్ళిపోయింది వేరే ఊరికి ఆ సంవే కూతురికి మైనారిటీ తీరడంతో కేసు పెట్టడానికి కూడా కుదరలేదు భానుమూర్తికి ఒక్క ఆర్నెల్లు ముందు తెలుసుంటే పెళ్ళి చేయడమో లేదా వాళ్ళు పెళ్ళి చేసుకోనుండే మైనారిటీ తీరలేదని కేసన్నా పెట్టేవాడిని అనుకున్నాడు భానుమూర్తి మండిపడుతూ

తన స్నేహితుడి సహాయంతో ఆటో ఒకటి అద్దెకు తీసుకొని కొన్ని ఇళ్ళల్లో ట్యూషన్స్ ఏర్పాటు చేసుకొని త్వరలో నే తల్లిని కూడా తనుంటున్న సత్తెనపల్లికి తీసుకువెళ్ళాడు సురేష్

మళ్ళీ ఇన్నాళ్ళకు వచ్చింది లలిత దగ్గర నుంచి ఆమెకు లెటర్

* * * *

నెలా పదిహేను రోజులు గడిచాయి పావనికి కంగారెక్కువయింది కూతురికి 9వ నెల కూడా వచ్చేసి ఉంటుంది అంతా అన్నయ్య మీదే వదిలి పెట్టి వచ్చింది తన కోసం కూతురు ఎంతగా ఎదురు చూస్తున్నదో! పైగా ఆ పురుడు విషయం ఒక్క సారి అన్నయ్య, వదినతో మాట్లాడి వస్తే తనకూ మనశ్శాంతిగా ఉంటుంది తను వెళ్ళినంత మాత్రాన చూస్తూ వదిలేయరనుకో!

అయినా వెళితే బాగుంటుంది విజయవాడ వెళ్ళే మార్గం కోసం అన్వేషిస్తుండగా తలవని తలంపుగా అక్కడ నుంచే లెటరొచ్చింది

సారథికి పదిహేను రోజుల క్రితం టైఫాయిడ్ జ్వరం తగిలిందని, ప్రస్తుతానికి కులాసాగానే ఉన్నాడని, ఒక్కసారి చెల్లెల్ని చూడాలని తహతహగా ఉందని, వీలు చూసుకొని రమ్మనమని మరీ మరీ రాసింది పావని వదిన సరస్వతి

ఈ మధ్యనే కదా వెళ్ళిందని భానుమూర్తికి మనసులో ఉన్నా బాగుండదని అయిష్టంగానే రాజేష్‌ని తోడిచ్చి పంపించాడు ఆ టైమ్‌కి తల్లి ఇంట్లో ఉండడంతో కూతుర్ని వదిలిపెట్టి వెళ్ళమన్నాడు

కొడుకు కూడా రావడంతో పావనికి గుండెల్లో రాయిపడ్డట్టనిపించింది కానీ ఏ వంకతో ఆపడం! పైగా సెలవులు కూడాను ఒక వైపు అన్నగారికి ఎలా ఉందోనన్న ఆదుర్దా మరో పక్క ఈ రూపెత్తిన కూతుర్ని చూడొచ్చు అన్న ఆనందంతో, డోలాయమానంగా ఉంది ఆమె మనసు

వీళ్ళు వెళ్ళేసరికి అప్పుడే టిఫిన్ తిని హార్లిక్స్ తాగుతున్న సారథి సాదరంగా ఆహ్వానించాడు చెల్లెల్ని, మేనల్లుడిని

'అన్నయ్యా! ఎలా ఉంది?' "చెల్లెలి ముఖంలో ప్రస్ఫుటంగా కనిపిస్తున్న ఆందోళనను చూసి చిన్నగా నవ్వాడు మరేం ఫర్వేదమ్మా! ఇప్పుడు బాగానే ఉంది ఎందుకో నిన్ను చూడాలనిపించింది మీ వదిన లోపలుంది వెళ్ళు" అన్నాడు మేనల్లుడిని తన పక్క కుర్చీలో కూర్చోపెట్టుకుంటూ

ఆడబిడ్డను చూసి సరస్వతి తేలిగ్గా నిట్టూర్చుస్తూ 'అమ్మయ్య వచ్చావా! లలిత నీకోసం ఒకటే కలవరిస్తుంది అందుకే వ్రాయాల్సొచ్చింది అలా కూడా ఎవరన్నా వస్తే నిక్షేపంలా ఉన్న మనిషిని చూస్తే అనుమానం వస్తుంది కదా! తనకు చన్నీళ్ళు పడవుగా

సాగింది. అనాదిగా ఆడదానికి ఆర్థిక స్వాతంత్ర్యాన్ని మట్టుపెట్టిందీ సమాజం. ఇప్పుడిప్పుడే స్త్రీలు బాగా చదువుకుంటూ ఉద్యోగాల్లో కొస్తున్నారు. చిన్నప్పటినుండి ఆమె ఆలోచనా విధానమే వేరు. తనకు ఫలానా వస్తువు కావాలని నోరు విడిచి తన తలిదండ్రుల్ని ఏనాడూ అడగలేదు. పెద్దయ్యాకా ఉద్యోగం చేసుకుని తనకు కావలసినవి కొనుక్కోవాలనుకుంది. దేనికీ ఎవరినీ యాచించవలసిన దుస్థితి తనకు కలుగకూడదు. అందుకే అమ్మ వద్దంటున్నా డిగ్రీ వరకు చదివింది. నాన్న కిష్టం లేకపోయినా ఉద్యోగంలో చేరింది. తన సంపాదనను తనకు ఇష్టం వచ్చిన రీతిలో ఖర్చు పెట్టుకోవాలనుకుంది. పెళ్ళికి పూర్వం తనకా విషయంలో అణుమాత్రమైనా ప్రతిఘటన ఎదురవలేదు. ఆమె మనస్తత్వాన్ని పూర్తిగా చదివిన తండ్రి ఏనాడూ తన జీతం గురించి గాని, తను పెడుతున్న ఖర్చును గురించి గాని ప్రశ్నించలేదు. తరువాత తనకు పెళ్ళి ప్రయత్నాలు జరిగాయి. వివాహం తన ఆర్థిక స్వాతంత్ర్యాన్ని హరించి వేస్తుందని తెలియక తలవంచి తాళి కట్టించుకుంది. జరుగుతున్నది తలచుకుంటూవుంటే దుఃఖం ఆగడంలేదు. ఇకనుండి తను సంపాదించినదంతా కట్టుకున్నవాడి చేతుల్లో గుమ్మరించాలి. ఏం కావాలన్నా పతిదేవుణ్ణి దేవులాడాలి. ఏమిటీ ఖర్మ?... అందుకేనా తను చదువుకుంది?... ఈ మాత్రానికేనా తను ఉద్యోగం చేస్తోంది?... మన సంఘంలో ఉద్యోగినులంతా చేసే పని ఇదేనా?...



## అవగాహన

అలివేణి హృదయ కడలిలో చెలరేగుతున్న సంచలనాన్ని గ్రహించని ఉమాపతి లైటార్పి భార్యను దగ్గరకు తీసుకున్నాడు.

ఆ రాత్రి సంతోషంగా అతడితో సహకరించలేకపోయింది అలివేణి.

పదిహేను రోజులు గడిచాయి.

నెల రోజులు సెలవు పెట్టి పుట్టింటికి వెళ్లేందుకు సిద్ధమైంది అలివేణి. దగ్గరుండి భార్యని బస్సుకి దిగబెట్టాడు ఉమాపతి

ఒకరోజు తన క్లాస్‌మేట్ లావణ్యను చూడటానికి వెళ్లింది అలివేణి. లావణ్య స్థానిక ప్రభుత్వ మహిళా డిగ్రీ కళాశాలలో లెక్చరర్‌గా పని చేస్తోంది.

అలివేణి రాకతో ఊరంత సంబరపడిపోయింది లావణ్య.

ఆమె వారిస్తున్నా వినకుండా జీడిపప్పు ఉప్మా చేసి పట్టుకొచ్చింది. ఆ మాట ఈ మాట అయ్యేకా "ఎలా వుంది నీ వైవాహిక జీవితం? ఎక్కడికీ హనీమూన్ ట్రిప్పు వెయ్యలేదా?" అంటూ సంభాషణలోకి దింపింది.

లావణ్య ప్రశ్నతో అదివరకున్న ఉత్సాహం కాస్త నీళ్లు కారిపోయింది. ముఖంలో రంగులు మారాయి.

"ఏమిటలా అయిపోయావ్" అడిగింది లావణ్య.

"ఆయనకు విడాకు లివ్వాలనుకుంటున్నాను"

అలివేణి మాటలకు అదిరి పడింది లావణ్య.

"అవేం మాటలే. పెళ్లై రెండు మాసాలైనా కాలేదు..."

"నేను ఉద్యోగం చేస్తున్నది ఒకరిపై ఆధారపడి బ్రతకటానికి కాదు. నాకు ఆర్థిక స్వేచ్ఛ కావాలి. అది ఆయనవద్ద కరువైంది. తిలకం సీసా కావాలన్నా, కాటుక డబ్బీ కొనుక్కోవాలన్నా చేయి చాపాలి. నా మనసు అందుకు అంగీకరించడం లేదు. వైవాహిక జీవితానికి తిలోదకాలిచ్చి స్వేచ్ఛగా బ్రతకాలని నిర్ణయించుకున్నాను" అంటూ లేచి నిలబడింది అలివేణి.

"కూర్చో"

బొమ్మలా చతికిలబడింది అలివేణి.

"చిన్నప్పటినుండి నీ సైకాలజీ నెరిగిన దానిని. పెళ్లైతే నీ ధోరణి మారుతుందనుకున్నానే తప్ప ఇటువంటి విపరీత నిర్ణయాలు తీసుకుంటావనుకోలేదు. నేనో ప్రశ్న అడుగుతాను సూటిగా సమాధానం చెబుతావా?"

ప్రశ్నార్థకంగా ముఖం పెట్టింది అలివేణి.

"మీ ఆయనకు వ్యసనాలేవైనా ఉన్నాయా?"... విచ్చల విడిగా డబ్బు ఖర్చు చేస్తాడా"

"అటువంటిదేమీ లేదు"

"మరింకేం? నువ్వు సంపాదించినా, మీ వారు గడించినా సంసారం కోసమే కదా! భార్యా భర్తల మధ్య సర్దుబాటు ధోరణి ఉండాలి. నీకు తెలుసునో తెలియదో నేను గెజిటె డాఫీసర్ని అయినా నేను పెళ్లాడింది ఒక సాధారణ గుమాస్తాని. ఐనా నా సర్వస్వాన్ని ఆయనకు అర్పించడానికి నా మనసు ఏనాడూ వెనుకాడదు. మన సమాజంలో ప్రతి మహిళ మగడు తనకంటె ఉన్నతంగా వుండాలని కోరుకుంటుంది భార్యాభర్తలు షాపింగుకు బయలుదేరినప్పుడు భర్త నిరుద్యోగి అయినా భార్య అతడి చేతికి డబ్బిచ్చి కావలసినవి కొనిపిస్తుంది. అంతమాత్రాన ఆమె హోదా తగ్గిపోదు. సరికదా పెరుగుతుంది. భార్య తనకు కావలసిన దానిని భర్త నడిగి పొందడంలో వున్న ఆనందం స్వతంత్రంగా సంపాదించుకోవడంలో ఉండదు. రానురాను నీకా విషయం అర్థమౌతుంది. తొందరపడి నిర్ణయాలు తీసుకోకు" నచ్చచెప్పేందుకు ప్రయత్నించింది లావణ్య.

"ఏమో! నువ్వెన్ని చెప్పు నేనా పద్ధతికి అలవాటు పడలేకపోతున్నాను."

"పోనీ నేనో సలహా ఇవ్వనా?"

అంతకన్నా కావలసినదేమిటనుకుంది అలివేణి.

"మీరు బ్యాంకులో జాయింట్ ఎకౌంట్ ప్రారంభించి మీరు తెచ్చుకున్న జీతాలు అందులో వేసుకోండి. ఎవరికి ఎప్పుడు ఎంత కావాలో డ్రా చేసుకోండి. ఖర్చు విషయానికొస్తే ఇరువురూ జాగ్రత్తపరులే గనుక సమస్యలు ఉత్పన్నం కావు.

"థాంక్స్ లావణ్యగారూ. మీ సలహా నాకు నచ్చింది." అన్నాడు ఉమాపతి లోపలకొస్తూ.

"మీరు..." భర్త వంక ఆశ్చర్యంగా చూసింది అలివేణి.

"ఇప్పుడే వచ్చాను. నువ్వు మీ ఫ్రెండ్ లావణ్యగారింటికి వెళ్ళినట్లు మావయ్యగారు చెప్పారు."

"ఇకనేం నీ భర్త కూడ నా ప్రపోజల్‌కి గ్రీన్ సిగ్నల్ ఇచ్చేసారు. నువ్వు కూడ అంగీకరిస్తే నీ పచ్చని సంసారం పండంటి కాపుర మవుతుంది" అన్నది లావణ్య నవ్వుతూ.

అంగీకార సూచకంగా చిరునవ్వు నవ్వింది అలివేణి.

"పద వెళదాం" ఆమె చేయి నందుకున్నాడు ఉమాపతి.

లావణ్య ఎదలో పన్నీటి జల్లు కురిసింది.



## ముఖ్యమంత్రుల 'హీరోయిన్'!

ముగ్గురు ముఖ్యమంత్రుల సరసన నటించిన ఖ్యాతి తమిళ నటి మనోరమకు చెందుతుంది. తమిళనాడు మాజీ ముఖ్యమంత్రులు స్వర్గీయ సి. ఎన్. అన్నాదురై, కీర్తిశేషులు ఎం. జి. రామచంద్రన్, ప్రస్తుత ముఖ్యమంత్రి శ్రీ ఎం. కరుణానిధితో ఆమె నటించింది. అన్నాదురై, కరుణానిధితో మనోరమ పలునాటకాలలో నటించగా– ఎం. జి. రామచంద్రన్‌తో అనేక చిత్రాలలో నటించింది. కాగా– 1985 వ సంవత్సరం నాటికే మనోరమ 1000 పైగా తమిళ చిత్రాలలో నటించి రికార్డు నెలకొల్పింది.

భూమారెడ్డి

# ఈవారంలో మీ యోగం

**5-10-1990 శుక్రవారం మొదలు**
**11-10-1990 గురువారం వరకు**

**మేషం :** వారమంతా యోగప్రదమే. అంటే, పాత్రికేయులయినా, పంపిణీదారులయినా, విద్యావేత్తలయినా, నూతన వృత్తిని చేపట్టాలని యత్నించినా, దూర ప్రాంతానికెళ్లాలన్నా, పత్రికా ప్రకటన యందు లాభ ప్రదమైనమార్పు తేవాలన్నా అనుకూలమే. స్త్రీలకు : వృత్తి లాభం, ఉద్యోగరీత్యా పెంపు.

**వృషభం :** ఇప్పట్లో, ముఖ్యంగా ఈ వారమందు భారీ ప్రయాణాలు పెట్టుకోటం ఏమంత న్యాయంగాదు. వాహన ప్రమాదం, 'రోడ్డు' ప్రమాదం సూచితం. తృతీయ రాశియందలి 'గురుని స్థితి' ఏమంత అనుకూలంగాదు. స్త్రీలకు: సర్వరంగాలలో అభివృద్ధికరమైన మార్పులు.

**మిధునం :** ధనలోపం రాదు, వ్యాపారాన అభివృద్ధి చేకూరగలదు. పుస్తక విక్రేతలకు మేలు. రచయితలకు, గాయకులకు మేలు. చిత్రరంగాన చిన్న పాత్రధారులకు బహుకష్ట సమయంగా గుర్తించాలి. క్రొత్తగా 'చలనచిత్ర' నిర్మాణంగావించాలంటే వారమంతా యోగ్యమే. స్త్రీలకు: యత్నించి, కార్యసాధనగావించుటే వారవిశేషం.

**కర్కాటకం :** 'గురుని ఉచ్చస్థితి' సర్వవిధాల మేలు. ధన లోపంలేదు. వ్యాపారరంగాభివృద్ధికి అనుకూలం. సభారంగానుకూలం. స్థితియందు పెంపు. ఉత్సాహజనకమైన మార్పు. అయినవారితో, కాని వారితోవచ్చిన అభిప్రాయభేదాలు సమసిపోగలవు. ధనలోపంలేదు. రాజకీయంగా మేలు. చాలకాలంగా అందని పైకం, 'గురు' వారంలో అందటం గ్రహింపదగిన అంశం. స్త్రీలకు: వృత్తియందు సదవకాశాలు.

**సింహం :** బంధువుల యిండ్లకో, క్షేత్రాటనకో, కొందరు ఉద్యుక్తులవుతారు. ధనలోపంలేదుగాని, అధికంగా ఖర్చు చేయవలసిన పరిస్థితులుంటాయి. వ్యవహారం ఏదయినాసరే, ఎలాంటి గడ్డు వ్యవహారమయినాసరే వారాంతంలో పరిష్కారమవుతుంది. విద్యావేత్తల సహాయమున్నది. యోగప్రదమైన వారమే. స్త్రీలకు: సభామర్యాద, చేసిన ఉద్యోగయత్నం సానుకూలంకాగలదు.

**కన్య :** దూరప్రాంతాలకు వెళ్లవలసిన అగత్యం, విద్యావేత్తల సహాయమున్నది. ఇంట శుభం జరుగుట గమనింపదగిన అంశం. అపూర్వ వస్తుసేకరణ, వ్యాపార నిమిత్తం శ్రమించవలసిన అగత్యమున్నది. శ్రద్ధా సక్తులతో కార్యాచరణం, తద్వారా మేలు. స్త్రీలకు: బంధువర్గీయుల రాక, ఆదాయమందు పెంపు.

**తుల :** వారమంతా యోగప్రదం. ఆశించిన ప్రతి వ్యవహారం సానుకూలం కాగలదు. వృత్తియందు అనుకూల మార్పులున్నాయి. వెనుకచేసిన తప్పులు సవరించుకోగలరు. శుభ సమయం, వృత్తియం ౦ వికాసం. పాత్రికేయులకు సదవకాశాలు. ధనలబ్ధి, యత్నకార్యసిద్ధికి చక్కని అవకాశాలు. స్త్రీలకు: వృత్తియందు అభివృద్ధి.

**వృశ్చికం :** పదిమందిలో ప్రతిష్ఠ, సుఖశాంతులు, ధనలబ్ధి, చేసే వ్యాపారం వేరొక ప్రదేశానికి మార్పు చేయవలసిన అవకాశం రావచ్చు. వాహన మార్పిడి, వృత్తిమార్పిడి కొందరి విషయంలో చెప్పవచ్చు. 'పంచాయితీ' మార్గాన ఒకానొక కుటుంబ వ్యవహారం సానుకూలం కానున్నది. స్త్రీలకు: సర్వరంగాలలో అభివృద్ధికరమైన మార్పులు.

**ధనుస్సు :** ఏదిమంచిదో, ఏది న్యాయమో, ఏది ఈ వారాంతంలో ముగించాలో, ఎరిగి ముందుకు సాగండి. అంతా మేలుగా మీకు చేకూరుతుంది. మీ ఆశయం సిద్ధిస్తుంది. నలుగురిలో ప్రసిద్ధి ఏర్పడనున్నది. అవకాశవాదులున్నారు. ఏదో యిబ్బంది కలిగింపనున్నారు. గ్రహించి మెలకువతో వర్తించటం ఈ వారం న్యాయం. స్త్రీలకు : అప్రయత్నాదాయం. విలువగల వస్తుసేకరణకు అస్కారం.

**మకరం :** స్థితిగతులందు మార్పు రావచ్చు పుస్తకవిక్రేతలకు, రచయితలకు, గాయకులకు, చలనచిత్రమాటల రచయితలకు సదవకాశాలున్నాయి. అప్రయత్నంగా ధనలబ్ధి, సుఖశాంతులు, ఏమయినా, 'రాశి' యందు స్థితుడైన 'రాహువు' ఏదో యిబ్బందియో, అనారోగ్యతయో కలిగింపకమానడు. స్త్రీలకు: సుఖశాంతులు, వృత్తియందువృద్ధి.

**కుంభం :** దూరప్రాంతానికి వెళ్లవలసిన అగత్యం, అది విదేశమయితే, ఈ వారం మానటం శ్రేయస్కరం. సభామర్యాద కొందరకు, చలనచిత్రరంగాన సదవకాశం కొందరకు చెప్పవచ్చు. అన్నిరంగాలలో అభివృద్ధికరమైన మార్పులు రాగలవు. స్త్రీలకు: ధన, వస్తు వాహన సౌకర్యంలో యోగప్రదమే'.

**మీనం :** ఆదరణకు, ఆదాయవృద్ధికి, అప్రయత్నధన లబ్ధికి, అపూర్వవస్తుసేకరణకు, అనుకూలమిత్ర సమాగమనానికి, సర్వవిధాలా అనుకూలత గలవారం 'యోగదాయకం' అని గ్రహించాలి. క్షేత్రాటనకో, దైవ కార్యానుకూలతకో, కొందరు ప్రయాణించనున్నారు. వ్యవహారసానుకూలతకు అనుకూలవారం. స్త్రీలకు: వృత్తి లాభం, నూతన వాహన సేకరణకు అనుకూలం. రాజకీయంగా కూడ అనుకూలత గలదని గ్రహించాలి.

-విద్వాన్ కొటసత్యరంగయ్యశాస్త్రి

## 'గుండు' రికార్డు

వివిధరంగాలకు చెందిన అనేక మంది తమ ప్రతిభా పాటవాలతో రికార్డులు నెలకొల్పటం మనం వింటూనే వుంటాం. నటీ నటుల విషయానికి వస్తే తమ సహనటీనటులకంటే ఎక్కువ చిత్రాలలో నటించి రికార్డులు సృష్టిస్తారు. అలాంటి వారిలో నటుడు మన్‌మౌధ్ ఒకడట. ఆయన రెండు వందల చిత్రాలలో నటించాడు. ఇన్ని చిత్రాలలో నటించడం పెద్ద రికార్డు కాకపోవచ్చు గాని ఆయన నటించిన అన్ని చిత్రాల్లోను బోడిగుండుతోనే నటించాడట. అది రికార్డేగా మరి! ఇలా యిన్ని చిత్రాలలో బోడిగుండుతో నటించిన ఘనత మన దేశంలో యీయనకే దక్కుతుంది. ఈ 'గుండు' రికార్డు బాగానే వుందే!

19 ఏళ్ళ వయసు వచ్చాక మగరూర్ అనే చిత్రంలో జైరాజ్ నాయకుడుగా తాను నాయకిగ నటించింది ఎక్ హీ భూల్‌లో జైరాజ్‌కు కూతురుగా (4 ఏళ్ళు) నటించింది

రంజిత్ మువీటోన్ వారి చాలా పౌరాణిక చిత్రాల్లో నటించింది హనుమాన్ పాతాళ్ విజయ్ వీరఘటోత్కచ్ గణేష్‌జన్మ శ్రీకృష్ణ వివాహ్, మాయాబజార్ గణేష్‌మహిమ అల్లాఉద్దీన్ వంటివి ఎన్నో!

1949 సం లో బొంబాయి టాకీస్ వారి తమాషా లో నటించేటప్పుడు

# మీనాకుమారి

అశోక్‌కుమార్- కమాల్ అమ్రోహిని మీనాకుమారికి పరిచయం చేశాడు ఆ పరిచయం క్రమేపి ప్రేమగా మారి 1953 సం లో దంపతులయ్యారు (కమాల్ అమ్రోహికి భార్యా పిల్లలున్నారు



ద్వితీయ కళత్రంగా మీనాను స్వీకరించాడు)

## శారదగా మీనా

**మీనాకుమారి నటజీవితం జ్వాజ్వల్యా** మానంగా కొనసాగుతుండేది ప్రముఖ సంస్థల ప్రముఖ నాయకులతో ఎన్నో ఉత్తమ పాత్రలను నటించి ఖ్యాతి గాంచింది ఎల్ వి ప్రసాద్ **తొలి హిందీ** చిత్రం శారద లో నటించి మంచి పేరు తెచ్చుకుంది మిస్ మేరి షరారత్ ఇల్జామ్ అజాద్ మధ్యాహ్ సనమ్ ఫుట్‌పాత్ దో బిఘాజమీన్ దానాపానీ మీనార్ దాస్ కబీర్ చాందినీ చౌక్ నూర్‌జహాన్ యహూది చిత్రలేఖ చిరాగ్ కహాఁ రోషినీ కహాఁ ప్యార్‌కాసాగర్ ఏక్‌హీరాస్తా మైలిటిల్ లడ్కీ హూఁ మొదలగు చిత్రాలు ఆమెను ఉన్నత శ్రేణితారగ నిలిపెయి

శాస్త్రీయ సంగీతాన్ని కథక్ నాట్యాన్ని అభ్యసించింది డ్రెస్ డిజైనర్‌గా కొన్ని చిత్రాలకు (తనవి) పని చేసింది ఉర్దూ కవితలను రాసి షమా పంటి కొన్ని పత్రికలకు పంపించేది

## 2 సార్లు 'ఫిల్మ్‌ఫేర్'

ఉత్తమనటి అవార్డులు పొందింది ఎంత కీర్తి గాంచినా డబ్బు వస్తున్నా మానసికంగా కృంగి పోయింది తాను నమ్మిన వ్యక్తి కమాల్ అమ్రోహి వల్ల **సుఖం కంటే దు ఖమే అధికం కాసాగింది** కుమిలి పోయింది కొన్నాళ్ళు చెల్లెలు మాధురి (మెహమూద్ భార్య) ఇంట్లో తలదాచుకుంది మనో వేదన భరించలేక మద్యంకి బాగా అలవాటు పడిపోయింది తర్వాత అనారోగ్యంతో, బాధపడింది ఆర్థికంగా కూడా దిగజారి పోయింది నర్గిస్ ధనసహాయం చేసింది వైద్యం

# ట్రాజెడీ క్వీన్ మీనాకుమారి

–ఆరిపాక సూరిబాబు

కోసం ఆరోగ్యం కొంత నయమయ్యాక మళ్ళీ కొన్నిచిత్రాల్లో నటించింది అయితే ఏం ప్రయోజనం? మనోవ్యాధి తినేసింది! ఎలాగో కష్టపడి పాకీజా లో తన పాత్ర పూర్తి చేసుకోగల్గింది కొన్ని లాంగ్ షాట్లలో పద్మాఖన్నాను పెట్టి (డూప్) తీయడం జరిగింది పాకీజా చిత్రం ఘనవిజయం సాధించింది

అనారోగ్యంతో మనో వ్యధతో కృంగి కృషించి తే 30–3–1972ది మధ్యాహ్నం 3–20 గంటలకు అనంత వాయువుల్లో మీనాకుమారి ప్రాణంలీనమయి పోయింది ఆ రోజు బొంబాయి స్టూడియోల్లో షూటింగులన్ని కాన్సిల్ అయ్యాయి ప్రముఖ నటీనటులు దర్శకులు నిర్మాతలు అభిమానులు ఆమె అంతిమ దర్శనానికి హుటాహుటిని తరలి వచ్చారు అశ్రునయనాలతో శ్రద్ధాంజలి ఘటించారు మరణించిన తర్వాత

## ఆమె మీద సినిమా

సినిమా నటీనటులు ప్రేక్షకుల అభిమానాన్ని చూరగొంటారు అది సహజమే! మీనాకుమారిని నిర్మాతలు–దర్శకులు కూడా అభిమానించేవారు ఒక నిర్మాత మీనాకుమారిగురించి చిన్న చిత్రం తీయాలని ప్రయత్నించేడు అది అంత బాగోదని శ్యామ్ చవలా అనే పెట్టుబడి దారుడు పూర్తి నిడివి చిత్రం తీయడానికి అన్ని ఏర్పాట్లు చెశాడు మీనాకుమారికి అమర్ కహాని అనే పేరుతో తీసిన ఈ చిత్రం 1980 సం లో విడుదలయింది మీనాకుమారి– ప్రముఖ నటులతో నటించిన కొన్ని చిత్రాల సన్నివేశాలు జోడించి డాలీ అనే బెంగాలి యువతితో మీనాకుమారి భూమిక దరింప జేశారు ఈ చిత్రానికి పాల్కే అవార్డు గ్రహీత షరాబ్ మోడ దర్శకత్వం నెరపారు సంగీతం ఖయ్యాం సమకూర్చాడు షెల్లీ ఫిలింస్ వారు దీన్ని తీశారు

భారతదేశంలో సినిమా కళాకారుల జీవిత కదలు చిత్రాలుగా రావడం చాలా అరుదు నాకు తెలిసినంత వరకు సైగల్ హంసావాడ్కర్ మీనాకుమారిలవి ఇంత వరకు వెలుగు చూశాయి వీరి జీవితాలు ముగిసినా వీరి కీర్తి చంద్రికలు మిగిలివున్నాయి!

సుమారుగా మీనాకుమారి నూరు చిత్రాల వరకు బాల్యం నుంచి మరణించిన దాకా నటించింది

మన తెలుగు నటి సావిత్రికి ఈమెకు రూపం నటన నిజ జీవితంలో దగ్గర పోలికలున్నాయి వీరిద్దరూ– బార్యా పిల్లలున్న భర్తలతో బాదలు పడి మద్యాన్ని ఆశ్రయించారు నమ్ముకున్న వ్యక్తే జీవితాన్ని నాశనం చేస్తే చివరకు మిగిలేది బూడిదే కదా?



# ఈ మార్పు నా తీర్పు - బుహారి



నోట్లోని పైపుని ఏకధాటిగా పీలుస్తూ-బోనులోపడ్డ సింహంలా- త్రిధారుణ నేత్రాలతో-భీషణ రూపం దాల్చి-అసహనంగా వాచీ కేసి చూసుకుంటూ- హాల్లో పచార్లు చేస్తున్నాడు మార్తాండమూర్తిగారు.

బయట కారేదో ఆగిన శబ్దం విని - పుట్టలోని పాములా తల యెత్తి- భార్య వైజయంతికేసి చూస్తూ "వచ్చాడా వాడు?" అడిగేడు.

"ఇంకా రాలేదు" ముక్తసరిగా అంది వైజయంతి.

పదిగంటలు దాటింది. "వచ్చేటైమైంది గదా! ఎందుకు ఆవేశపడతారు. డాక్టర్లు చెప్పలా ఆవేశపడగూడదని" అభిమానంగా మందలిస్తూ-టాబ్లెట్-మంచినీళ్ల గ్లాసు తండ్రికి అందించింది.

కూతురుకేసి ఆప్యాయంగా చూశాడాయన.

"ఆవేశపడక ఏం చేస్తానమ్మా. ఎంత టెన్షన్ పడుతున్నానో తెల్సాతల్లీ, వాడు చేసిన నిర్వాకం మనల్ని ఏ స్థితికి తీసుకు వెళుతుందో తెల్సా తల్లి?" చాలా బాధగా అన్నాడాయన.

"అయినా మీరే చాలా తొందరపడ్డారు మావయ్యా. ఆయన సంగతి తెల్సివుండి కూడా" అంది జానకి, మావగారు తాగిన మంచినీళ్లగ్లాసు తనే తీసేస్తూ.

"అవునమ్మా! చాలా తొందరపడ్డాను. చాలా అనాలోచితంగా ప్రవర్తించాను. వాడు నటిస్తున్నాడని ఊహించలేకపోయాను. వాడి మాటలన్ని నీటిపై మూటలని-మన పతనానికి పునాదులని అర్థం చేసుకోలేకపోయాను" నిట్టూర్చాడాయన.

"నేను మొదటి నుంచీ అనుకుంటూనే వున్నాను. ఇన్ డైరక్ట్‌గా హెచ్చరించాను కూడా. వినలేదు మీరు" అక్కసుగా అంది రాధిక.

"నువ్వు కాస్తో కూస్తో బైటపడ్డావు-నేను పడలేదు" అంతే తేడా అంది జానకి.

"సరిసరి. ఇక చాలుకాని ఆపండి. ఏమిటి ఎక్కిరించటాలు, ఇంగితం లేకుండా" వాళ్లిద్దర్ని మందలించింది వైజయంతి.

వైజయంతి వంక కసిగా చూస్తూ లోపలికి వెళ్లారు వాళ్లిద్దరూ.

మార్తాండమూర్తి అంటె ఆ నగరంలో పేరున్న పెద్ద పారిశ్రామికవేత్త. అఖండుడని కీర్తి గావించినవాడు. ఆయనతో వాటా కలిస్తే- గుండెలమీద చేయివేసుకుని-పూలపాన్పుపై పవళించవచ్చని నమ్ముతారు తోటివాళ్లు. తమ లాభాలకేం ఢోకా వుండదని, వ్యాపారాన్ని మూడు పువ్వులు-ఆరు కాయలుగా వర్ధిల్ల చేయగల దిట్ట అని వాళ్లకి గురి. తమ ఫ్యాక్టరీల్లో ఉత్పత్తి అయ్యే సరుకుని మంచి లాభాల్తో మార్కెట్టుకి పంపిణీ చేయటంలో అసాధారణ ప్రజ్ఞా పరిజ్ఞానుడని, అనేకానేక కొత్తవిధానాల్ని-కొత్తపుంతల్ని

తొక్కి తిమ్మిని-బొమ్మి చేయగలడని ప్రతీతి.

ఆ ఇంట్లో-కూతురూ-కోడలు ఆయన పక్షం. ఆయనంటే అపరిమిత అభిమానం. వైజయంతిది తటస్థ విధానం.

అలా పచ్చగా-స్వర్గంలా సాగుతున్న ఆ ఇంట్లో రెండోమార్క్ చంద్రం. చంద్రం బాగా చదువుకున్నాడు. సంస్కారం వుంది. తెలివి వుంది. కాని అతని అభిప్రాయాలు వేరు. మనిషిని-మనిషి దోచుకోవటం నిరసిస్తాడు. అతని ఆలోచనలు వేరు. దృక్పథమే వేరు. అతను ఊహించుకునే ప్రపంచం వేరు. నడిచే పంథా వేరు.

ఏనాటికైనా-లేనిపోని ఆదర్శాలకిపోయి-ఈ ఆస్తి మొత్తం తగలేసి-తమ బ్రతుకుల్ని రోడ్డుకి ఈడుస్తాడని-తమ జీవిత విధానాలనే తల్లక్రిందులు చేస్తాడని మొదటి నుంచీ చంద్రం మీద గాఢమైన అభిప్రాయం మార్తాండమూర్తిగారిది.

అలాంటిది-గత సంవత్సరంగా చంద్రంలో మార్పు వచ్చింది. చీటికి మాటికి పనివాళ్లని విసుక్కోవటం-వాళ్లని చెప్పుకింద తేళ్లలా, ఎంతలో వుంచాలో అంతలో వుంచటం-మీకేమన్నా మేం ఋణమా అనటం-అన్నీ చూస్తున్నాడు, వింటున్నాడు మార్తాండమూర్తిగారు. కొడుకులోని మార్పుకి ఆయన ఆనందపడ్డాడు. మార్పు మానవ సహజం-లోకం అర్థంచేసుకున్నాడని-తనకి తగిన వారసుడైనాడని మురిసిపోయాడు.

ఆయనకి రెండవసారి హార్ట్‌స్ట్రోక్ వచ్చింది. భయపడి-వేరేమార్గంలేక- మార్పుచెందిన చంద్రానికి మరెన్ని నీతులు గరిపి-వ్యాపార సూత్రాలు బోధించి-తగిన జాగ్రత్తలు చెప్పి-పవర్‌పట్టా రాయించి-వ్యాపారం అప్పచెప్పాడు. విశ్చింతగా ఇంట్లో రెస్ట్‌తీసుకుంటున్నాడు.

పది రోజులు అణకువగానే వున్నాడు చంద్రం. అక్కడినుంచీ అతనిలో మళ్లీ మార్పు మొదలైంది.

తండ్రి అంటె లక్ష్యం పోయింది.

చేయదల్చుకున్నది నిర్భయంగా చేస్తున్నాడు.

ఈనాడు బెంగుళూరు ఫ్యాక్టరీలో చంద్రం చేసిన తీర్మానం అతనికంటె ముందే మార్తాండమూర్తిగారిని చేరింది.

అక్కడనుండీ మండిపడుతున్నాడాయన.

ఆయన అహం దెబ్బతింది.

తనని నమ్ముకుని-తనతోకల్సి మదుపుపెట్టిన తోటివాళ్లకి ఏం సమాధానం చెప్పాలో అర్థంగావట్లే దాయనకి.

కొడుకు బెంగుళూరు వెళుతున్నాడు. అక్కడ ఫ్యాక్టరీలో స్ట్రైక్ జరుగుతుంటె సర్దటానికి అని మాత్రమే తెల్పింది. అలాగే అనుకున్నాడు. కానీ అక్కడ జరిగింది వేరు. స్ట్రైక్ ఆపేడు కాని-నష్టపోమేలా-దూరదృష్టిలేని తీర్మానం చేశాడు.

చంద్రం వచ్చేడు.

"ఏవిటి నువ్వు చేసిన నిర్వాకం?" తీక్షణంగా అడిగేడు.

చంద్రం తడబడలేదు. ఎప్పుడో ఊహించాడు. పెనుతుఫాను తప్పదని-సంజాయిషీ యివ్వవలసి వస్తుందని. పర్యవసానం కూడా ఊహించాడు.

అప్పటి దాకా భర్త కోపానికి కారణం ఏవిటో తెలియని వైజయంతి అడిగింది.

"ఏం చేశావురా?"

భార్య వంక ఏహ్యంగా చూశాడు మార్తాండమూర్తి. చంద్రంకి వత్తాసు భార్యేనని ఆయన గట్టి నమ్మకం.

చూచాయగా తెల్సిన కూతురు - కోడలు ఆయన వంక ఆసక్తిగా చూస్తున్నారు.

వాళ్లిద్దరి వంకా అయోమయంగా చూస్తున్నది వైజయంతి.

"చెప్పు" గంభీరంగా అడిగాడాయన.

చంద్రం మాట్లాడలేదు.

మార్తాండమూర్తి వెంటనే ఫోన్ చేశాడు. ఆయన పి.ఎ. సత్యమూర్తి పరిగెత్తుకు వచ్చాడు. "ఏవిటి వున్నపళంగా రమ్మని ఫోన్ చేశారు" అంటూ.

"జరిగింది-జరిగినట్లు తు.చ. తప్పకుండా చెప్పు." హుకుం జారీ చేశాడు.

సత్యమూర్తి పొల్లుపోకుండా చెప్పాడు.

చంద్రంకి లోగుట్టు అర్థమైంది.

చంద్రం వంక దిగ్భ్రాంతిగా చూస్తుండిపోయారు ఆడవాళ్లు ముగ్గురు. సత్యమూర్తి నోటివెంట విన్న ప్రతి అక్షరం వాళ్ల పునాదులు కదలించింది. కళ్లముందు ఏవేవో వికృత రూపాలు కన్పించి భయభ్రాంతుల్ని కలగచేశాయి.

చమటలు కక్కుతూ జారుకోబోతున్న సత్యమూర్తి వంక కసిగా చూశాడు చంద్రం.

చంద్రం నుంచి అందుకున్న పదివేల రూపాయలు కొండరాళ్లై- తల చితగ్గొడుతున్నట్లు అనిపించింది. ఊబిలో కూరుకుపోయి ఉక్కిరిబిక్కిరి అవుతున్న ఫీలింగ్ కల్గింది. తన గతి ఇక అధోగతేనని భావించాడు. ఉద్యోగం పోయి - పెళ్లాం బిడ్డలతో రోడ్లమీద పడ్డట్టే భావించాడు. రోడ్డుమీదకి వెళ్లినా వణుకు తగ్గలేదు. స్వేదం ఆరలేదు-సత్యమూర్తికి.

'ఎంత పని చేశావురా' అంది వైజయంతి.

"కొంప ముంచావు గదరా" అంది రాధిక.

"నా బ్రతుకు బస్టాండ్ చేశావు చంద్రం" అంది జానకి.

చంద్రం వాళ్లవంక నిర్వికారంగా చూశాడు.

"ఇప్పటికీ కోట్లు మూలుగుతున్నాయి. ఈ కాస్త దానికి కొంపేం మునుగుతుందో అర్థం కాలేదు."

"నష్టమేమిటి?" అన్నాడు.

" నష్టమా - నష్టమున్నరా!.... చెప్పులతో కొడతార్రా నమ్మినవాళ్లు. పునాదులు కదిలించావు కదరా దౌర్భాగ్యుడా" విరక్తిగా అన్నాడాయన.

## సిల్క్‌కు అరెస్టు వారెంటు



సినీనటి సిల్క్‌స్మితను పట్టుకొని... అక్టోబరు 3 లోగా కోర్టులో హాజరుపరచాలని మద్రాసు మెట్రోపాలిటన్ మేజిస్ట్రేటు అరెస్టు వారంటు జారీ చేశారట. మద్రాస్‌కు చెందిన యిద్దరు వడ్డీ వ్యాపారస్థులు స్మితపై కోర్టులో కేసు పెట్టారట. వారికి స్మిత యిచ్చిన చెక్కు బ్యాంకులో చెల్లకపోవటంతో ఆ వడ్డీ వ్యాపారస్థులు కోర్టు కెళ్ళారు. విచారణ సమయానికి హాజరు కావాలని సమన్లు పంపినా స్మిత కోర్టు కెళ్ళలేదట. దాంతో మేజస్ట్రేటు స్మిత ఎక్కడున్నా పట్టుకొని కోర్టుకు అప్పగించాలని పోలీసులకు ఉత్తర్వులు పంపారు. మరి స్మిత ఏ అజ్ఞాత ప్రదేశానికి వెళ్ళిందో?

భూగోళానికి సంబంధించిన వైచిత్ర్యాలను అధ్యయనం గావించేందుకై ఒక సంస్థ ఏర్పాటయింది. ఇందు భూగర్భ శాస్త్రవేత్తలు, భూగోళ శాస్త్రవేత్తలు, పరిసర వాతావరణ శాస్త్ర వేత్తలు, పురావస్తు శాస్త్రవేత్తలు, జాతి- నరవర్గ శాస్త్రవేత్తలు, తదితర నిపుణులు సభ్యులుగా ఉన్నారు. ఈ సంస్థ యితర శాస్త్రీయ సమస్యలతో బాటు క్రింది విషయాలపై ప్రత్యేక అధ్యయనాలు జరుపుతుంది.

–పురాతన పరిసర వాతావరణ, భూగర్భ చరిత్ర అధ్యయనాలు (పోలియో ఇకాలజీ) భూగర్భంలో గతంలో వాటిల్లిన ఉత్పాతాలు, భావి సూచనలు, తత్సంబంధిత అంశాలు)

## భూగోళ విచిత్రాలు

–జాతి– నరవర్గ శాస్త్రం – తొలినాటి మానవ చరిత్ర (ప్రాచీన నాగరికతా శిథిలాల అధ్యయనం) –నిక్షిప్త జీవశాస్త్ర అధ్యయనాలు (అంతరించి పోతున్న జంతువుల– మొక్కల అధ్యయనం)

అతి అరుదైన జీవజాలాలు, భూగోళ వైచిత్రాలకు సంబంధించిన వస్తు ప్రదర్శనశాల యీ సంస్థ ఆధ్వర్యంలో ఏర్పాటవుతుంది. వివిధ జాతులకు సంబంధించిన ప్రాచీన గాథలు, కల్పిత కథలు ప్రాచీన వ్రాతప్రతులు, అత్యంత అసాధారణ అంశాలకు సంబంధించిన ఛాయాచిత్రాలు, ప్రదర్శన యోగ్యమైన ప్రకృతి చిహ్నాలు, వివాదాస్పద ఘటనలు, ప్రాకృతిక చరిత్ర సమస్యల వంటివి యీ వస్తు ప్రదర్శనశాలలో ఉంటాయి.

"ఇందులో మనం నష్టపోయేది ఏమీ లేదు. న్యాయంగా వాళ్లకి చెందాల్సిన రూపాయి వాళ్లకి ఇచ్చాను. పునాదులు కదిలే ప్రశ్న ఏం వుంది."

చేసిన నిర్వాకం చాలుగాని- నాన్నగార్కి అప్పచెప్పి తప్పుకో-ఆయన పాట్లు ఆయన పడతారు" కఠినంగా, నిష్కర్షగా చెప్పింది రాధిక.

"కావాలంటే అధికారం వదులుకుంటాను. జరిగినదానికి రాజీపడే పనేలేదు. మిగతావన్నీ మీరు ఏలుకోండి. నాకవసరం లేదు" చెప్పాడు చంద్రం.

"ఛీ...ఛీ.... ఓ బిజినెస్ మాగ్నెట్ కడుపున చెడబుట్టావు. వ్యాపారస్తుల చరిత్రకే కళంకం తెచ్చావు. ఇంత చదువుకున్నావు తగలబెట్టనా! నీ ఆదర్శాల కోసం మమ్మల్ని బలి పశువుల్ని చేశావు" ఆయనకి ఆయాసం ఎగదన్నుకొచ్చింది. బి.పి. పెరిగింది. కుర్చీలో కూలబడ్డాడు.

"నాన్నా....ధర్మబద్ధమైన సంపాదన పదికాలాల పాటు వుంటుంది. అధర్మ విత్తం ఏదో ఒకనాడు సమూలంగా కొట్టుకుపోతుంది. కార్మికుల శ్రమని దోపిడీ చేసి మిద్దెలు కట్టాలనుకోవటం, సుఖభోగాలు అనుభవించటం నేరం. ఇది మన వర్గాన్ని పట్టి పీడిస్తున్న జాడ్యం. మన వరకూ మనం వదిలించుకుందాం. వాళ్ల వుసురు మనకి వద్దు. మన శ్రమకి తగ్గట్లు మనం తృప్తిగా హాయిగా బతుకుదాం. జన్మనిచ్చిన తండ్రి మీరు. మీకు పెట్టకుండా నేను తినను. త్రికరణశుద్ధిగా చెపుతున్నాను. పోయిన దానికి వగచి దిగులుపడవద్దు."

"అతి తెలివి చూపించకండి. దోపిడీలను గురించి-ధర్మాల గురించి మాట్లాడకండి. ఇక తప్పుకోండి. పరిపాలనా బాధ్యత మళ్లీ మామయ్యకి అప్పగించండి" అరిచింది జానకి.

"నావల్ల గాదు" కార్మికుల్ని దోచి కండలు పెంచలేను. రాజభోగాలు అనుభవించలేను. ఒక్క మాటలో చెప్పాలంటే బిచ్చగాళ్లం. వాళ్లు శ్రమచేసి - ఆ ఫలితం మన జోలెలో వేస్తున్నారు. వాళ్లు దయతో వేస్తున్న ముష్టిని పోగేసుకుని కులుకుతున్నాం.

"వాళ్ల దయాధర్మాలమీద ఆధారపడే అసంబద్ధపు బ్రతుకు మనకి వద్దు" నెమ్మదిగా నచ్చచెప్పబోయాడు.

నోర్మూయ్ రౌద్రంగా గర్జించేడు మార్తాండమూర్తిగారు.

"ఎవర్రా మనకి ముష్టి వేస్తున్నది. లక్షలు... లక్షల రూపాయల పెట్టుబడి పెట్టి వ్యాపారం చేస్తున్నాం. లాభాలు ఆశిస్తున్నాం. ఆర్జిస్తున్నాం. బ్రతుకుతెరువు కోసం మన పంచనబడి వున్నారు వాళ్లు. వాళ్లా మనకి ముష్టి వేసేది. వాళ్లేరా మన ఎంగిలి మెతుకు తినేది."

## ఈమార్పు నాతీర్పు

"అవును. ఎంగిలి మెతుకులు తినేది వాళ్లో మనమో ఆలోచించండి. నిరంతరం యంత్రంలా శ్రమపడి- తమ శ్రమ విలువలో కేవలం నాల్గోవంతు తీసుకుని- ముప్పాతిక వంతు మనకి ధర్మం చేస్తున్నారు గదు. మానవత్వంతో ఆలోచిస్తే అర్థమౌతుంది. మనమో- వాళ్లో ముష్టివాళ్లు. మీరు పెట్టిన మదుపుకి వాళ్లు ఏనాడో ముదుపు చెల్లించారు. వాళ్లు అమాయకులు కారు. లెక్కలు రాని చవటలు కారు. కేవలం విశ్వాసపాత్రులు."

"అయితే నువ్వు సంపాదించి తగలేసుకో. నా ఆస్తి నాశనం చెయ్యటానికి నువ్వెవరూ" అసహనం భరించలేక- ఉక్రోషంగా గర్జించేడాయన.

"అలాగే...బెంగుళూరు ఫ్యాక్టరీ తాతగారిది. నాకు హక్కుభుక్తం అది. ముందే ఆలోచించాను. ఏనాటికైనా మీరు మారతారని ఆశిస్తాను." చాలా నిర్భయంగా -తాను నమ్మిన పరిధిలో నిలబడి గట్టిగా చెప్పాడు చంద్రం.

మార్తాండమూర్తిగారి ఉక్రోషం ఆగలేదు. చంద్రం చెంప ఛెళ్లుమనిపించాడు. "నీ ముఖం నాకు చూపించకు" ఉగ్రనరసింహంలా వూగిపోయాడు.

చంద్రం ముఖం అవమానంతో మంకెనపూవు వర్ణం దాల్చింది.

"కార్మికుల్లో చైతన్యం వచ్చింది. వెల్లువలా పొంగుతారు వాళ్లు. పూచికల్లా ఎగిరిపోతారు మీరు" హెచ్చరించాడు.

అప్పటికప్పుడే లాయర్ని పిలిపించాడు మార్తాండమూర్తి. బెంగుళూరు ఫ్యాక్టరీ తప్ప, మిగతా తన ఆస్తిలో చంద్రంకి ఎటువంటి సంబంధం లేనట్లు విల్లు రాయించాడు.

సందులో సందు అన్నట్లుగా రాధికా - లాయరు లాలూచి పడ్డారు. ఫలితం నగదు- నగం రాధికకి దక్కాయి.

****************

మార్తాండమూర్తి కాళ్లు కాలిన పిల్లిలా తిరుగుతున్నారు ఇంట్లో. ఏం చెయ్యాలో పాలుబోవటం లేదు. ఫ్యాక్టరీలు స్తంభించాయి. కార్మికులు అసంతృప్తితో వీగిపోతున్నారు. తమ విధుల్ని సరిగ్గా నిర్వర్తించటం లేదు వాళ్లు. ఉత్పత్తిలో నాణ్యత పడిపోయింది. ఫలితంగా మార్కెట్ సగానికి సగం పడిపోయింది. అప్పుల వాళ్లు నిలవనీయటం లేదు. సాటి పెట్టుబడిదార్లు అనుక్షణం ఫోన్ చేసి దెప్పుతున్నారు. మరి కొందరైతే తమ పెట్టుబడి తమ కిమ్మని బెదిరిస్తున్నారు.

ప్రశ్నావళి:

# రచయిత్రి జవాబులు

శ్రీలంకలో ప్రస్తుత రాజకీయ పరిణామాల మీద, జాతి విద్వేషాలమీద పాఠకులు అడిగే ప్రశ్నలకు రచయిత్రి శ్రీమతి అడివి సూర్యకుమారి ఆంధ్ర సచిత్ర వారపత్రికలో జవాబులు యిస్తారు పాఠకులు తమ ప్రశ్నలను కార్డుమీద వ్రాసి -

"సాగర మథనం ప్రశ్నావళి", ఆంధ్ర సచిత్ర వారపత్రిక, గాంధీనగరం, విజయవాడ-3 అన్న చిరునామాకు పంపాలి వ్యక్తిగత ప్రశ్నలు, చొప్పదంటు ప్రశ్నలు వద్దని మనవి

- ఎడిటర్



## సాగర మథనం

చిన్నవి కొన్ని పూసలు అక్కడక్కడా పడి ఉన్నాయి

ఆ పూసల దండ తెంచబడింది

ఆ గడ్డి మీద రక్తం కూడా పడివుంది

రక్తం బొట్లు బొట్లుగా కారిన అథారాలక్కడ కన్పించాయి

రక్తం కంట బడగానే అతని కళ్ళెర్రబారాయి

అతనిక ఏ మాత్రం జాగుచేయక ఆ దారివెంటే నడిచాడు అతనా దారి చివరికంటా వెళ్ళే సరికి రోడ్డు వచ్చేసింది

రోడ్డెక్కాక ఎటు వెళ్లాలో తెలీలేదు

సిటీలోకి వెళ్లే దారిని వదిలి దానికి ఆపోజిట్‌గా వున్న వైపు నడకసాగించాడు

అతనలా నడిచి అరణ్య ప్రాంతం వైపొచ్చేశాడు

తెలిసిన దారికిలా అతనా అడవిలో నిర్భయంగా నడుస్తున్నాడు

చీకటి పడకముందే ఆ అడవంతా దట్టంగా చెట్లతో కప్పబడి చీకటిలా మారిపోయింది

దూరంగా నక్కలు వెళ్తున్నాయి పెద్ద పెద్ద పాములు చెట్ల కొమ్మల మీద నుండి జారుతూ బుసలు కొడ్తున్నాయి

లేళ్లు కుందేళ్లు ఆ బుసలికి దూర దూరంగా భయంతో పరిగెడ్తున్నాయి

అతను సరైన దారి చూసుకుంటూ ఏ జంతువు వాతాపడకుండా, అడుగుల శబ్దం పెద్దగా కానివ్వక, చేతిలో చిన్న పెన్ టార్చితో ముందుకు సాగుతున్నాడు

ఓ గంట అతనలా నడవడమే ధ్యేయమన్నంత స్థిరంగా వేగంగా నడిచాడు

అల్లంత దూరంలో మిణుకుమిణుకమనే వెలుతురు కన్పించింది

అది చూడగానే అతను మరింత వేగంగా ఉత్సాహంగా ముందుకెళ్ళాడు

ఆ కాంతి దగ్గరయ్యే కొద్ది అవి కొన్ని టెంట్స్‌గా అవుపించాయతనికి

రాక్షసుడెవరో పెద్దగా చేతులు చాచినట్లు ఊడలు దిగిన రెండు మద్ది చెట్లున్నాయక్కడ

చెట్లక్రింద టెంట్స్ వేసి ఉన్నాయి

షుమారుగా ఓ పాతికమంది దృఢకాయులు ఆ టెంట్స్ ముందు కన్పించారతనికి

ఓ మద్ది చెట్టు చాటు చేసుకొని అక్కడి వాతావరణాన్ని పరిశీలించాడు అగ్ని

ఒక జీపు, కొన్ని బుల్లెట్లు అడ్డదిడ్డంగా ఆపి ఉన్నాయి ముగ్గురు డ్రైవర్లు చెట్టుకి కట్టివేయబడి ఉన్నారు టెంట్స్ మధ్యలో పెద్ద నెగడు మండుతోంది ఆ ప్రక్కగా పెద్ద కార్పెట్ ఒకటి పరిచి వుంది దానిపై తినుబండారాలపళ్ళేలు, విస్కీగ్లాసులు, సీసాలు ఉన్నాయి

వాళ్లు బాగా తాగారు

తూలిపోతున్నారు

కళ్ళు-నెగడులోంచి పైకొస్తున్న మంటల ఎర్రదనాన్ని తలదన్నుతున్నాయి

కొందరు ఖాళీ పళ్లేలపై దరువులు వేస్తున్నారు ఒకరిద్దరు పాటలు పాడుతున్నారు

మరొకడు నోటి కొచ్చినట్లు పేలుతున్నాడు

అదే కార్పెట్‌పై వారందరికీ కొద్ది దూరంలో పడుకోబెట్టబడి వుందోఅమ్మాయి

ఆమె వైపు, డ్రైవర్లవైపు చూసి ఒకడు తూలుతూ తమ లీడర్ వైపు జరిగి అతని భుజం తడుతూ-

'మనం వీళ్ళని పట్టుకోవటం వలన లాభమేంటిగురూ?' అన్నాడు

'లాభనష్టాల విషయం మనదికాదు పైవాళ్ళది వీళ్లని తెమ్మన్నారు తెచ్చాం అంతవరకే మన డ్యూటీ ఆ మీద వాళ్ల డ్యూటీ' చెప్పాడు తాగుతూ లీడర్

'డ్యూటీ ఏమోగాని ఈ బ్యూటీని వదిలేదెలా?' అడిగాడతను, ఆమెను చూపుతూ

గుంపులో నుండి ఒకడు ఆమెను చూస్తూ 'ఔను ఈ బ్యూటీని వదలకూడదు మనక్కావాల్సిందే'

'ఔను కావాలి- బాగా తిన్నాం, తాగాం, మాంచి నిషామీదున్నాం కాబట్టి ఇప్పుడు మనకేంకావాలి?' అడిగాడొకడు

'ఖుషీకావాలి' కోరస్‌లా అన్నారంతా

లీడర్ వారివైపు చూస్తూ 'రేయ్? ఆ పిల్లకేమైనా అయితే బాస్ మనల్ని

### ఆదూర్ చిత్రానికి అవార్డు

ఆదూర్ గోపాలకృష్ణన్ చిత్రానికి వెనిస్ అవార్డు లభించింది

వెనిస్‌లో జరిగిన 47 వ అంతర్జాతీయ చలనచిత్రోత్సవంలో గోపాలకృష్ణన్ దర్శకత్వం వహించిన "మథిలుకల్" చిత్రం ఉత్తమచిత్రంగా ఎంపికయింది

అంతర్జాతీయ ఫిలింక్రిటిక్స్ అవార్డుకు ఎంపికయిన ఈ చిత్రం యునిసెఫ్ ఫిలిం బహుమతిని కూడా అందుకుంది మహమ్మద్ బషీర్ స్వీయచరిత్ర ఈ చిత్రానికి ఆధారం

# ఆహారం x వ్యాయామం = ఆరోగ్యం



మనిషి ఆరోగ్య రీత్యా శరీరాన్ని ఒక క్రమ పద్ధతిలో వుంచుకునేందుకు వ్యాయామం ఎంతైనా అవసరం

మనం తీసుకునే ఆహారం శరీరానికి యిందనం కాగా, ఆ యింధనాన్ని ఉపయోగించి చేసే వ్యాయామం శక్తి నిస్తుంది ఇవి రెండూ మనిషి ఆరోగ్యాన్ని సమతలంగా వుంచుతాయి ఎక్కువ ఆహారం తిని- తక్కువ వ్యాయామం చేసినా, తక్కువ ఆహారం తిని ఎక్కువ వ్యాయామంచేసినాఆరోగ్య రీత్యా అనేక సమస్యల్ని ఎదుర్కోవాల్సి వస్తుంది

మన శరీరాన్ని వేడిగా వుంచటం ద్వారా అనేక క్యాలరీల శక్తిని కోల్పోతున్నాం. అనేకరకాలైన ఆహార పదార్థాలు యిప్పుడు మనకు అందుబాటులో వుంటున్నాయి పోషకాహార విలువలు తెలుసుకోకుండా భుజించినట్లయితే అవి మనిషి ఆరోగ్యాన్ని దెబ్బతీస్తుంది అంతే కాకుండా కూర్చొని చేసే ఉద్యోగాలు, పరిశ్రమల్లో ఆటో మేటిక్ యంత్రాలు, వాహనాల మీద తిరగటం, బాగా క్రొవ్వు పదార్థాలను తీసుకోవటం మూలంగా మనకు శక్తి కొరవడుతోంది

ఆహారాన్ని అదుపు చేస్తూ రోజూ వ్యాయామం చేసినట్లయితే మన శరీర బరువు సమాన స్థాయిలో వుండటమే కాదు డయాబిటీస్, హృద్రోగాల నుంచి మనల్ని కాపాడుతుంది

ఎక్కువ శరీర బరువు మూలంగ ఉత్పన్నమయ్యే కొన్ని మానసిక ఒత్తిడులను కూడా వ్యాయామం ద్వారా తగ్గించవచ్చునట

క్రొవ్వు పదార్థాలను తీసుకోవటం మూలంగా అనేక తీవ్ర సమస్యలు ఎదురవుతాయి శరీర బరువు ఎక్కువగా వుండి దానికి తోడు, బిపి, త్రాగుడు, పొగత్రాగటం వంటి అలవాటున్న వారికి అది మరింత ఆరోగ్యానికి హానికరంగా పేర్కొంటున్నారు దురలవాట్లు సున్నితమైన అవయవాలైన గుండె, ఊపిరి తిత్తులు వంటి వాటిపై తీవ్ర ప్రభావాన్ని కలుగజేస్తాయి అది మనిషి శక్తితో పాటు సామర్థ్యాన్నికూడాతగ్గించి



వేస్తుంది

పోషకాహార విలువలున్న ఆహారాన్ని మితంగా భుజిస్తూ, క్రమం తప్పకుండా వ్యాయామం చేసినట్లయితే శరీర బరువును తగ్గించుకోవచ్చు

వ్యాయామం చేయటం వల్ల ఒనగూడే ప్రయోజనాలు అనేకం!

అది శారీరక పుష్టిని శక్తిని పెంపొందించటమే కాకుండా మానసిక వ్యధలపై సత్వర ప్రభావాన్ని చూపుతుంది వ్యాయామం మానసికాందోళనల నుంచి మనిషిని దూరంగా వుంచుతుంది ఉద్రిక్తతలను తగ్గిస్తుంది క్రమం తప్పకుండా వ్యాయామం చేసే వారికి నిద్ర మెరుగవుతుంది. తలనొప్పి వంటి బాదలు తగ్గుతాయి ఒళ్ళు నొప్పులు దూరమవుతాయి మానసికంగా ప్రశాంతత లభ్యమవటమే గాకుండా, శారీరకంగా అదికశక్తి లభిస్తుంది

క్రొవ్వు పదార్థాలు తగ్గించి తాజా పండ్లు, కూరలు, పప్పుదినుసులు తీసుకోవటం ఆరోగ్యానికి ఎంతైనా మంచిది

మితాహారాన్ని తీసుకుంటూ క్రమం తప్పకుండా వ్యాయామం చేయటం ఆరోగ్యవంతమైన జీవితానికి మైలురాయిగా పేర్కొనబడుతోంది మరి మనం కూడా యిదీ పాటించి మన ఆరోగ్యాన్ని కాపాడుకుందాం!

–తిలక్

# ముడుపు

హోతా పద్మినీదేవి

"ఈ ఏడాది శ్రీరామ నవమికి కళ్యాణం మనం చేద్దామండీ" అంది శ్రీమతి భోజనం వడ్డిస్తూ. తన కేదైనా ఆపద వాటిల్లినప్పుడో, ఏదైనా కోరిక కలిగినపుడో ఆపద తీవ్రతను, కోరిక స్థాయిని బట్టి కొబ్బరికాయ నుంచి కొండ యెక్కి వస్తాననడం దాకా మొక్కుకోడం నా శ్రీమతికి రివాజు. ఈసారి కళ్యాణం చేస్తాననగానే ఏదో పెద్ద కోరికే కోరుకుందన్నమాట అనుకుంటూ, అడిగాను.

"కళ్యాణమే! ఏం మొక్కుకున్నావేమిటి?"

"అబ్బాయి పెళ్లికి ఒప్పుకుంటే, కళ్యాణం చేయిస్తానని మొక్కుకున్నాను."

మా ఏకైక పుత్రుడు వరప్రసాద్‌కి పెళ్లి పట్ల విముఖత్వమూలేదు. పెళ్లి వయసూ దాటిపోలేదు. అలాంటిది వాడి పెళ్లి కోసం మా ఆవిడకి ఎందుకంత ఆరాటమో అర్థం కాలేదు నాకు.

"బాగుంది అబ్బాయి పెళ్లికోసం దేముడి కళ్యాణం చేయిస్తావన్నమాట" అన్నాను కాస్త అసంతృప్తిగా, మనసులో ఎంత ఖర్చవుతుందో అంచనా వేస్తూ.

"పంచప్రాణాలూ వాడిపైనే పెట్టుకుని బ్రతుకుతున్నాను. వాడు పెళ్లి చేసుకుని, పిల్లపాపలతో కళ కళలాడుతూ వుండాలనే నా ఆశ నేను బ్రతికి వుండగా తీరుతుందనుకోలేదు. అంతా ఆ ఏడుకొండల వాడి దయ" అంది భక్తిగా చేతులు జోడిస్తూ.

"శ్రీరామ కళ్యాణం అన్నావుగా! మళ్లీ ఏడుకొండలవాడి దయ అంటావేమిటి?" అన్నాను కాస్త కంగారు పడి మళ్లీ తిరుపతిలో కూడా కళ్యాణం అంటుందేమోనని.

"కంగారు పడకండి నేను మొక్కుకున్నది శ్రీరాముడికే, శ్రీనివాసుడికి కాదు" అంది నా మనసు గ్రహించినట్టు చిరుకోపంగా.

"సరే! ఏ దేముడి దయవల్లనైతేనేం అబ్బాయి పెళ్లికి ఒప్పుకున్నాడుగా. నీ మనసులో కోరిక నెరవేరాక మొక్కు తీర్చకపోతే, శ్రీరామచంద్రమూర్తి వూరుకున్నా నువ్వు వూరుకోవు" అన్నాను.

శ్రీమతి ఉత్సాహంగా నాలుగు మూలలా పసుపు రాసిన ఒక కాగితం మడతని నాకు అందించింది.

"ఇదుగో! కళ్యాణానికి కావలసిన సామాన్లలిస్టు. అవధానిగారు యిచ్చారు."

మడత విప్పి చదవడం మొదలు పెట్టాను.

మంగళసూత్రాలు
మెట్టెలు
ఉత్తరజంధ్యాలు

మధుపర్కములు చదువుచుండగానే శ్రీమతి అందుకుంది.

"మంగళసూత్రాలు ఓ పావుకాసులో చేయిద్దామండీ! మరీ చిన్నవైతే నలుగురిలోనూ ఏం బాగుంటుంది?"

"సరే" అన్నాను.

"కళ్యాణం రోజున మన బంధువుల్ని నలుగురిని పిలిచి భోజనం పెడదామండీ!"

"దేముడి పెళ్లికి అందరూ పెద్దలే అన్నట్టు మనకి ఊరంతా బంధువులే! కానివ్వు. తప్పుతుందా?"

"మీ కసలు యిష్టంలేదులా వుంది. నేనేం చెప్పినా పుల్ల విరుపుగా యేదో ఒకటి మాట్లాడుతారు" కినుకగా అంది.

"నా కిష్టం లేదంటే..." నేనేదో అనబోతుండగానే, కాలింగ్ బెల్ మ్రోగింది.

శ్రీమతి నాతో తగవులాడే కార్యక్రమాన్ని తాత్కాలికంగా వాయిదావేసి తలుపు తెరవడానికి వెళ్లింది.

రెండు నిముషాల తర్వాత, ముఖం చిట్లిస్తూ తిరిగివచ్చింది.

"ఎవరో బ్రాహ్మణుడుట కూతురి పెళ్లికి సహాయం చెయ్యమంటూ వచ్చాడు. ఇదోరకమైన యాచన! రెండు రూపాయలిస్తాను, లేకపోతే వదిలేలాలేదు. తెల్లారిన దగ్గరనుంచి రాత్రి వరకు వెధవ ముష్టివాళ్లతో చస్తున్నాను విసిగిపోయి."

ఆమె ప్రతిపాదనను సమర్థిస్తున్నట్టుగా 'ఇదుగో' అంటూ జేబులో నుంచి రెండు రూపాయల కాగితం తీసి అందించాను. ఇంచుమించు ప్రతిరోజూ బస్‌స్టాండ్‌లోనో, ఆఫీసులోనో, ఇంటి దగ్గరో అలాంటి వ్యక్తులు చాలామందే తారసపడుతూంటారు నాకు.

తిరుపతి వెళ్తున్నామనో, బీదబ్రాహ్మణ యువకుడికి ఉపనయం చేస్తున్నామనో, పేద యువతి పెళ్లి అనో ఎవరో ఒకరు యాచనకు వస్తూనే వుంటారు.

తిరుపతి అనగానే దేముడంటే భయం వలనో, భక్తివలనో, దానం ఆనందంగా చేసే నేను చివరి యిద్దరికీ రూపాయి యిచ్చేచోట పదిపైసలు అయిష్టంగానే యిస్తాను. అదోరకమైన యాచన అని నా నమ్మకం.

చేతిలో రెండు రూపాయలతో వెళ్లిన శ్రీమతి పెద్దగా గొంతు పెంచి అరుస్తుంటే నిటారుగా అయ్యాను.

"మేం వందరూపాయలిస్తే దానితో మీ అమ్మాయి పెళ్లి అవుతుందా? పోనీ, వెయ్యి! రెండువేలు! ఆశకి కూడా అంతువుండాలి! ఇచ్చిన దానితో తృప్తి పడి వెళ్లండి."

ఆ వచ్చిన వ్యక్తి రెండు రూపాయలతో తృప్తిపడి వుండడు. నేను సీన్‌లోకి వెళ్లనిదే లాభంలేదనిపించింది.

ఏమిటంటూ వెళ్లాను.

ఎదురుగా చూసి, నలిగిన దుస్తులతో దైన్యం నిండిన ముఖంతో, మూర్తీభవించిన దారిద్ర్యంలా వున్నాడొక వృద్ధుడు.

నేను కోర్టుకి వెళ్లడానికి తయారవసాగాను. క్రిమినల్ లాయర్‌గా వూళ్లో పేరు ప్రఖ్యాతులార్జించిన నాకు పిత్రార్జితమైన మేడ, పల్లెలో పది ఎకరాల పొలం వున్నాయి. పట్టిన కేసులో విజయం తప్ప అపజయం ఎరుగని నాకు ఆదాయమూ పుష్కలంగానే లభిస్తోంది.

శ్రీమతి ముఖంలో విసుగుదలకి ఆయన నొచ్చుకుంటున్నాడు.

"ఇష్టమైతే తీసుకోండి-లేకపోతే లేదు. మీ సొద వినే తీరక నాకులేదు" శ్రీమతి నిష్కర్షగా చెప్పేసి తలుపు వేసెయ్యబోయింది.

ఆయన దృష్టి నాపై పడింది. చేతులు జోడిస్తూ గాద్గదికంగా వున్న స్వరంతో అన్నాడు.

"బాబూ! తమరైనా నాపై దయ చూపండి, బీద బ్రాహ్మణుడిని, పిల్ల పెళ్లి కుదిరింది. నా భార్య మెడలో మాంగల్యం అమ్మి కట్నం డబ్బు ఎలాగో సమకూర్చుకోగలిగాను. మంగళసూత్రం చేయించడానికి, పెళ్లి ఖర్చుకి డబ్బు లేదు. రిజిస్టర్ మేరేజ్ చేసుకోమంటే వాళ్లు అంగీకరించలేదు. ఏదో మీకు తోచిన సహాయం చేస్తే కన్యాదాన ఫలం దక్కుతుంది."

ఆ ముఖంలోని దైన్యం తెచ్చిపెట్టుకున్నాడిలా, ఆ విషాదం నటనలా అన్పించింది నాకు.

"రెండు రూపాయిలు కాకపోతే, మరో రూపాయి తీసుకోండి" విసుగ్గా అంటూ మరో రూపాయి తీసి ఆయన ముందుకి జాపాను.

ఆయన నిస్పృహగా నిట్టూరుస్తూ అది అందుకుని, వెళ్లిపోయాడు.

"ఒళ్లువంచి కష్టపడనక్కర్లేకుండా డబ్బు సంపాదనకి యాచన సులువైన మార్గం అయింది అందరికీ" శ్రీమతి గొణుక్కుంటోంది.

# భయం దాని పర్యవసానం



విజ్ఞానవేత్తలు మెదడులో రసాయనక మార్పులు చెందడానికి ఒకే ఒక్క క్షణంలో జరిగిన భయానక సంఘటన చాలని తాము ఇటీవల కనుగొన్న ప్రయోగ ఫలితాలని ఆధారం చేసుకొని ఒక నిర్ణయానికి వచ్చారు ఈ మార్పు ప్రభావం ఆ వ్యక్తి మెదడులోని అడ్రినలిన్ కంపనాలపై సంఘర్షణ ఎదుర్కొన్న చాలా రోజుల తరువాత వరకూ వుంటుంది

కాబట్టి ఒకసారి సంఘర్షణకి లోనైన వ్యక్తి తరువాత ఏ కొద్దిపాటి ఒత్తిడికైనా అమితంగా కదిలిపోతూంటాడు. యుద్ధంలోని సిపాయిల, నేరానికి బలైన వ్యక్తుల మానసిక రుగ్మతలను కనుగొనడానికి శాస్త్రవేత్తల పరిశోధనలు బాగా వుపకరిస్తాయి

భయానక సంఘర్షణని ఎదుర్కొన్న వ్యక్తికి ఆ నిమిషంలో అదుపు తప్పిన జీవితం నిరాశాజనకంగా, భయంకరంగా కనిపిస్తుంది ప్రాణాధికంగా ప్రేమించిన వ్యక్తి మరణం కానీ, ఆర్థిక ఇబ్బందులు కానీ వాస్తవానికి బాధాకరమైనటు వంటివైనప్పటికీ అవి శారీరకంగా ఎక్కువ మార్పులు తేలేవు కానీ భయానకమైన సంఘర్షణకి గురైన వ్యక్తి శరీరంలో అనేక మార్పులు సంభవిస్తాయి

## సంఘర్షణ ప్రభావం

ఒక పోరాటంలో ఏర్పడ్డ భీతి కానీండి. బాల్యంలో అనుభవించిన చేదు అనుభవాల జ్ఞాపకాలు కానీండి లేదా ఒక ప్రమాదంలో చిక్కుకున్న ఒత్తిడిల ఫలితంగా అదే విధమైన శారీరక ప్రభావానికి గురవుతారు

సంఘర్షణ ఎంత అధికమయితే భావి జీవితంలో ఎదుర్కొనే ఒత్తిడి కూడా అంతే అధికంగా వుంటుంది అయితే ఒకే విధమైన సంఘర్షణ ప్రభావం ఇద్దరి వ్యక్తులపై ఒకే విధంగా వుండదు ఒకరిపై దీని ప్రభావం ఎక్కువగా లేకపోవచ్చు వేరొకరిపై దీని ప్రభావం అధికంగా వుండి పర్యవసానం విషమంగా వుండొచ్చు సంఘర్షణకి గురైన తరువాత దాని యొక్క లక్షణాలు ఒక్కోసారి 40 ఏళ్ల తరువాత కూడా కనిపించవచ్చు ఈ లక్షణాలు ఒక్కోసారి స్వాభావికంగా సమసిపోవచ్చు లేదా వైద్యం అవసరం రావచ్చు

## మెదడులో మార్పులు

మెదడులో మార్పులు మూడు విధాలుగా జరుగుతాయి

అత్యవసర పరిస్థితిలో శరీరాన్ని చైతన్యవంతం చేయడానికై మెదడులో వుద్భవించే ద్రవాలను క్రమబద్ధం చేసే అవయవం లోకస్ సెర్యులస్ ఘర్షణలో ఈ లోకస్ సెర్యులస్‌లో ఎక్కువ మార్పు జరుగుతుంది ఈ అవయవం అతి చురుకై అదురు పుట్టకుండా వుండేటటు వంటి స్థితిలో మెదడులో రసాయనాలను ఎక్కువగా స్రవిస్తుంది

కార్టికాట్రోపిన్ అనే హార్మోను అత్యవసర పరిస్థితి నెదుర్కోవడానికై ఎక్కువ స్రవిస్తుంది ఇది సరిగా పనిచేయకపోతే ఈ ద్రవం అమితంగా స్రవించి అత్యవసర పరిస్థితిని ఎదుర్కొనే శక్తిని శరీరానికి కలుగజేయదు అదే జరగకూడనిది



మెదడులోని ఒపిఆయిడ్ వ్యవస్థ బాధాకరమైన అనుభూతులను తగ్గిస్తుంది సంఘర్షణకి లోనైనప్పుడు యిది కూడా ఎక్కువ చురుకుగా పని చేస్తుంది దీని



ఫలితంగా భావ శూన్యత ఏర్పడి సున్నితమైన అనుభూతులను అనుభవించే శక్తిని కోల్పోతారు

## ఉపశమనం

ఈ పరిశోధనల మూలంగ సంఘర్షణకి గురై బాధపడుతున్న వ్యక్తులకు కొంత ఉపశమనం కలిగించవచ్చని పరిశోధకులు ఆశిస్తున్నారు

ఉపశమనానికి కొన్ని మందులు వున్నప్పటికీ వాటి వుపయోగం చెప్పుకోతగినంతగా లేదు

పరిశోధకులు రెండు ఎలుకలకు ఒక్కే విధమైన విద్యుత్ ఘాతాన్ని యిస్తే మొదటి ఎలుక బాధక ఓర్చుకొని విద్యుత్ పంపించే సాధనాన్ని నెట్టివేసింది వేరొక ఎలుక విద్యుత్ సాధనాన్ని నెట్టివేయలేక నిస్సహాయంగా బాధకి కొట్టుకుంది రెండవ ఎలుక మెదడులో రసాయన మార్పులను చూపిస్తాయి మనుష్యుల విషయంలోనైనా ఇదే జరుగుతుంది

- ప్రమీల

పెడా బాదాలన్నంత ఆవేశం వచ్చింది

"పాపం! బాబు ఆకలికి ఏడుస్తుంటే పాలు పోశాను నాన్నగారూ!"

"అయితే మాత్రం! మనం డబ్బిచ్చాం కదుట్రా! ఈశ్వరుడికి అభిషేకం కోసం తీసికెళ్తున్న పాలని దానికి దానం చేసావా? ఎక్కడికొచ్చినా ఈ ముష్టివాళ్ళ గోల తప్పదు పసిపిల్లలని అడ్డుపెట్టుకుంటారు వెధవలు" శ్రీమతి స్తోత్రం మొదలుపెట్టింది

"శివలింగం పాలు త్రాగుతుందా? పాపం! పాప చూడు ఎలా త్రాగుతోందో! ఎంత ఆకలి వేసిందో!" ప్రసాదు జాలిగా అన్నాడు

ఆ రోజు వాడు చేసిన పనిని చిన్నతనపు చేష్టగా తీసిపారేసినా, వయసొచ్చేకొద్దీ వాడేమిటో అర్థం అయింది

రకరకాల పిండివంటలు చేసి దేముడికి నైవేద్యం పెట్టే వాళ్ళమ్మని అడిగేవాడు వేళాకోళంగా

"నువ్వు చేసిన పూర్ణం బూరెలని దేముడు తిన్నాడా?"

"నోర్మూయ్యరా! దేముడితోనా వేళాకోళం?" వినుక్కునేది శ్రీమతి

"గిన్నెలు తోమే పనిమనిషికి ఒక్కటంటే ఒక్క లడ్డూ కూడా పెట్టవు కాని, దేవుడికి యిన్ని రకాల వంటలు ఎందుకు నివేదన చేస్తున్నావు? ఓహో! దేముడు నోరు తెరిచి ఎలాగూ తినలేడు అవన్నీ మనకే వుంటాయి మనమే తినవచ్చు అనా?"

అలాంటి ప్రసాదు వాడు పెళ్ళికి ఒప్పుకుంటే, శ్రీ రామ కళ్యాణం చేస్తానని వాళ్ళమ్మ మొక్కుకుందని తెలిస్తే ఎంత గొడవ చేస్తాడో వూహించగలను

"ఇంక మాట్లాడకు" అని కళ్ళతోనే సైగ చేసాను శ్రీమతికి ఏ కళనుందో ఆవిడా వూరుకుంది

మరునాడు ప్రసాదు ఆఫీసుకి వెళ్ళడానికి తయారై స్కూటర్ బయటికి తియ్యబోతుండగా అన్నాను

"నా కారులో దింపేస్తాను రారా!"

'సరే పదండి" అన్నాడు

ఇద్దరం బయలుదేరాం దారిలో ఒక నర్సింగ్ హోమ్ ముందు కారు ఆపించాడు మావాడు

"దేనికిరా? హాస్పిటల్‌లో ఏం పని?"

"నిన్న చెప్పానే ఆటో క్రింద పడినాయన్ని ఈ నర్సింగ్ హోమ్‌లో చేర్పించాను ఒకసారి చూసిపోదాం"

నేను వాడిని అనుసరించాను

బెడ్ మీద పడుకుని వున్న ఆ వ్యక్తిని చూస్తూనే నా కాళ్ళకి బంధాలు పడ్డట్టు ఆగిపోయాను తలకి కట్టుతో వున్న ఆ వ్యక్తి యెవరోకాదు నిన్న కూతురి పెళ్ళికి సాయం చెయ్యమంటూ వచ్చిన అతను

నా గుండెల్లో ఏదో కలుక్కుమన్న బాధ కలిగింది ఆయన ముఖంలో నన్ను గుర్తుపట్టిన భావం కదిలింది చప్పున చేతులు జోడించాడు

"నమస్కారం"

ప్రతినమస్కారం చెయ్యడానికికూడా అశక్తుడినయ్యాను

"ఎలా వుంది?" మావాడు అడుగుతున్నాడు

"పెద్ద దెబ్బేమీ కాదు బాబూ! డాక్టర్‌గారు యివాళ ఇంటికి వెళ్ళిపో



గొంగ్రుగప్పలా అరుస్తుంటే నేనేం చెయ్యాలి?- అసలే ఆఫీసు ఫైల్సు పెండింగని నేనేడుస్తుంటే " అందామనుకున్నాడు కాని భూజాత వాలకానికి భయమేసింది

సంగతేమిటని ప్రశ్నించాడు కళ్ళతోనే

"ఆ ఉత్తరం చదవమన్నానా." ఆజ్ఞాపించింది ఇంచుమించు

"ఏమిటో ఉత్తర విషయాలు " గొణుక్కుంటూ ఉత్తరం విప్పాడు

"పితృ సమానులు శ్రీ పావనమూర్తి బాబాయి గార్కి నమస్కరించి వ్రాయునది

నా రూమ్మేటు- అంటే మీ కూతురు నళిని నిన్న సాయంత్రం బాత్రూంలో పడిపోయింది వెంటనే డాక్టర్ వద్దకు తీసికెళ్ళాం ఆవిడకు నెలతప్పి మూన్నెళ్ళిందని తెల్పేశారు డాక్టర్ గారు పెళ్ళి కాకముందే తల్లి కావడం బావుండదని అబార్షన్ చేయించుకొమ్మని మా హాస్టల్ మేట్సుమంతా చెప్పాం నళిని ససేమిరా వినలేదు ఇప్పుడు దాని ఆరోగ్యం బాగానే ఉంది

ఇట్లు

మీ కూతురు సమానురాలు

సుగుణ"

రఘురాం నరాల నెవరో ముక్కలు ముక్కలు చేసి కుప్పలు వేసినట్టనిపించింది కాస్సేపతని మెదడు పంజెయ్యలేదు కళ్ళ చివర ఎర్ర జీర నాట్యమాడింది కోపం, ఆవేశం, ఆరాటం అన్నీ ఒకేసారి ఆవహించి కుర్చీలోంచి లేసేసాయి

విషాదం వీణానాదం చేసింది ఇల్లంతా మౌనం రాజ్యమేలింది

కాస్సేపు అందరి హృదయాల్లో ఆవేదన బజార్లో మొహమెత్తుకు తిరగ్గలమా?ఎంత పంజేసింది? కుటుంబ



# పేవనేహాలు

సీరియల్ ప్రారంభం!

వాడవల్లి విజయలక్ష్మి

ఉదయం నుండి ఆకాశం మేఘావృతమై వుంది. నల్లని మబ్బులు వడివడిగా ఆకాశమంతా పర్రుచు కుంటున్నాయి. సన్నని వాన తుంపర ప్రారంభమైంది. చల్లగా వున్న ఆ వాతావరణంలో రావుకు మాత్రం అశాంతిగానే వుంది.

డ్రాయింగ్ రూమ్‌లో రిలాక్సింగ్ ఛైర్‌లో కూర్చుని కిటికీలో నుండి బయట వాతావరణం చూస్తున్న రావు జ్యేష్టం తర్వాత ఆషాఢంలోని చల్లదనాన్ని ఆస్వాదించే స్థితిలో లేడు.

పేపర్ వెయిట్ క్రింద పెట్టిన ఉత్తరం చిరుగాలికి కదులుతూనే వుంది. స్పష్టా స్పష్టంగా అక్షరాలు కనపడుతూ కలవర పెడు తున్నాయి.

"బాబూ కాఫీ" వంట మనిషి సీతమ్మ ఇచ్చిన కప్పు అందుకున్నాడు.

"ఏం బాబూ ఈ రోజు అట్టా వున్నారు! "ఆఫీసు లేదా!" సానునయంగా అడిగిన సీతమ్మ ప్రశ్నకు చిరునవ్వుగా "ఈ రోజు ఆదివారం" అని గుర్తు చేశాడు.

"అమ్మాయిగారు వూరెళ్లాక మీ మనసేమీ బాగున్నట్టు లేదు బాబు. అన్నం కూడ సర్గిగ్గా తినడం లేదు" బాధ్యతగా హెచ్చరించింది.

"అమ్మాయిని ఇన్ని రోజులు ఎన్నడూ వదిలి వుండలేదు సీతమ్మా! శకుంతల కూడ బెంగపడి వుంటుంది" ఆవేదనగా అన్నాడు రావు.

తండ్రీ కూతుళ్ల అనుబంధానికి అర్థం చెప్పుకోలేక వెను తిరిగింది సీతమ్మ వంట గదిలోకి.

రావు టేబుల్ మీద ఉత్తరాన్ని మడిచి జేబులో పెట్టుకున్నాడు. బయట వాతావరణం కూడ తేలిక పడింది. సన్నని వాన తుంపర కూడ తగ్గింది. మనస్సులో అలజడికి రావు చేసుకున్న నిర్ణయం కాస్త తేరిపి నిచ్చింది. మనస్సు తేలిక పడింది. గదిలోకి వెళ్ళి రెండు జతల బట్టలు సూటుకేసులో సర్దాడు. బీరువా అడుగున భద్రంగా దాచి వుంచిన డైరీలు కూడ పెట్టుకున్నాడు.

ఆఫీసులో అసిస్టెంటుకు ఫోను చేసి, "రెండు రోజులు నేను వూళ్లో వుండను, అన్ని వ్యవహారాలు జాగ్రత్త" ఆఫీసు వర్కు అప్పగించాడు.

మధ్యాహ్నంభోంచేస్తూ, "సీతమ్మా నేను అమ్మాయి వూరికి వెళ్తున్నాను, ఇల్లు జాగ్రత్త" చెప్పాడు.

"సరేబాబూ" తలూపింది.

అమ్మాయి వెళ్ళి నెల కూడా కాలేదు. అప్పుడే అంత బెంగా అనుకుంది సీతమ్మ.

సందడితో నిండు చేసే శకుంతల ఆ యింట్లో లేకపోవడం చాలా చిన్న బోయింది.

పెళ్లివారి యిల్లులా వుంది స్టేషన్. ట్రైను 1 గంట లేటు. వచ్చే వాళ్లను రిసీవ్ చేసుకోవడం కోసం కొందరు, వెళ్లే వాళ్లకు సెండాఫ్ ఇచ్చేందుకు, మరికొందరు. అంతా హడావుడిగా వుంది. రావు అక్కడే వున్న బల్లమీద కూర్చున్నాడు. చేతిలో సూటుకేసు ప్రక్కన పెట్టాడు. అక్కడ సందడి రావుకేమీ పట్టలేదు. అనంత్ సంతకంతో నల్లని అక్షరాలతో వున్న ఆ ఉత్తరం లోని సారాంశం శకుంతల సంసార జీవితానికి చితి రగిల్చే ప్రయత్నానికి సంకేతం. ఎంతో మంచివాడనుకున్న అనంత్ అంత కఠినంగా వుంటాడనుకో లేదు. పెళ్లి అయి 1 నెల పూర్తవలేదు. అప్పుడే అనుకోని అవాంతరాలు. రావు ఆలోచనల సరళి సాగుతూనే వుంది.

రైలు ఆగమనానికి సంకేతంగా గంట వినపడింది. సూట్‌కేస్ పుచ్చుకుని ముందుకు వచ్చాడు.

ఆగిన రైల్లో కంపార్ట్‌మెంటులో ఖాళీ చూసుకుని కూర్చున్నాడు రావు. జనరల్ కంపార్ట్‌మెంట్ కావడంతో తొక్కిసలాటతో హడావుడిగా వుంది. రావుకు అటువంటి ప్రయాణాలు చాలా

సరదాగా ఉంటాయి. వంటరి తనాన్ని గుర్తు రానీయక చైతన్య వంత మైన ప్రజానీకానికి దగ్గరకు తీసుకు వెళ్తుంది. రకరకాల వ్యక్తుల కలయిక విభిన్న సంస్కృతులు కల మన దేశ ఔన్నత్యానికి ప్రతీక అన్పిస్తూంటుంది రావుకు.

ఎదురుగా వున్న సీటులో కూర్చున్న ముసలాయన ఏదో మాట్లాడుతూనే వున్నాడు. ఆయన మాటలు ఎంత విన్నా విసుగని పించడం లేదు. ప్రక్కనే వున్న వ్యక్తికి విషయాలు విడమర్చి చెప్తున్నాడు. ఆయన సంస్కృత పాండిత్యానికి అందరూ అచేతనులై వింటున్నారు. మహాకవి కాళిదాసు "అభిజ్ఞాన శాకుంతలం"నకు తెలుగు భాష్యం అతి మధురంగా వర్ణనలతో వివరణ చేస్తూ ఆ మహా కావ్యానికి క్రొత్త అందాలను సంతరించి పెడుతున్నాడు. శకుంతలను పంపే సమయంలో కణ్వుడి ఆవేదన హృద్యంగా వర్ణించి వినే వాళ్ల కళ్లు చమరింప చేశాడు.

ఎంత చక్కటి భావన! ప్రాణం కంటె మిన్నగా పెంచిన ఆ తండ్రికి కూతురు దూరం కావడం ఎంతటి సర్వసంగ పరిత్యాగుల నైనా కదిలించక మానదు. కరిగి పోతున్న కాలం ఆ మహాకావ్యం తాలూకు జ్ఞాపకాల మరుగున మిగిలి పోయింది. ఫలితంగా చాలా ప్రయాణం తనకు తెలియ కుండానే జరిగి పోయింది రావుకు. దిగేందుకు సిద్ధపడుతున్న ముసలాయనను హృదయ పూర్వకంగా అభినందించాడు రావు.

"మేష్టారూ! మీరు చెప్పిన విషయాలు ఎంతో గొప్పవి! సాహిత్య విలువలు దిగజారి పోతూన్న ఈ రోజుల్లో కావ్య చర్చలు ప్రతిభతో చెయ్య గలిగిన మిమ్మల్ని కలుసుకోవడం నా అదృష్టం."

"ఎన్నో సంవత్సరాల క్రితం వ్రాయబడినా ఆ కావ్యం తాలూకు పరిమళాలు ఇంకా గుబాళిస్తూనే వుంటాయి. వాటిని ఆస్వాదించేందుకు మన మెప్పుడూ సిద్ధంగానే వుండాలి. అందులో నా కృషి బహు తక్కువ." వినమ్రంగా నవ్వుతూ చెప్పాడు.

ఆగిన స్టేషన్‌లో దిగిపోయాడు. రావు





వాచీ చూసుకున్నాడు. ఇంకా రెండు గంటల సమయం గడిస్తే కాని విశాఖపట్నం రాదు. ముందుకు పరుగెడుతున్న రైలు వెనక్కు జరిగిన కాలం మిగిల్చిన జ్ఞాపకాలు రేపుతూంది. ఆలోచనల మధ్య రైలు గమ్యం చేరింది.

రణగొణ ధ్వనుల మధ్యన విశాఖపట్నం స్టేషన్ బయటకు వచ్చాడు రావు.

బయల్దేరే ముందు ఫోను చెయ్యడంతో అనంత్ కారు తీసుకు వచ్చాడు. ముఖాన నవ్వు పులుము కున్నట్లుంది. అనుమానపు అగ్ని పొరలతో కప్పబడి వున్న మనిషి మనస్సుకు ముఖం సూచన లివ్వక మానదు. చిరునవ్వుతో రావు అనంత్ భుజం తట్టాడు.

"శకుంతల రాలేదా?" అడిగాడు.

"సర్‌ప్రైజ్ చేద్దామని నేనే మీరు వస్తున్నట్లుగా చెప్పలేదు." అందమైన అబద్ధాన్ని చెప్పాడు.

ఎక్కువగా మాట్లాడ దల్చుకో లేదు రావు.

శకుంతల ముచ్చటైన ముఖం



గుర్తుకు వచ్చింది. ఎన్నో జాగ్రత్తలతో తనను సీతమ్మకు అప్పగించి భర్తతో ఈ ఊళ్లో కాలు పెట్టింది.

"రాత్రి ప్రొద్దుపోయేదాకా చదవొద్దు, త్వరగా పడుకోండి, తోటలో చల్ల గాలిలో కూర్చోకండి. మీకు చల్లగాలి వంటికి పడదు" వంటి ఎన్నో జాగ్రత్తలు ఆమెకు తన పట్ల అనురాగాన్ని సూచిస్తూంటాయి. తన కిష్టమైన సాహిత్యాన్ని కూడ దూరంగా పెట్టమని ఆప్యాయంగా ఆజ్ఞలు జారీ చేసింది.

తన రాక శకుంతలకు ఆశ్చర్యం కలిగించక మానదు. కారు హారన్‌తో శకుంతల బయటకు రానే వచ్చింది.

కారు దిగిన రావును చూడగానే "డాడీ" ఆనందంగా వచ్చి అక్కున చేరింది.

"వస్తున్నట్లు వ్రాయలేదేం?ఆరోగ్యం బాగుందా!" ప్రశ్నలతోనే లోపలకు తీసుకు వెళ్లింది. విశాలమైన ఆ యింట్లో ఫర్నిచర్ అనంత్ ఉద్యోగపు హోదాను తెలియబరుస్తున్నాయి. చక్కగా తీర్చి దిద్దినట్లుంది ఆ యిల్లు. తృప్తిగా వుంది రావుకు. శకుంతల ప్రశ్నలకు ఓపిగ్గా సమాధానాలు చెప్తున్నాడు.

పావురాలకు ఆహారం సరిగ్గా పెడుతున్నారా! కుందేళ్లు బాగా వున్నాయా" చిన్నపిల్లలా పేరుపేరునా ప్రతీది అడిగి తెల్సుకుంటూంది.

"మీ రిద్దరూ కబుర్లతోనే కడుపు నింపుకునేట్లున్నారు, నాకు మాత్రం ఆకలిగా వుంది సుమా!" అనంత్ నవ్వుతూ అన్నాడు.

"స్నానం చేసిరండి! క్షణంలో అన్నం వడ్డిస్తాను," తండ్రి రాక కలిగించిన సంతోషం శకుంతలకు అడుగు అడుగునా కనబడుతూనే వుంది. వంట నిముషాల్లో అయిందనిపించింది.

టేబుల్‌మీద తనకిష్టమైన పదార్థాలన్నీ అమర్చి వున్నాయి. "గుత్తి వంకాయ కూరలో కారం తక్కువగానే వేశాను. కొబ్బరి పెరుగు పచ్చడి, సాంబారు, మీకిష్టమని చేశాను" కొసరి కొసరి వడ్డిస్తూన్న శకుంతల లోని ఆప్యాయతతోనె కడుపునిండి పోయింది రావుకు.

అనంత్ ముభావంగానే వున్నాడు వాళ్ళిద్దరి మధ్యా అనుబంధం లోపించినట్లు అన్పించింది రావుకు బట్టలు వేసుకుని బయటకు వెళ్ళబోతున్న అనంత్ దగ్గరకు వచ్చి "నీతో మాట్లాడాలి అనంత్", అన్నాడు రావు

"నాకు ఇప్పుడు అర్జంటు పనివుంది, నా ఉత్తరానికి వివరణా! మీరు చెప్పేది, సారాంశం మీకు అర్థమయ్యే వుంటుంది," ముక్తసరిగా అనంత్ సమాధానం

"నీకు వినాల్సిన అవసరం లేకున్నా, నాకు చెప్పవలసిన బాధ్యత వుంది ఇప్పటికే ఆలస్యమైంది నా కోసం కొంత సమయం వెచ్చించు" ఆడపిల్ల తండ్రికి అణకువ తప్పదు

"సరే, సాయంత్రం మళ్ళీ వస్తాను' వెళ్ళిపోయాడు అనంత్ తనకు కేటాయించిన గదిలో విశ్రాంతి తీసుకుంటున్నాడు రావు లోపల పనుల హడావుడిలో శకుంతల వున్నట్టుంది

* * * * * *

డిగ్రీపూర్తి చేసింది శకుంతల ఇంట్లో క్షణం తీరిక లేకుండా పనులు పెట్టుకుంటుంది ముఖ్యంగా తండ్రి సంరక్షణలో ఎక్కువ భాగం గడుపుతుంది చంటి పిల్లాడిలా అదిలిస్తుంది ఆప్యాయతతో లాలిస్తుంది తండ్రికి పెద్ద కంపెనీలో ఉద్యోగం ఉద్యోగరీత్యా అనేక వూళ్ళు తిరిగి చివరకు విజయవాడ చేరారు ఆలోచనల వలయం నుండి వాస్తవంలోనికి రావుని మళ్ళించడం శకుంతలకు ఒక్కదానికే పరిమితం తల్లిలేని లోటు తెలియకుండా పెంచాడు రావు

గాలిలో అలలమీద తేలివచ్చే స్వరరాగ సుధకు తన్మయం కాని వారు అరుదు అటువంటి గాత్రం అనంత్‌ది ప్రతిరోజు ఉదయపు వేళ సంగీత సాధన చేసే అలవాటు చుట్టుప్రక్కల వాళ్ళను అతనికి అభిమానులుగా చేసింది బ్యాంకు ఉద్యోగి అనంత్‌రావు యింటి ప్రక్కయింట్లోకి అద్దెకు వచ్చాడు

రోజూ చక్కనిసంగీతం కర్ణపేయంగా వుంటూ శకుంతలను నిద్రలేపేది అనంత్ వ్యాయామం చేసే సమయం రోజూ శకుంతల తోటపని ఒకేసారి కావడంతో ఒకరికొకరు రోజూ ఎదురు పడక తప్పలేదు ఆకర్షణీయమైన శకుంతల

## దిష్టిబొమ్మ

'పర' తంత్రంలోంచి
'స్వ' తంత్రంలోకి వచ్చినా
పాత గోతుల్లోని పాచికల్నే
ఏరుకుంటున్నాం
గుత్తాధిపత్యం గూళ్ళలో
వలసతత్వం పంజాలు విప్పుతోంది
రైతు చొక్కాల్లోని భూస్వామ్యం
పగటి వేషాలకు బాష్యాలు వినిపిస్తోంది
మువ్వన్నెల కిరీటం మీద
పచ్చకామెర తెరలు
తెరుచుకుంటున్నాయి



ఊసర వెల్లుల కేళీ కేదారాల్లో
స్వాతంత్ర్యం దిష్టిబొమ్మగా
మారిపోతోంది
స్వస్వరూపం కోసం పరితపిస్తోంది
మరో మహాత్ముడి కోసం పలవరిస్తోంది.

—వేమూరి వెంకటేశ్వరశర్మ

రూపం అనంత్ హృదయంలో ముద్రవేసింది. ఆమెతో పరిచయం పెంచుకోవాలని తహతహ లాడాడు. సరిగ్గా ఆ సమయంలోనే శకుంతల అభ్యర్థన మంచి అవకాశం ఇచ్చింది.

"మా అమ్మాయి శకుంతలకు సంగీతం మీద మంచి అభిరుచి కలిగింది రోజూ నీకంఠమాధుర్యం అందుకు దోహదం కల్పిస్తూంది నీకు వీలుంటే అమ్మాయికి నేర్పగలవా!" రావు అభ్యర్థన కాదనలేక పోయాడు అనంత్

రోజూ సాయంత్రం పూట తను 5 సంవత్సరాలుగా నేర్చుకున్న సంగీత పాఠాలను శకుంతలకు నెర్పాడు సరిగ్గా సంవత్సర కాలంలో వారి పరిచయం దినదిన ప్రవర్ధమానమై పెళ్ళికి దారితీసింది

"శకుంతల నాకు నచ్చింది మీకు అభ్యంతరం లేకపోతే నేను వివాహం చేసుకుంటాను," అన్న అనంత్ కోరికను శకుంతల యిష్ట పూర్వకంగా వివాహం జరిపించాడు రావు శకుంతల మంచి భర్తను ఎన్నుకోవడం రావు కెంతో ఆనందకరమైనది పెళ్ళి జరిగిన వెంటనే ఆఫీసర్‌గా ప్రమోషన్ రావడంతో విశాఖపట్నం ట్రాన్స్‌ఫర్ వచ్చింది ఆదిలోనే హంసపాదు అన్నట్లు ఇక్కడకు వచ్చిన కొత్తలోనే ఈ విదమైన అరమరికలు కలగడం నిజంగా దురదృష్టం

శకుంతల రాకతో ఆలోచనలకు అంతరాయం కలిగింది రావుకు

'నిద్రపోతున్నారా'', దగ్గరగా వచ్చి కూర్చుంది శకుంతల

"లేదు నీగురించే ఆలోచిస్తున్నాను", తల నిమురుతూ అన్నాడు రావు

హటాత్తుగా తండ్రి రాక కొంత ఆశ్చర్యం కలిగించక మానలేదు

"అనంత్ నీతో బాగా వుంటున్నాడా!" నెమ్మదిగా ప్రశ్నించాడు

"ఊ ఈ మధ్య ఏదో దిగులు పడుతున్నట్లున్నారు చాలా మూడీగా వుంటున్నారు" అంతకంటే వివరాలు చెప్పలేక పోయింది

అనంత్ రాకతో ఆ సంబాషణ అక్కడతో ఆగిపోయింది రావు చెప్పబోయేది వినేందుకు సిద్ధపడి వచ్చాడు అనంత్ కుర్చీ జరుపుకుని కూర్చున్నాడు

"అనంత్! ఈ ఉత్తరం రాసే ముందు నువ్వెంతో మానసిక సంఘర్షణ

అనుభవించి వుంటావు. లేకపోతే ఎంతో ప్రాణంగా ప్రేమించిన శకుంతలను గురించి అంత తేలికగా ఆలోచించ లేవు. ప్రేమకంటే అనుమానం ఎంత బలవత్తర మైనదో తెలుస్తూంది", సూటిగా చెప్పడం ప్రారంభించాడు.

శకుంతలకు విషయం అర్థం కావడం లేదు. ఆశ్చర్యంగా చూస్తూంది.

"మనిషి జీవితంలో విధి ఆడుకునే విచిత్ర సంఘటనలను చెప్పాను. కొన్ని చిత్ర మైన బంధాలను కూడ విధి కల్పిస్తూంటుంది." రావు చెప్పే విషయాలు తన సమస్యకు పరిష్కారాలు కాగలవా? అనంత్ ఆలోచనలో మార్పు లేదు. అనంత్ అసహనంగానే వున్నాడు. గత నాల్గు రోజులుగా తన ప్రవర్తన తనకే ఏహ్యమనిపించినా అనుమానం విష వృక్షం కావడం అతనికి యిష్టం లేదు. అందుకే రావుకి తెలియ బరిచాడు. జీవితంలో కొంచెం వెనక్కు జరిగిన అనుభవాల్ని వర్తమానంలోకి తెచ్చుకోవడానికి ప్రయత్నం చేస్తున్నాడు రావు.

* * * * * *

భుజానికి లెదర్ బ్యాగ్, చేతిలో సూటుకేసుతో ఆ వూళ్లో కాలుపెట్టిన శ్రీధర్ చిన్న ఉద్యోగి.

పల్లె, పట్నంకాని ఆ వూళ్లో ఇళ్ల కొరత లేదు.

ఆఫీసుకు వెళ్లి ఆర్డరు చేతికి పుచ్చుకొని అక్కడే సామాను వుంచి ఇళ్ల వేటలో పడ్డాడు.

సాయం సమయంలో అలసిన సూర్యుడు కృంగి పోతున్న వేళ ఉదయం నుండి డ్యూటీ చేసి అలసిన సూర్యునికి విశ్రాంతి సమయం. మేతకు వెళ్ళిన పశువులు ఇళ్లకు వస్తూ చిరుమువ్వలు ఘల్లు, ఘల్లుమని చప్పుడు చేస్తూ వింత శబ్దాన్ని సృష్టిస్తున్నాయి. అసలే భావుకుడు మనసుకు నచ్చిన ఆ సన్నివేశాలున్న ఊళ్లోకి రావడం శ్రీధర్‌కు ఎంతో యిష్టంగా వుంది.

వెడల్పు తక్కువగా వున్నా తీరువుగా వున్న యిళ్లను దాటుకొని ఒక్కోచోట అడుగుతూ వెలుతున్నాడు "బాడుగకు

# జీవన హేల

యిళ్లున్నాయా?" అని.

ఎత్తరుగుల పెంకుటిల్లు. ముందు పొన్న చెట్టు, పొగడ చెట్లు, రంగు, రంగుల గులాబీల చిరుమందహాసాలతో స్వాగతం పలుకుతున్న యింటి గుమ్మం సమీపించాడు.

"ఏమండీ! ఇంట్లో రూమేదైనా ఖాళీగా వుందా?" స్వరం పెంచి అడిగాడు.

"ఎవరు బాబు! రూమా, ఖాళీగానే వుంది. కాని నువ్వెవరు?" వివరాలు అడిగింది ఏభై సంవత్సరాల వయస్సుకల స్త్రీ.



తన వివరాలు చెప్పాడు.

"పెళ్లికాని వాళ్లకు ఇవ్వడం వల్ల ఎన్నో సమస్య లున్నాయి. మా దగ్గర మర్యాదగా వ్యవహరించాలి," ఇంకా కొన్ని నియమాలు, నిబంధనల తో ఆ ఇంట్లో వుండేందుకు అంగీకరించింది. వీధి వైపు విడిగా వుందా గది.

కాస్త విశాలంగానే వుంది. పెద్ద కిటికీలతో గాలి, వెల్తురు, బాగానే వుంది. శ్రీధర్‌కు కూడా నచ్చింది. అద్దె కూడ భరించ లేనంత కాదు. ఫరవా లేదనుకున్నాడు. ముఖ్యంగా తన భావుకతకు అనువైన స్థలం. కిటికీలో నుండి ప్రకృతి దృశ్యాన్ని స్పష్టంగా దర్శించ కలగవచ్చు. ఆ రోజే మంచిది. గదిలోకి సామాను తెచ్చుకున్నాడు.

పక్షుల కిలకిలా రావాలతో సూర్యోదయం కావొస్తూంది. మంచు పడే నవంబరు నెల చిరు చలిలో వెచ్చదనం కోసం కప్పుకున్న దుప్పటి క్రింద సులి వెచ్చదనం.

ఆహ్లాదకరంగా వుంది ఆ పచ్చని ప్రకృతి. తలుపు చప్పుడుకు లేచి వెళ్ళి తలుపు తీసాడు. ఒక్కసారి రెప్ప వెయ్యడం మరచాడు.

18 సంవత్సరాల అపరంజి బొమ్మలాంటి యువతి.

"కాఫీ" చేతి కిచ్చింది.

అమ్మ ఇచ్చి రమ్మంది. నేను ఇంటి వాళ్ల అమ్మాయిని. నా పేరు ప్రసూన. మరి మీ పేరు?" పరిచయం చేసుకుంది.

"శ్రీధర్" వణికే పెదిమలతో అస్పష్టంగా చెప్పాడు.

ఇక్కడ మీరు దేనికీ ఇబ్బంది పడనవసరం లేదు. ఎంతో చనువు తీసుకుని పరిచయ మున్నదానిలాగా మాట్లాడుతోంది.

బిడియంగా వున్నా ఆమె మాటలు వినాలని అన్పించింది. లేత నీలం రంగు బట్టల్లో అందానికి అర్థం చెప్పేట్టుగా వుంది ఆమె రూపం.

మొదటిసారిగా ఒక ఆడపిల్ల అందం చూసి ఆకర్షణకు లోనైనట్లు ఫీలింగ్. కోకిల గొంతు లాంటి గొంతుతో ఇంకా ఎన్నో మాటలు ఆ అమ్మాయి చెప్పాలని తను వినాలని అన్పించింది.

లోపలి నుండి తల్లి పిలుపుతో ఏం మాట్లాడక నిలబడిన శ్రీధర్ కేసి విచిత్రంగా చూసి లోపలకు వెళ్లింది ప్రసూన.

ప్రేమ రాహిత్యంలో పెరిగాడు శ్రీధర్. ఊహ తెలియని వయస్సులో తల్లిని పోగొట్టుకొని, మరికొద్ది సంవత్సరాల కాలంలో తండ్రిని పోగొట్టుకొని అనాథగా మిగిలాడు. సరిగ్గా తొమ్మిదో సంవత్సరంలోకి అడుగు పెట్టిన శ్రీధర్‌కు నా అన్నవాళ్లు లేరు. అప్పుడే పరిచయం తాతతో.

ఆశ్రమంలా వున్న ఆ యింట్లో ఒంటరిగా వుండే తాత శ్రీధర్‌ను

## మూడో భార్య కూడా ఆత్మహత్య!?

ప్రస్తుత సమాజంలో వరకట్న చావుల గురించి మనం వింటూనే వున్నాం. అలాంటి చావు కాకపోయినా వయసులో వున్న ఒక యిల్లాలు ఒళ్ళుకాలి మరణించిందంటే అనుమానాలు రాక మానవు కదూ!

ఒక దేవాలయంలో పని చేసే పూజారి మూడవభార్య ఒళ్ళు కాలినస్థితిలో ఆస్పత్రిలో కన్నుమూసిందట. ఈమె యిలా మరణించిందీ అంటే... పొరబాటున ఏ వంట చేస్తూనో చీరకు నిప్పంటుకొని ఒళ్ళు కాలివుండవచ్చునని అనుకోవచ్చు. కాని ఈ పూజారి మొదటి యిద్దరు భార్యలూ అనుమానాస్పద పరిస్థితుల్లో మరణించటంతో ఈ మూడవ భార్య మరణం కూడా అనుమానంగా పరిణమించింది.

మొదటి భార్య యిలాగే కాలిన గాయాలతోను, రెండవభార్య ఉరిపోసుకొని మరణించారట.

మూడవ భార్య భర్తకు తనపై ప్రేమ వుందో లేదో తెలుసుకొనేందుకే ఒంటిపై కిరోసిన్ పోసుకొని ఆత్మహత్యకు పాల్పడిందని పూజారి అంటున్నాడట. అతను యింట్లో వున్నసమయంలోనే యిది జరగటంతోను, అతను యిరుగు పొరుగువారి సహాయం అర్థించక పోవటంతోను యిది పూజారే కావాలని ఆడుతున్న నాటకమని యిరుగు పొరుగువారు అంటున్నారు. తనపై ప్రేమ వుందో లేదో తెలుసుకోవటానికి యింత అఘాయిత్యానికి పాల్పడాల్సిన అవసరం ఏమొచ్చిందని కూడా వారు ప్రశ్నిస్తున్నారు.

తన మరో చెల్లెల్ని తన తమ్ముడికిచ్చి పెళ్ళి చెయ్యమని బావగారు బలవంతం చేస్తున్నాడని, అందుకు ఒప్పుకోక పోవడంతో యిలా చేసి వుండవచ్చునని పూజారి బావమరిది అంటున్నాడు

ఈ సంఘటన జరిగినప్పుడు పూజారి యింట్లోనే వున్నానని స్వయంగా చెప్పుకుంటుంటే పోలీసులు లేడని వాదిస్తున్నారు అంటే ఈ కేసును మాఫీ చేయాలని అనుకుంటున్నారా? ఎందుకలా పోలీసులు కంకణం కట్టుకున్నారు? ఇదొక పెద్ద మిస్టరీలా తయారయింది. ఏది ఏమైనా ఈ కేసు పూర్వాపరాలను సి. ఐ. డి. దర్యాప్తు జరిపించాలని ప్రజాస్వామిక హక్కుల పరిరక్షణ సంఘం గొంతుచించుకొని అరుస్తోంది. మరి వీళ్ళ అరుపులు వినేనాథుడున్నాడో లేడో! పూజారి వంటి వ్యక్తులకు కనువిప్పు కలుగు తుందో! లేదో!?

చేరదీశాడు. బాధ్యతల నుండి విముక్తి పొందే విరాగి జీవితాన్ని గడిపే తాత శ్రీధర్‌ను ఆదరించాడు.

హైస్కూల్లో చదువులో అంచెలంచెలుగా పైకి వస్తున్నాడు శ్రీధర్. ఉదయం నుండి దైవనామ సంకీర్తనతో నిద్ర లేచి తోటపని పూర్తి చేసి, కాస్తంత వంటపని అయిందనిపించి తాత పర్యవేక్షణలో చదువుకొనేవాడు.

తీరిక సమయాల్లో తాత చదవమనే పురాణాలలోని ముఖ్య భాగాలకు అర్థం చెప్పించు కోవడం శ్రీధర్ వ్యాపకాలు మరి లేవు.

తాతకు అప్పటికి 80 సంవత్సరాల వయస్సు. బ్రహ్మ చర్యంతో నియమ నిష్టలతో శరీరాన్ని, మనస్సును స్వాధీనంలో వుంచుకొన్న మహా యోగి వంటి తాత సహచర్యంలో శ్రీధర్‌కు కొన్ని ఆదర్శాలు ఏర్పడ్డాయి.

నిశ్శబ్దంలా వున్న తటాకంలోకి రాయి విసిరితే చెలరేగే అలజడులు జీవితాల్లోను తప్పవు.

ఉదయాన్నే నిద్ర లేచే తాత కదలక పోవడం గమనించాడు శ్రీధర్. ప్రక్కనే

### జీవన హేల

భగవద్గీత మధ్యకు విప్పదీసి వుంది. పెదాలు రామనామం వుచ్చరిస్తున్నట్టుగా విచ్చుకునే వున్నాయి. గాలిలో కలిసి పోయిన తాత ప్రాణంతో పాటు శ్రీధర్ భవిష్యత్తు ప్రశ్నలా మిగిలి వుంది.

హైస్కూలు చదువు ముగింపు కొచ్చింది. అడుగడుగునా విఘ్నాలతో సాగుతూన్న శ్రీధర్ చదువు ఇపుడు మరింత భారమైంది.

హాయిగా తల్లి తండ్రుల ఒద్దికలో వాళ్ళ ఆనందాను రాగాలకు ప్రతీకగా సాగిపోవాల్సిన చిన్న వయస్సులో అవరోధాలతో మానసికంగా కృంగి పోతున్నాడు శ్రీధర్. చిన్న వయస్సులో పెద్ద సమస్యలు.

నిర్ణీతమైన పద్ధతిలో జీవన సరళి సాగడం, సాగక పోవడం అంతా ఈశ్వరేచ్ఛ.

కొందరివి బాధ్యతలేని బ్రతుకు లైతే మరికొందరివి అనునిత్యం సమస్యల తోరణాలు. అన్నెం, పున్నెం ఎరుగని చిన్నతనంలోనే ఒకరికి భారం కావడం, బ్రతుకు సమస్యగా మారడం, ఎంత విచారకరం!

కాలానికి ఎదురీదే శక్తి ఎవరికి లేదు. కాలం వెనుక గొఱ్ఱెలా పరుగెట్టడమే మానవ కర్తవ్యం.

కరణం గారు కుదిర్చిన ప్రైవేట్ల ఆధారంతో వారాలు చేసుకొంటూ మిగిలిన చదువు పూర్తి చేశాడు. మంచి మార్కులతో ప్యాసయిన ఆయన చలువతోనే ఈ చిన్న ఉద్యోగం సంపాయించుకో గలిగాడు.

"ఏమిటి! ఇందాకటి నుండి కాఫీ త్రాగనే లేదా" నొచ్చుకొంది ప్రసూన గట్టిగా మాట్లాడుతూన్న ప్రసూన కంఠ స్వరం విని ప్రపంచంలోకి వచ్చాడు శ్రీధర్.

"మర్చే పోయాను." నెమ్మదిగా అన్నాడు.

"అమ్మయ్య. కొన్ని మాటలు వచ్చున్న మాట." నవ్వుతూ చురక అంటించింది.

"ఏమిటి? అస్సలు మాట్లాడరా? కొంచెంగా మాట్లాడుతారా!"

"మీ ధోరణీ నాకు నచ్చలేదండి." సమాధానం చెప్పరేం?"

"అబ్బె ఏం లేదు. ఏదో జ్ఞాపకం

# గాంధీజీ దీక్ష

నౌఖాళీ దురంతాలు జరిగే కాలంలో గాంధీజీ ప్రతి పల్లెటూరికీ వెళ్తూ అక్కడ వుండే హిందూ ముస్లిం వాళ్ళని సఖ్యంగా వుండమని చెప్పేవారు. ఆ సమయంలో హిందువుల్ని ఎంత మందినో మహమ్మదీయులు చంపేస్తున్నారు. అందుకని, అది తప్పించడానికి గాంధీజీ బయల్దేరారు. ఆయన వెంట ఆయన కార్యదర్శి, మరి కొంత మంది మాత్రం బయల్దేరారు. గాంధీజీ మనమరాలు– మనుబెన్ అంటారూ– ఆవిడ కూడా వొస్తానంది. గాంధీజీ ఒప్పలేదు. "వొద్దు– నువ్వు రావద్దు– నాతో నీవు వేగలేవు– అనేక చిక్కు లుంటాయి.– నీవు పడలేవు



రాకు" అని ఎన్నివిధాలో మనుబెన్‌కి చెప్పారు. కాని మనూ దొకటే పట్టు! సరె గాంధీజీ ఆవిణ్ని కూడా తనతో తీసుకెళ్ళక తప్పింది కాదు.

ప్రతీ పల్లెటూర్లోనూ ఆయన మకాం చేస్తూ, అక్కడి పరిస్థితుల్ని స్వయంగా పరిశీలిస్తూ వుండేవారు. ఒకనాడు ఒక వూర్నించి మరొక వూరొచ్చి అక్కడ వుండె బీదసాలె వాళ్ళ యింట్లో దిగారు. దిగగానె గాంధీజీ కొన్ని వుత్తరాలు చూసి, వాటికి జవాబులు రాయమని తన కార్యదర్శి కిస్తారు. తర్వాత కాసేపటికి స్నానం చేస్తారు. ఈ స్నానం మొదలయిన పనులన్నీ మనూ స్వయంగా చేసేది.

ఐతే, అవాళ గొప్ప పొరపాటు జరిగింది. గాంధీజీ స్నానం చేసేటప్పుడు వొళ్ళు రుద్దుకుందుకు సబ్బు ఏమీ వాడరు. ఒక గరుగ్గా వున్న రాయిని మాత్రం వాడతారు. మామూలుగా మనూ గాంధి, నీళ్ళూ తువ్వాలు వుంచింది. రాయి మాత్రం లేదు. గబగబా వెళ్ళి గాంధీజీని కనుక్కుంది. "లేదూ నీకే తెలియాలి– ఎక్కడ పెట్టావో– జాగ్రత్తగా చూడు" అన్నా రాయన. "అంతా చూశాను. కాని కనపడితేనా పోనీ మరో రాయి పెట్టనా?" అంది జంకుతూ.

"వీల్లేదు. ఆ రాయే నాకు కావాలి. బహుశా క్రిందటి రోజు మనం బస చేసిన వూళ్ళో వొదిలి పెట్టి వుంటావు. వెళ్ళు. వెళ్ళి తీసుకురా!" అన్నారు గాంధీజీ. మనూగాంధీ భయపడ్డది. నిన్నటి వూరు ఐదారు మైళ్ళు వుంది. దారంతా భయంకరంగా వుంది. అంతా గూండాల మయం. ఏ క్షణాన ఏం జేస్తారో. ఐనా ఈ రాతి ముక్క కోసం ఆయనకి ఇంత పట్టింపు ఎందుకో!

"ఇక్కడ కొందరు వాలంటీర్లున్నారు– ఎవర్నన్నా సాయం తీసుకెళ్ళనా?" అని అడిగింది. "ఎందుకూ? సాయం గీయం

లేదు వెంటనే వెళ్ళు– స్నానంకి వేళవు తున్నది గాంధీజీ మొహం పెద్దది చేసి, కళ్ళు జోళ్ళొంచి తీవ్రంగా చూసి అనేటప్పటికి, మనూ గబగబా వెళ్ళిపోయింది దారంతా ముళ్ళ డొంకలు! మనుష్యులే ఎక్కడా లేరు ఏ పొదల పక్కన గూండాలు వున్నారో– అని భయపడ్డది ఎంతగానో చివరికి భగవంతుడి మీద భారం పారేసి, "రామ రామ అంటూ తొందరగా ఆ వూరు చేరుకుంది ఐతే ఆ యింటి వాళ్ళు అదేదో రాయనుకుని వీదిలో పారేశారు అది వెతికి తీసుకుని, మళ్ళీ "రామ రామ అంటూ బయల్దేరింది! 'ఆ రోజు గాంధీజీకి సేవ చెయ్యడానికి వీల్లేక పోయింది గదా!" అని ఎంతగానో బాధపడ్డది భగవంతుడి దయవల్ల ఏ ఆపదా లేకుండా గాంధీజీ వున్న వూరొచ్చి గాందీజీ ముందర రాయిని పెట్టి, వొక్కసారిగా ఏడ్చింది గాంధీజీ కొంచెంగా నవ్వేరు "నేను మొదటే చెప్పలేదు మనూ! నాతో వేగలేవని! చాలా కష్టం! ఐతే, నీ మీద నాకు ప్రేమ లేక వొంటిగా పంపలేదు అలా చేస్తే మళ్ళీ ఈ జన్మలోకి ఏ వస్తువూ మరిచి పోవు అన్నారు

మనూ అంది "బాపూజీ! ఈ రోజు మాత్రమే మీ దయవల్ల రామనామ స్మరణ మనస్ఫూర్తిగా చెయ్యగలిగేను

"మనిషికి దీక్ష వుండాలి ఈ రాయి నాకు అనేక సంవత్సరాలుగా పని చేస్తోంది జైల్లో వున్నా, బవనంలో వున్నా కూడా ఇది నాతోనే వుండేది అందుకే నాకు దాని మీద ప్రేమ' అన్నారు బాపూజీ

మనూగాంధీ చాలా సంతోష పడింది మళ్ళీ ఆయన అన్నారు–

"ఎవరన్నా వొకసారి తప్పు చేస్తే, దానికి ప్రాయశ్చిత్తం అనుబవించాలి అనుబవించిన తర్వాత, మళ్ళీ ఆ తప్పు చెయ్యరు–

–శ్రీ రావి కొండలరావు

(ఆంధ్ర సచిత్ర వారపత్రిక 31-1-51 సంచిక నుంచి)



## కీడు సంకేతం

ఇక్షులలో కక్షల దావానల కీలలు
వీక్షణల తీక్ష్ణతకు ఎత్తిన గొంతుల వంత పాటలు
సౌమ్యం, సామరస్యం, శాంతియుత చర్చలు–
గతపు సమాదిలో పూడ్చబడిన శైనాలు
ఆధారం ఏదైన– కులం, మతం, విద్య, ఉద్యోగం–
అలజడి, హింస, నిరుద్యోగం, మారణహోమం, రక్తతర్పణం
నిరుద్యోగికి ఉద్యోగ లేమి, ఉద్యోగికి వ్యాపకలేమి
గాంధీజమ్, నెహ్రూయిజమ్, పంచశీల స్థానే
గూండాయిజమ్, హింసాయుత వాస్తవం, అక్రమమార్గం
యువత శక్తియుక్తుల సక్రమ త్రోవ నుంచి మళ్ళించడం
గమ్య మెరుగని అనాలోచనా విహంగ పయనం
సాంఘిక విదాన రూపొందనలో హిమాలయన్ బ్లండర్స్
లక్ష్య శుద్ధి, చిత్తశుద్ధి లేని అరణ్య రోదనం
నాయకత్వ రంగంలో దివాలా వాస్తవం
విలువ రాహిత్య నిబిడాందకార స్వైర విహారం
ఇది నేటి బారతం, బావి తరాలకు కీడు సంకేతం

–వి లక్ష్మణరావు

# సినిమా సినిమా...

### డాక్టర్ నరేష్

"ఇద్దరు ముద్దు గుమ్మల మొగుడుగా డాక్టర్ అక్కినేని విలక్షణమైన పాత్రను ధరిస్తున్నారు నరేష్ ద్విపాత్రాభినయం చేస్తారు" అన్నారు ప్రముఖ పంపిణీ దారుడు, ఎగ్జిబిటర్ చిత్తూరు ఆనంద నాయుడు ఈయనా, ఎన్ చెన్న కేశవరావు నిర్మించే శ్రీ వనజ ఆర్ట్ క్రియేషన్స్ చిత్రంలో జయప్రద, రాదిక, లిజి, చంద్రమోహన్, జగ్గయ్య ప్రభృత 22 మంది తారాగణం ఉన్నారు శ్రీనివాస చక్రవర్తి కథకు సత్యానంద్ సంభాషణల కర్త చక్రవర్తి సంగీతం, నందం హరిశ్చంద్రరావు సంయుక్త దర్శకత్వం, బాస్కరరాజు శిల్పంతో వెల్లూరు, మనోహర్ సహ నిర్మాత స్క్రీన్ప్లే, దర్శకత్వం రేలంగి నరసింహారావు

### శ్రీ దేవీ మూవీస్‌లో బాలకృష్ణ

'శతాబ్దాల వెనక్కి వర్తమాన మానవులు వెళ్లగలిగితే ఎదురయ్యే వింత వింత పరిస్థితులు ఈ చిత్రంలో కళ్ళకు కట్టుతాయి అత్యద్భుతమైన కాల్పనికత, సృజనాత్మకత ఉన్న సోషియో ఫాంటసీ చిత్రం అన్నారు సింగీతం శ్రీనివాసరావు ఈయన కథ స్క్రీన్ప్లే, దర్శకత్వంలో ఎస్ పి బాలసుబ్రహ్మణ్యం సమర్పించే శ్రీదేవీ మూవీస్ ద్వితీయ చిత్రంలో బాలకృష్ణ, మోహిని, చంద్రమోహన్ గొల్లపూడి మారుతీరావు వేలు, చలపతిరావు, జె వి సోమయాజులు, మాస్టర్ తరుణ్, స్మిత అన్నపూర్ణ కిన్నెర శ్రీలక్ష్మి, టినూ ఆనంద్‌తో పాటు మరో ముగ్గురు ప్రముఖ బొంబాయి నటు లుంటారు జంధ్యాల మాటలు, ఇళయ రాజా సంగీతం పి సి శ్రీరాం- వి ఎస్ ఆర్ స్వామి చాయ పేకేటి రంగా శిల్పం సుందరం నృత్యాలు విక్రమ్ ధర్మా సాహసాలు, పూర్ణప్రజ్ఞ యోగి సంయుక్త దర్శకత్వం నాగేశ్వరరావు సహకార దర్శకత్వంతో ఎస్ అనితా కృష్ణ నిర్మాత

### జంధ్యాల దర్శకత్వంలో 'విచిత్ర ప్రేమ'

'పెద్దలు నిర్ణయించిన పెళ్ళిని పిల్లలు ఒప్పుకోవాలా - లేక ఇష్టం లేకపోతే ఎదిరించాలా- అనే అంశం ఆధారంగా బమిడిపాటి రాధాకృష్ణ సెంటిమెంట్ డ్రామాతో కూడిన ప్రణయ హాస్య కథను సమకూర్చారు. హైదరా బాద్‌లో సెప్టెంబర్ 26 నుంచి అక్టోబర్ ఆఖరు వరకు ఒకే షెడ్యూల్లో షూటింగ్ ముగుస్తుంది" అన్నారు జంధ్యాల. ఈయన రచన, దర్శకత్వంలో శ్రీ లక్ష్మీ ఎంటర్‌ప్రైసెస్ అధినేత ఎ సూర్యనారా యణ నిర్మిస్తున్న "విచిత్ర ప్రేమ" చిత్రంలో రాజేంద్రప్రసాద్ సరసన బెంగు ళూరుకు చెందిన అమృత నాయిక ఇంకా వేలు, బ్రహ్మానందం, శ్రీలక్ష్మి, హైదరాబాద్ కళాకారులు పాల్గొంటున్నారు కె వి మహదేవన్ స్వరకల్పనలో వేటూరి గీతాలు రాశారు బాబ్జీ చాయ, శాస్త్రి- రామకృష్ణ సహకార దర్శకత్వం, ఎస్ బాపయ్య ప్రొడక్షన్, గౌతంరాజు కూర్పు నిర్వహిస్తున్నారు

### ఆర్ సి క్రియేషన్స్

'నాయికా నాయకుల ప్రణయం మూలంగా పెద్దలు పొందిన వైరం



మరి. ఆమె వంక కోపంగా చూశాడు.

అతని మనస్తత్వం గురించి వివరించాలంటే ఇలా చాలా చాలా చెప్పవచ్చు. ప్రస్తుతానికి ఈ పరిచయం చాలనుకుంటాను.

తర్వాతి కథలోకి దూసుకు పోదాం...

ఒక రోజు అర్జంటుగా పిల్ల చూపుల కోసం రమ్మంటూ తండ్రి ఉత్తరం రాస్తే ట్రెయిన్‌లో బయలు దేరాడు.

కిటికీ పక్క సీట్లో కూర్చున్నాడు. సామాను సర్దుకుని ఎదురుగా చూ[illegible] పులకించి పోయాడు.

అందుకు కారణం ఆ ఎదుయిగా ఒక అందాల బొమ్మ.

ఆమెను పరీక్షగా చూశాడు: నిస్సందేహంగా మంచి అందమైన అమ్మాయని నిర్ణయానికి వచ్చాడు.

మేలిమి బంగారు రంగు ఛాయ.... గుండ్రని ముఖం... లేత పెదవులు... విశాలమైన కళ్ళు... చక్కని మెడ... ఆ మెడలో బంగారు గొలుసు... ఆ గొలుసు తాలూకు లాకెట్ విశ్రాంతి తీసుకుంటున్న ఆ ప్రదేశం ఎత్తుకొండల్ని గుర్తు చేస్తూ... సన్నని నడుం... అందమైన పాదాలు...

ఓకే...ఏం అదృష్టం... ఆమెతో మాట్లాడి ఈ ప్రయాణాన్ని ఒక మధురమైన అనుభూతిగా [illegible]వాలి.

## టపాకాయ తుస్సుమంది

అప్పుడే అతనిలో ఒక ఆలోచన... ఆమెతో డైరెక్టుగా మాట్లాడితే తన గొప్పతనం ఆమెకు స్వయంగా చెప్పుకోవాలి.

అలాకాక తన పక్కనే కూర్చున్న పెద్దమనిషితో మాటలు కలిపి తన గురించి చెప్పుకుంటూ మధ్య మధ్యలో ఆమె ముఖంలోని ఫీలింగ్సు చూడాలి... ఆమె స్వయంగా తనతో మాట్లాడేలా చెయ్యాలి... అప్పుడే గొప్ప మజా...

ఇక ఆలస్యం ఎందుకు! పక్క పెద్దమనిషిని పలకరించి కబుర్లాడసాగేడు.

"నా రచనల ద్వారా ఆంధ్ర ప్రజలు నన్ను బాగా ఎరుగుదురు. కానీ నేను ఎదురైతే స్వయంగా చెప్తే తప్ప గుర్తుపట్టలేరు నన్ను..." అన్నాడు.

ఆ పెద్దమనిషి ఆశ్చర్యంగా చూశాడు ఆనందరావు వంక.

"మీరు రచయితా?" అని ప్రశ్నించాడు.

కాలరు సవరించుకుని ఓరకంట ఆ సుందరాంగి వైపు చూసి చిన్నగా దగ్గాడు. కానీ అతని దురదృష్టం... ఆమె ఇటు చూడలేదు. ఆమె చూపులు చేతిలో వున్న ఇంగ్లీషు నవలపైన వున్నాయి.

"అవునండీ... నా పేరు..." అంటూ ఒక ప్రముఖ రచయిత పేరు చెప్పాడు.

"అలాగా... చాలా సంతోషం మిమ్మల్నిలా కల్సుకోవడం అదృష్టం..." అన్నాడు పె. మ. (పెద్ద మనిషి)

చిన్నగా నవ్వాడు ఆనందరావు.

"గతవారం ఆంధ్ర తేజ వారపత్రికలో మీ కథ 'అబద్ధాల కోరు...' చాలా బాగుంది. అన్నాడు మళ్ళీ పె.మ.

"అవును... ఆ కథ గురించి చాలా మంది ప్రశంసించారు..." అన్నాడు.

ఆ తర్వాత కథలు రాయడం గురించి తనకు తెలిసినదీ, తెలియనిదీ అంతా కలిపి వాగసాగేడు.

ఆ సుందరాంగి ఒకసారి ఇటు చూసింది. దాంతో పులకించి పోయాడు.

"అంతేకాదు... నేను నాటకాలు కూడా రాస్తాను.... డైరెక్టు చేస్తాను. ముఖ్య పాత్ర ధరిస్తాను. నా డ్రామాలు కూడా చాలా హిట్టయ్యాయి.... ఈ మధ్య జాతీయ సమైక్యత గురించి ఒక పుస్తకం రాశాను.... మళ్ళీ నెల దాన్ని మన భారత రాష్ట్రపతి ఆవిష్కరిస్తారు..." అన్నాడు.

"అబ్బో... చాలా గొప్ప విషయం..." అన్నాడు పె.మ.

తను చేస్తున్న ఉద్యోగం గురించి అబద్ధాలు చెప్పాడు. తను చాలా బిజీగా వుంటానని అన్నాడు. అయినా కూడా సమయం చిక్కేలా చేసుకుని ఈ కథలూ గట్రా రాస్తూంటాననీ సాహితీమాతకు యధాశక్తి సేవ చెయ్యడంలో తన జీవితం అంకితం చేస్తాననీ పెద్ద పెద్ద మాటలు మాట్లాడేడు.

ఆ పెద్ద మనిషికి తోడు మరో నలుగురు అతని మాటలు విని అతనితో ముచ్చటించసాగేరు. ఆ అందర్నీ ఆకట్టుకుంటూ రకరకాలుగా నోటికి వచ్చిన కూతలు కూస్తూ మధ్య మధ్య ఆ సుందరాంగి వైపు చూస్తూ గొప్పగా ఆనందించసాగేడు.

ఆ సుందరాంగి అతనివైపు ఒకసారి కన్ను ఆర్పకుండా చూసింది. దాంతో అతని మనసు పులకించి పోయింది. తన లక్ష్యం నెరవేరిందని తనలో తాను ఆనంద పడిపోయాడు. ఆ అమ్మాయి తనతో పరిచయం పెంచుకోవాలని చూస్తోంది.... అద్దో మహాభాగ్యంగా ఆమె



భావిస్తోంది అని సంబరపడిపోయాడు.

కోస్తున్న కోతల్ని ఆసక్తితో వినేవాళ్ళు వుంటే 'టంగుటూరి మిరియాలు తాటికాయలంత' అనే వాళ్ళలో సర్వప్రధముడు అయిన మన ఆనందరావు ఇంకా విజృంభించాడు. తన కీర్తిని దేశపు టిల్లలు దాటించాడు.

అమెరికాలో తనకు అభిమానులు వున్నారన్నాడు. రష్యాలో తనంటే పడి ఛస్తారన్నాడు. మలేషియాకీ, సింగపూరుకీ పక్కింటికి వెళ్ళివచ్చినంత తేలిగ్గా తన అభిమానుల పిలుపు మేరకు వెళ్ళి వస్తూ వుంటానన్నాడు.

రాబోయే రెండు మూడు సంవత్సరాలలో భారత ప్రభుత్వం తనకు 'పద్మభూషణ' బిరుదు ఇయ్యకపోతే అది చాలా ఆశ్చర్యకరమైన విషయం అయ్యి తీరుతుందని గట్టిగా చెప్పాడు.

ఆ సుందరాంగి మళ్ళీ చూసింది. ఈసారి చిన్నగా నవ్వాడు ఆమెను చూసి. ఆమె వెంటనే తల తిప్పుకుంది.

'ఫర్వాలేదు.. పిట్ట నెమ్మది నెమ్మదిగా వలలో పడుతోంది..' అనుకున్నాడు. అతను లోలోన పొంగి పోతున్నాడు. ఆ సుందరాంగి నెమ్మది నెమ్మదిగా తన మాటల వల్ల ప్రభావితం అవుతోంది. ఇంకాస్సేపట్లో తనతో పరిచయం పెంచుకుంటుంది. తన అభిమానిగా మారిపోతుంది. తనంటే పడి ఛస్తున్నానని అంటుంది. వాళ్ళింటికి రమ్మని ఆహ్వానిస్తుంది. అదే జరిగితే తను వెంటనే అంగీకరించ కూడదు. బింకం చూపాలి. తనకు చాలా అర్జంటు పనులున్నాయని ఫోజు కొట్టాలి. ఆమె బ్రతిమాలుతుంది. అప్పుడే అంగీకరించి ఆ సుందరాంగితో కల్సి వెళ్ళాలి. ఆమెతో గడిపే ప్రతిక్షణం ఒక మరుపురాని మధురక్షణంగా మార్చుకోవాలి. ఇంకా...

అతని ఆలోచనల్ని భంగం చేస్తూ ఆ పెద్దమనిషి పలుకరించాడు.

"ఇంకా ఏమన్నా చెప్పండి.. మీ గురించి తెల్సుకోవాలని వుంది. ఈ రోజు నిజంగా సుదినం.. మీ పరిచయ భాగ్యం కల్గింది.." అన్నాడు.

సరిగ్గా అవే మాటలు తను ఆ సుందరాంగి నుంచి రావాలని తన ఆశ. సరే... నెమ్మది నెమ్మదిగా వల పన్నుతున్నాడు కదా... తొందర ఎందుకు? ఆలోచించాడు... ఇంకా ఏం చెప్పుకోగలడు తన గురించి... అన్నిరకాలుగానూ తనని తాను పొగిడేసుకున్నాడు. ఆవగింజంత కూడా నిజం లేని విషయాన్ని ఆకాశమంత పెద్దగా చేసి చెప్పడం చాలా కష్టమే అన్పించింది.

"చాలా మంది సినిమా ఏక్టర్లు, మంత్రులు నా స్నేహితులే. నేను వాళ్ళ స్నేహితుడు కావడం వాళ్ళకు గర్వకారణం అని చాలా మంది చాలా తరుచుగా అంటూ వుంటారు..." అంటూ మరో బాణం విసిరాడు.

ఆ సుందరాంగి మళ్ళీ చూసింది.

ఆలోచించసాగేడు ఆనందరావు.

'ఈ అమ్మాయి కాస్త మితభాషి లాగే వుంది. ఇంతగా తన గురించి చెప్పుకున్నాడు. ఆ చెప్పిన ప్రతిమాటా ఆమె విన్నది. అయినాకూడా ఇంత వరకూ కల్పించుకుని మాట్లాడకపోవడం వింతగానే వుంది. రచయితలు అంటే అమ్మాయిలందరూ పడి ఛస్తారని తను విన్నది నిజం కాదా?..'

ఆడపిల్లలకు పుస్తకాలుంటే చాలు.. పిచ్చిగా చదువుతారు... రాబోయే స్టేషన్లో ఒక తెలుగు వారపత్రిక కొంటే ఇమ్మని ఆమె అడుగుతుంది. ఆ రకంగా ముందు ఆమె ఒకసారి మాట్లాడితే చాలు... అభిమన్యుడిలా తను ముందుకు దూసుకుపోతాడు. మరో పది నిమిషాల్లో ఏదో స్టేషన్లో ఆగింది రైలు. ఒక వారపత్రిక కొన్నాడు అతను. ఆమెకు కన్పించేలా పట్టుకుని కూర్చున్నాడు. అయినా ఆమె అడగలేదు. నిజంగా ఇది ప్రపంచంలో ఎనిమిదో వింత.

తను ప్రయాణం చెయ్యవల్సిన దూరం తరిగిపోతున్నది. అయినా ఆమెకు దగ్గర కాలేకపోతున్నానన్న బాధ అతనిలో పెరిగిపోతున్నది. అందుకే కల్పించుకుని-

"తీసుకోండి.." అంటూ ఆ పుస్తకం ఆమె చేతిలో పెట్టాడు. ఆమె బాంబు పేల్చింది- ఇంగ్లీషులో.

"అబ్బే... నాకు అక్కర్లేదు... నాకు తెలుగురాదు.. ఏం చేసుకోను ఈ పుస్తకం?" అంది.

తడబడుతూ అడిగేడు.

"తెలుగు చదవడం రాదా... మాట్లాడటం రాదా... మీరు తెలుగమ్మాయి కాదా?"

"కాదు... నేను బెంగాలీ అమ్మాయిని. తెలుగు వారి అలంకరణ నాకు ఇష్టం కనుక నేను ఇలా వున్నాను. నన్ను చూసి తెలుగు అమ్మాయిగా మీరు భ్రమపడితే

### మిహిర్ సాహసం



ఇంగ్లీష్ ఛానెల్‌ను ఈది గజఈతగాడుగా విశిష్ట స్థానం పొందినవాడు మిహిర్‌సేన్. ఆయన 1958 సెప్టెంబర్ 27వ తేదీన ఇంగ్లీష్ ఛానెల్‌ను ఈది యిటువంటి సాహసం చేసిన భారతీయులలో ప్రథమ వ్యక్తి అయ్యాడు. 1966వ సంవత్సరంలో యూరప్- ఆఫ్రికాల మధ్యవున్న జిబ్రాల్టర్ జలసంధిని, పనామా కాల్వను, భారత్- శ్రీలంకల మధ్య వున్న పాక్ జలసంధిని యీది ప్రపంచ రికార్డు సృష్టించాడు సేన్. ఇన్ని రికార్డులు నెలకొల్పిన ఈ గజఈతగాడిని మెచ్చుకోవలసిందే.

## సాహితీ పజిల్ — గెల్చుకోండి రు. 200



-కూర్పు: వంగల వి. కృష్ణారావు

## గళ్లనుడి కట్టు-30

### ఆధారాలు

**నిలువు**

1.వీడి పేరుతో రామాయణంలో అరణ్యం
3.శంతనుడి మామ
4 దరువును కొద్దిగా మార్చండి కొయ్య వస్తుంది
8.చెంచులక్ష్మి బంధువులు
9.రావణుడు చేసిన అనాధ చుప్పనాతి
0.అతిబలలో స్త్రీ
1.తిథి నియమం లేకుండా వస్తాడు
4.దనుజులకు శత్రువు విష్ణువు
5.మందర పర్వతం మోసింది
7.మేఘాలు చూస్తే చాలు నృత్యం చేస్తుంది

**అడ్డం**

2.దారమునకు ఒక అక్షరం ముడిపేస్త వంది
5.పాషండుడు కాదు నపుంసకుడు
6.బరువుకు దీర్ఘం ఇస్తే పుట్టి
7.మరీ అంతపరాకైతే ఎలా ఆలోచించండి
12.9 నిలువులోనే ఉన్నది
13.భల్లూకరాజు కూతురు కృష్ణుని భార్య
16.ఆజానుబాహువులవాడు రాముడు
18.కర్మము కాదు కవచము
19.సుమతికి వ్యతిరేక పార్టీ
20.సముద్రం వారిది, పొరపాటుదిద్దండి

ఆధారాలున్నాయి. నుడి కట్టు గళ్లు నింపండి! ఈ కూపన్ కత్తిరించి మీ చిరునామా రాసి పంపండి. ఆల్ కరెక్టు సొల్యూషన్ పంపిన వారికి రు. **200/-**లు బహుమతి లభిస్తుంది-ఒకరి కన్నా ఎక్కువ మంది కరెక్టు ఆన్సర్లు పంపితే వారికి బహుమతి మొత్తం పంచడం జరుగుతుంది. తుది నిర్ణయం సంపాదకునిదే.

-ఎడిటర్

ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక

పంపినవారి పేరు...........................................

పూర్తి చిరునామా..........................................

.................................................పిన్ కోడ్.............

**ముగింపు తేదీ: 15-10-'90**

అందులో నా తప్పు లేదు. నాకు తెలుగు మాట్లాడటం కానీ, ఎవరైనా మాట్లాడుతుంటే అర్థం చేసుకోవడం కానీ రాదు. ఇక తెలుగు చదవటం అన్నది మరింత అసాధ్యమైన విషయం కదా... అయినా ఇంత వివరంగా ఎందుకు అడుగుతున్నారో తెలుసుకోవచ్చా?" అంది ఆమె.

వెలక్కాయ గొంతులో అడ్డుపడిన వాడిలా కాస్సేపు తబ్బిబ్బైపోయాడు.

"నేను మాట్లాడుతుంటే మధ్య మధ్యలో నా వైపు ఎందుకు చూశారు?... నా మాటలు మీకు అర్థం అవుతున్నాయనీ అందుకే ప్రశంసాపూర్వకంగా మీరు నా వైపు చూస్తున్నారనీ అనుకున్నాను.." అన్నాడు.

వ్యవహారం ఈ రకంగా అడ్డం

## టపాకాయ తుస్సుమంది

తిరిగిపోయాక ఇక విషయం పూర్తిగా తెలుసుకోవడం మంచిదన్న అభిప్రాయంతో ఆ రకంగా అడిగేడు.

ఆమె కూడా సంకోచం లేకుండా వెంటనే అంది

"ఆ విషయం వదిలేస్తే మంచిది. ఎందుకంటే నేను నిజం చెప్తే మీరు బాధపడవల్సి వస్తుంది మరి..."

ఆనందరావులో పట్టుదల ఎక్కువైంది

"ఫర్వాలేదు... చెప్పండి..." అన్నాడు.

"అతిగా వాగే వాళ్లంటే నాకు పరమ అసహ్యం. పైగా నాకు అర్థం కాని భాషలో మీరు వాగుతుంటే నాకు చిరాకు కల్గింది.. దయచేసి నోరు మూసుకుంటారా... అని చెప్పేందుకు మీ వైపు చాలా సార్లు చూశాను. మీ ముఖం చూసి మళ్లీ ఎందుకో జాలి కలిగి ఊరుకున్నాను. మీ అర్థంకాని వాగుడు భరించాను..." అంది ఆ సుందరాంగి.

నీరసించి పోయాడు ఆనందరావు. ఎవరి కోసం ఆ వాగుడు ఉద్దేశింపబడిందో అది వారిని చేరలేదు. తన పరపతిని పెంచకపోగా 'వాగుడుకాయ' అన్న బిరుదు దక్కించుకున్నాడు ఆ సుత్తి ద్వారా.

ఘోరంగా దెబ్బతిన్నాడు. బ్రహ్మాండంగా పేలుతుందని పదిమందినీ పిలిచి వెలిగించిన టపాకాయ... తుస్సుమంది.

చేతుల్లో ముఖం దాచుకుని వుండిపోయాడు. రైలు గమ్యం చేరి దిగే వరకూ ఒక్కమాట కూడా మాట్లాడలేదు అతను.

O

**Editorial Adviser: *S. RADHAKRISHNA*, Editor: *VEERAJI*,**
**Printed and Published by *S. NAGESWARARAO* for Nageswara Rao Estates Ltd.,**
**at the Andhra Patrika Press, Gandhi Nagar, Vijayawada-520003.**
**Phones: Editorial: 75667, Business: 61247, 61248.**

